**AANDHRA VIIRULU**
Tirumala Ramachandra

**ఆంధ్రవీరులు**
**తిరుమల రామచంద్ర**

సంపాదకులు
**డా॥ డి. చంద్రశేఖర రెడ్డి**

ముద్రణ
**జూన్, 2013**

మూల్యం: రూ. **60/-**

ISBN : 978-93-82203-76-6

టైటిల్ డిజైన్
**జి.పురుషోత్త్ కుమార్**

ప్రింటర్స్
**సాయిలిఖిత ప్రింటర్స్**
హైదరాబాదు.

ప్రచురణ
**ఎమెస్కో బుక్స్**
1-2-7, బానూకాలనీ,
గగన్‌మహల్ రోడ్, దోమలగూడ,
హైదరాబాద్ - 500 029.
ఫోన్ & ఫ్యాక్స్ : 040-23264028.
e-mail : emescobooks@yahoo.com
www.emescobooks.com

పంపిణీదారులు
**సాహితి ప్రచురణలు**
29-13-53, కాళేశ్వరరావు రోడ్డు,
సూర్యారావుపేట, విజయవాడ - 2.
ఫోన్ : 0866-2436643
e-mail : sahithi.vja@gmail.com

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | బాలచంద్రుఁడు | 7 |
| 2. | రుద్రమదేవి | 26 |
| 3. | బొబ్బిలి రంగారావు | 40 |
| 4. | కట్టబొమ్మ సోదరులు | 63 |
| 5. | దళవాయి రామప్పయ్య | 89 |

# ముందుమాట

**చ**రిత్రలో వివిధ కాలాల్లో గొప్ప సాహసం ప్రదర్శించిన వ్యక్తులుంటారు. వీరిలో కొందరు చరిత్రగతినే మార్చివేసి ఉండవచ్చు. కొందరు తమ సమాజపరిధిలో గొప్పమార్పుకు కారణమై ఉండవచ్చు. కొందరు అటువంటి గొప్ప పరిణామాలకు కారకులు కాకపోయినా వారు ప్రదర్శించిన ధైర్యశౌర్యాలు, త్యాగం, ఆత్మార్పణ సుదీర్ఘకాలం బహుశా శాశ్వతంగా కూడా ప్రజలకు ఆదర్శంగా ఉండిపోతాయి. వారి సాహసౌదార్యాలు ప్రజలు కథలు కథలుగా చెప్పుకుంటారు. పాటలు కట్టి పాడుకుంటారు. కవులు వీటిని ఇతివృత్తాలుగా స్వీకరించి కావ్యాలు రచిస్తారు. కొందరి వీరుల వీరోచిత కృత్యాలు భాషలో సామెతలుగా, నానుడులుగా శాశ్వతంగా నిలిచిపోయాయి.

ఈ వీరులు విశాల భూభాగాన్ని పరిపాలించిన మహాసమ్రాట్టులు కావచ్చు, సేనానులు కావచ్చు, సామాన్య సైనికులు కావచ్చు. సాధారణ పౌరులు కూడా కావచ్చు. ఒక లక్ష్యం కోసం ప్రాణ త్యాగానికి జంకని అతి సామాన్యవ్యక్తి కూడా సాహసిగా ప్రజల అభిమానాన్ని చూరగొంటాడు, కీర్తి సంపాదించుకుంటాడు. అటువంటి అవక్రపరాక్రమాన్ని చూపిన యోధులకు జనం గుళ్లుకట్టి పూజలు చేస్తారు. నిరంతరం స్మరించుకుంటారు.

రుద్రమదేవి ఒక సామ్రాజ్ఞి. స్త్రీలు అంతఃపురాలకే పరిమితమైన కాలంలో, రాజ్యాధికారం పురుషుల గుత్తసొత్తుగా భావిస్తున్న కాలంలో ఆంధ్రదేశ సింహాసనాన్ని అధిష్ఠించి సమర్థంగా పాలించిన మహారాణి. అంతశ్శత్రువులనూ, బాహ్యశత్రువులనూ ఎదిరించి పోరాడి విజయం చేపట్టిన వీరవనిత.

పలనాటి వీరభారతంలో అభిమన్యుడు బాలచంద్రుడు. కార్యమపూడి కురుక్షేత్రంలో దాయాదుల యుద్ధంలో అసమాన పరాక్రమం చూపి అసువులుబాసిన వీరుడు. వీరులు, వీరమాతలు, వీరపత్నుల సీమ పల్నాటి సీమ.

ఆంధ్రదేశ చరిత్రలో చరిత్రగతిని మార్చగలిగిన మహాసన్నివేశాలు కాకపోయినా సర్వజనుల మనస్సులను చూరగొన్నవి, తలచుకొన్నంతలోనే నరనరానా వేడి రక్తాన్ని పారింపజేసేవి, శౌర్యాన్ని రగిలింపజేసేవి పల్నాటి వీరభారతమూ, బొబ్బిలి యుద్ధమూ. విజయనగరంతోనూ, ఫ్రెంచి వారితోనూ, నిజాముతోనూ ఒక చిన్న సంస్థానం వీరోచితంగా పోరాడింది. బొబ్బిలి రాజు రంగారావు మోచేతికి కూడా మీసం ఉందని గాయకులు గానం చేశారు. బొబ్బిలి శౌర్యానికి ఈ యుద్ధం పరాకాష్ఠ.

ఆంధ్రదేశంలోనే కాదు, వెలుపల కూడా ఎందరో ఆంధ్రవీరులు తమ పరాక్రమం చూపి శాశ్వత కీర్తిని ఆర్జించుకున్నారు. అటువంటి వారిలో పేర్కొనదగినవారు బ్రిటిషువారికి ఎదురొడ్డినిలిచిన కట్టబొమ్మ సోదరులు. మధుర తిరుమల నాయకుని దళవాయి రామప్పయ్య.

ఆత్మగౌరవం, దేశభక్తి ప్రబోధించే ఈ వీరగాథలు భారత స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఎంతో ప్రేరణనిచ్చాయి. కేవలం పోరాట సమయంలోనే కాక ఎల్లప్పుడూ ఇవి ఎల్లవారికే స్ఫూర్తినిచ్చేవే.

భవిష్యత్తరాల వారికి స్ఫూర్తిదాయకమైన ఈ ఆంధ్రవీరుల వీరగాథలను సుప్రసిద్ధ పండితులు తిరుమల రామచంద్రగారు రచించారు. ఇది రామచంద్రగారి శతజయంతి సంవత్సరం. ఈ సందర్భంగా వారిని స్మరిస్తూ ఆంధ్రవీరుల సాహసగాథలను ఆంధ్రప్రజానీకానికి సమర్పించు కుంటున్నాం.

**సంపాదకులు.**

# 1. బాలచంద్రుఁడు

"కార్యమపురమందు ఘనపరాక్రమతఁ
దండ్రులు నిలుచుండి దండుసేయంగ
నేనిట నుండుట నీతియే? తల్లి!
యుండుమంటకు నీకు నొప్పునా మనసు?"

– పల్నాటి వీర చరిత్ర

భారతభూమి పోటుమగల పుట్టినిల్లు. ఉగ్గుబాలతో లగ్గలు పట్టనేర్చిన బాలవీరులకు మననాటఁ గొదువలేదు. అభిమన్యుఁడు, ఘటోత్కచుఁడు, బభ్రువాహనుఁడు, నానా సాహబ్, తాంతియాతోపే, ఛత్రసాలుఁడు, మున్నుగాఁగల చిఱుతల చరితము మనకిప్పటికిని వెలుఁగుబాటయై యున్నది. శూరసాంద్రమగు నాంధ్రావనిలో నట్టివారికోవకుఁ జేరినవారు పెక్కురు గలరు. వారికిఁ దల మానికమనఁ దగినవాఁడు నుడివినవియే పై పలుకులు. బవరమునకుఁ దన్ను బంపుమని తల్లిని వేఁడు బుదుతఁడెంతటి గండరగండఁడో! పగతుర నెంత చెండువాఁడో! ఆతఁ డెవ్వఁడో కాఁడు; పల్నాటి వీరుఁడు బాలచంద్రుఁడే.

పల్నాటిసీమ గుఱించి కొంత ముచ్చటించుట యవసరము. పల్లెనాడు ప్రస్తుతము గుంటూరుజిల్లాలో నొక తాలూకాయై యున్నది. దీనికి ముఖ్యగ్రామము గురిజాల. పలనాటిసీమ కృష్ణానది దక్షిణతీరమున సముద్రమునకు దాదాపు 120 మైళ్లదూరములో నున్నది. దక్షిణమునఁ గొండల చేతను, సాంద్రారణ్యముల చేతను నావరింపఁబడి యున్నది. తూర్పునఁ జిన్న యడవులు కలవు. నాగులేఱు, చంద్రవంక యనునవి ఇచ్చటి ముఖ్యనదులు. కార్యమపూడి నాగులేటి గట్టునను, మాచెర్ల చంద్రవంక యొద్దనను నున్నవి. పల్నాటివారు పిఱికి కండలేనివారు. వారి కులదైవతము గురిజాల గంగాంబ. వారి చెలిమికాఁడు కలనిపోతులయ్య.

అలుగురా జను నొక ధరారమణుఁడు పలనాటి సీమ నేలుచుండెను. ఇతఁ డుత్తర భారతదేశమున నున్న 'పాలమాచాపురి' యను పట్టణమున కధిపతి. దానిని 'జంభనాపురి' యనియు నందురు. అలుగురాజు యాత్రార్థియై తన దేశమును వీడి యంధ్రదేశమునకు వచ్చి పుణ్యతీర్థములసేవించి కృష్ణవేణ్ణాతీరముననున్న 'యమరావతిఁ' జేరెను. అలుగురా జున్నత వంశజుఁడగుట యెఱిఁగి 'చందనవోలు' ప్రభువు తనకూఁతు నతనికిచ్చి యుద్వాహ మొనరించి, పలనాడు నరణముగా నిచ్చెను. అప్పటినుండి యలుగురాజు పలనాటిసీమ కధిపుఁడై గురిజాల రాజధానిగా రాజ్యమేలుచుండెను.

అలుగురాజునకు భార్యలు ముగ్వురు; వీరవిద్యాదేవి, భూరమాదేవి, మైలమాదేవి. వారిలో నెవ్వరివలనను నా భూపతి కెంతో కాలమునకును సంతు కలుగలేదు. దాన నాతఁడు మిక్కిలి చింతించి, తుదకుఁ దన మంత్రియగు దొడ్డనాయని జ్యేష్ఠపుత్రుఁడగు పెద్దనాయనిఁ బెంచుకొనెను. ఇతనిని బాదరాజు, బాదన్న యనియు ననెడివారు. ఇతనినిఁ బెంచుకొనిన పిదప నలుగు రాజునకు వీరవిద్యాదేవియందుఁ బెదమల్లదేవుఁడు, పినమల్లదేవుఁడు, బాలమల్లదేవుఁడు నను మూగురు పుత్రులు; మైలమాదేవియందు నలగామరాజు; భూరమాదేవి యందుఁ గామరాజు, నరసింగరాజు, ఝుట్టిరాజు, పెరుమాళ్ల రాజు నను నల్వురు సుతులు జనించి శుక్లపక్ష చంద్రుని వోలె దినదినాభివృద్ధి నందుచుండిరి.

దొడ్డనాయఁడు మంత్రిగ నలుగురాజు కొంతకాలము పరిపాలించి మరణింపఁగా నలగామరాజు పట్టమునకు వచ్చెను. దొడ్డనాయఁడును స్వర్గమున కేఁగెను. దొడ్డరాజు ద్వితీయనందనుఁడు బ్రహ్మనాయఁడు నలగామరాజునకు మంత్రియయ్యెను.

బ్రహ్మనాయఁడు బాల్యమునుండియు నసమానశూరుఁడు; అనుపమ విద్యాకుశలుఁడు; ఆలోచనలలో మేటి; దూరదృష్టిలో దీటులేనివాఁడు; శాంత శమదమాది గుణముల కాటపట్టు; ధీరోదాత్తుఁడు; వైష్ణవమతానుయాయి; పల్నాటి కృష్ణుఁడని వాసిగన్నవాఁడు.

బ్రహ్మనాయఁడు మంత్రియయినది మొదలు కడునిపుణతతో రాచకార్యములఁ జక్కబెట్టుచు నలగామరాజునకుఁ దలలో నాలుక వలె నుండెను. ప్రజల దెందంబుల నతఁడు దండిగొనెను. బ్రహ్మనాయనికిఁగూడ బహుకాలమువఱకును సంతానము గలుగలేదు. ఈ కతమున నతఁడు కన్నమదాసను నొక హరిజన బాలునిఁ బెంచుకొనెను.

## నాయకురాలు

బ్రహ్మనాయని కీర్తి కొందరి కనులుకుట్టెను. వారిలో ముఖ్యురాలు నాయకురాలు. నాయకురాలి పేరు నాగమ్మ. పల్నాటి సీమయందలి నాగులేటియొడ్డున జిట్టగామాల పాడను గ్రామమున నీమె జన్మించెను. ఈమె పెంపుడు తండ్రి చౌదరి రామిరెడ్డి. ఇతఁడు కడు బీదరైతు. ఇతఁడొకనాఁడు తన పొలమునఁ బనిచేసికొనుచుండఁగా దగ్గఱనున్న పొదలో నుండి పసిపాప యేడు పాతని చెవిసోఁకెను. వెంటనే యాతఁడా ప్రదేశమునకేఁగి యచట నొక యాడు నిసుగుండుటఁ గనెను. ఆ శిశువు నింటికి గొంపోయి నాగమ్మ యని నామకరణమొనర్చి కన్నకూఁతుఁబోలె నెంతో ప్రేమమెయి సాకఁదొడఁగెను.

నాగమ్మ వచ్చినదాది రామిరెడ్డి యిల్లు నిత్యకల్యాణము పచ్చతోరణమయ్యెను. పాడిపంటలు పదింతలై సిరిసంపదలతోఁ దులఁదూగసాగెను. ఆ రామిరెడ్డికి నిధి నిక్షేపములు కూడ లభించెను. అతఁడు తన గారాబుపట్టినిఁ జదువవేసెను. అతి కుశాగ్రబుద్ధియయిన యాయమ సకలవిద్యలను, రాజ్యతంత్రమును బాల్యమునందే గ్రహించెను.

రామిరెడ్డి యామె నొక శ్రీమంతునకిచ్చి పెండ్లిచేసెను. కాని, యామె చిరకాలము సంసారసుఖ మనుభవింపలేక పోయెను. ఆమె మగఁడు కొంతకాలమునకే యకాలమరణము వాతఁబడెను. మరి కొంతకాలమునకు నామె పెంపుడు తండ్రియు గతించెను. ఆమెకు నపారమగు భర్త యాస్తి యంతయు లభించెను. దానితో నకస్మాత్తుగ నామె పల్నాటి సీమలో నొక ప్రముఖయయ్యెను.

నాగమ్మ శక్తియుక్తులు గలది. దానికి తో డైశ్వర్యమబ్బినది. ఇక నామెకోరికలు కొనసాగుటలో నబ్బురమేమి? పల్నాటి రాజ్యమును తన వ్రేలిపై గిరగిరఁ ద్రిప్పవలెనని యామె సంకల్పించెను. దానికోస మామె యెత్తుపై యెత్తులు వేయుచు వేచియుండెను. తుద కట్టి పదనైనయదను చిక్కెను.

నలగామఁ రాజొకనాఁడు వేఁటాడ సపరివారముగ నరణ్యమునకుఁ బోయెను. నిప్పులు చెరగు మిడియెండలో నతఁడా కాకులుదూరని కారడవిని వేఁటాడి యలసి విశ్రమింపనెంచి వచ్చుచుండగా, నొకచోటఁ బెద్ద కుటీరముండుటఁ గనెను. పెన్నిధిగన్న పేదవోలె నటకరుదెంచి త్రాగుటకు మంచి నీరడిగెను. అడుగుటయే తడవుగా నతనిని యొక యువతి యాహ్వానించి యుప్పుతోఁ దొమ్మిది భోజనపదార్థములు వడ్డించి

తనివి నొందించెను. నలగాముఁ గామె యాతిథ్యమునకు మెచ్చి యేదియేని వరము కోరుమనెను. ఆమె యెంతయో సంతోషించి తాను పల్నాటిసీమను కొన్ని గడియలపా టేలునట్లు వరము కోరెను. రా జియ్యకొనెను. ఈ యాతిథేయ మరి యెవ్వరో కాదు, నాగమ్మయే!

పిదప కొన్నినాళ్లు చన, నాగమ్మ రాజును దర్శించి యాతడిచ్చిన వరము తెలియఁజెప్పి రాజ్యము నప్పగింపఁగోరెను. నలగాముఁడు వల్లెయనెను. నాఁటగోలె నలగామరాజు నాగమ్మ చేతి కీలుబొమ్మ యయ్యెను. క్రమముగా నాగమ్మ తన మంత్రాంగము పాటించెను. బ్రహ్మనాయఁడు మోసగాఁడనియు, ద్రోహచింత నుఁడనియు గొండెములు చెప్పి యతనియెడ రాజు మనసు విఱిచివేసెను. రాజు సవతి తమ్ములగు పెదమలి దేవరాజు, పినమలి దేవరాజు, బాలమలిదేవరాజునను వారిపై నతనికి ద్వేషము బుట్టించి, వారినిఁ జంపింపనెంచెను. బ్రహ్మనాయని తల్లి శీలమ్మ వారిని మిత్తివాతనుండి తప్పించి తన కొమరుని కప్పగించెను. అతఁడు వారినిఁ గాపాడఁ దొడఁగెను.

నలగామునొద్ద నిక తనకు మంత్రిత్వము పొసఁగదని నాయఁడు తెలిసికొనెను. నలగామునిచే మాచర్ల భూభాగము మలిదేవునకిప్పించి, మాచర్ల రాజధానిగా నతని పక్షమున రాజ్యమేల దొడఁగెను.

## బాలచంద్రుని జననము

బ్రహ్మనాయఁడు హరిజన కన్నమదాసునుఁ బెంచుకొనుచున్నను నతని భార్య ఐతమ్మకు మాత్రము పుత్రులు లేని చింత బాధించుచుండెను. సంతానము కొఱకామె యనేక వ్రతముల నొనర్చెను. అవనిలోఁగల నోములన్నియు నోఁచెను. తఱచుగా దానధర్మములఁజేసెను. సద్భక్తితో దక్షిణ తాంబూల తతులుగూర్చి, పేద విప్రులకుఁ బెండ్లిండ్లు చేసెను. పాడైన దేవాలయములఁ బూజానైవేద్యములఁ బొందించెను- ఆమడామడకొక యన్నసత్రము వెలయఁగఁజేసెను. అడవులలోఁ జలిపందిళ్లు వేయించెను. శ్రీశైలమునకేఁగు భక్తతతికి రాగి కమండలువులుఁ, గప్పెర చయము నిచ్చెను. శ్రీశైల మల్లికార్జునునికి శ్రీభ్రమరాంబకు రజతకాంచనములు పొదివిన కూష్మాండఫలము లర్పించెను. గౌరీమహేశ్వర పర్వతమునెక్కి నోములు నోఁచెను. ఏలేశ్వరక్షేత్రమున నొక వ్రతము, తిలపర్వతమున విష్ణుకాంతవ్రతము, సంధ్యవర్తి నోము, జగజ్జ్యోతివ్రతము, ఏకబాణపునోము, పచ్చవిల్తునోము మున్నుగా నెన్నియో

నోఁచెను. నందీశ్వరునకుఁ బులగంబు చేయించెను. శ్రీశైల మార్గమున రావిచెట్లునాటి, రమణీయ కాంచన రజత తంతువుల నా చెట్లకుఁ జుట్టించి పెండ్లి చేసెను. కేదార వ్రత మాచరించెను. కాన వచ్చిన గుంటికెల్లఁ జేయెత్తి మ్రొక్కెను. తుదకుఁ గాత్రేనికిని జోతలిడెను. ఇంత చేసినను ఏ దేవుఁడైనను మెచ్చి వరమీఁడయ్యెనని యామె చింతతోఁ గుందసాగెను.

ఇట్లుండ నొకనాఁడు వినువీథియందు క్రింది వాక్యములు వినఁబడెను. "పుత్రీ, గజనిమ్మనోము సలుపుము, సంతానము గలుగును!" ఆ యశరీరవాణి పలుకులకు ఐతాంబ మిగుల నానందమొంది, పెద్దలగు విప్రులం బిల్వనంపి వారికా విషయము దెలియఁజేసి, గజనిమ్మనోము నోఁచువిధాన మెఱిఁగింపఁ బ్రార్థించెను. వారును సంతోషమున వ్రతకల్ప జాలములు దెప్పించి, శోధించి యిట్లనిరి. "ఓ చానా, ఈ వ్రతము శాస్త్రమందున్నది. సంవత్సరకాల మీ వ్రత మాచరింపవలెను. ఇది విష్ణుదేవున కింపైనది. కృష్ణతో సమమగు నీ చంద్రవంకలోఁ దానమాడి, సరిగంచు పట్టుకోకలు ధరించి, నొసటఁ గుంకుమ పసుపులు దాల్చి, గంధమున దనువు నలంది, సంతోషముగాఁ జెన్నకేశవుని యాలయమున కేఁగి, యాస్వామికి ధూపదీప నైవేద్యము లర్పించి, యాయాలయ శృంగారవనములోపలఁ జెన్నారు నిమ్మచెట్టును గదిసి, దానిచుట్టు నూడ్చి యలికి మ్రుగ్గులు సింగారించి, వనదేవతను భక్తితో నావాహనముచేసి, దేవాలయావరణముననున్న పలకలబావినీరు దెచ్చి నిమ్మపాదులోఁ భక్తితోఁబోసి, సకలోపచారము లొనర్చి విప్రసంతర్పణ గావించుచుఁ, జెన్న కేశవునీరీతి భావించుకొనుచు వ్రతమాచరింపవలెను. కొన్నాళ్ల కా నిమ్మకొమ్మ లిగిర్చి పుష్పించి ఫలించును. ఆ పండ్లఁ జెన్నుని కర్పణసేయుము. సంతానమబ్బును."

ఐతాంబయు నా భూసురులు చెప్పిన విధంబున నేడాది తదేకనిష్ఠతో వ్రతమాచరించెను. కడపటి దినము నా నిమ్మపండ్లనుఁ జిదిమి తెప్పించి, పసిడి పళ్లెరములఁబోయించి, విప్రాంగనలఁ బిల్వఁబంచి, చెన్నకేశవుని యాలయమున కరిగెను. ఆమె వెంటఁ బెక్కండ్రు చెలికత్తెలు కానుకలుగొని వచ్చిరి. మంగళవాద్య నినాదములు మిన్నుముట్టెను. నట్టువకత్తెలు నాట్యమాడిరి. ఇట్లు ఐతాంబ యాలయముఁ బ్రవేశింపఁగనే, పూజారులు తాళములుదీసి, తలుపులు తెఱచిరి. చెన్నకేశవుని చెన్నైన రూపు కన్నుల పండువుగాఁగ నందఱకుఁ జూపిరి. ఐతాంబ జంబీర ఫలములున్న జాలవల్లిక స్వామి కర్పణము సేయఁగా స్వామికృపమాని పడమటి ముఖమాయెను. 'ఒక్క హాయనమునుండియుఁ జేసిన సేవఁ వృథయయ్యెఁగదా!'

యని యామె మిగులఁ జింతించి, గుండె ఝల్లుమన, గద్గదస్వరముతోఁ బరిపరివిధముల నాస్వామిని సన్నుతించెను. ఐనను జెన్నకేశవుఁ డను గ్రహింపకుండుటఁగని, యామె రోషపూరితయై నొఱల మట్టుకు కత్తులురవడి దూసి ఱొమ్మునఁ గ్రుచ్చుకొనఁబోగా నభిముఖుఁడై యర్చకునియం దావేశించి "ఓ సతీమతల్లీ! నీ భక్తికి మెచ్చితిని. నీ మనసు నిల్కడ మర్మంబు లరయఁదలఁచి నేనటు మల్లితిని. భయమందకుము" అని యాతనిచేఁ బలికించెను. ఐతాంబ యమందానందముతో దోసిలియొగ్గి జోహారులర్పించుచుండఁగాఁ బల్లెరములోపలి ఫల మొకటి యెగిరి వచ్చి యాదోసిటఁబడెను. ఐతాంబ సంతోషంబున మఱియు నుప్పొంగి, యా ఫలమొక విప్రాంగనకిచ్చి, తనకునుఁ దన చెలులకునుఁ బంచి యిమ్మనెను. ఆమెయు నా నిమ్మపండు నెనిమిది భాగములు చేసి యార్వురు సతులకుఁ బంచియిచ్చి, ఐతాంబ కొకటిచ్చి, తానొకటి గైకొనెను. పిదపఁ గొంత కాలమునకు నందఱు గర్భవతులై సుపుత్రులఁ గనిరి. ఐతాంబకుద్భవించిన వాఁడు బాలచంద్రుఁడు. కనుకనే చెన్నకేశవుని వర మమోఘమైనదని శ్రీనాథుఁడిట్లు నుడివినాఁడు.

ఉ. చిత్తముగూర్చి మాచెరల చెన్నుఁడు శ్రీగిరిలింగముం గృపా
యత్తతఁ జూడఁ బల్లెవిషయంబున కా మహిమంబు చెల్లెఁ గా
కుత్తరలోన మింట జల ముట్టిన మాత్రన నాపఱాలలో
విత్తిన యావనాళ మభివృద్ధి ఫలించుట యెట్లు చెప్పుమా?

## బాల్యము

ఐతాంబబ్రహ్మనాయల యానందమునకు మేరయే లేదు. ఎన్నియో నోముల పంటఁగాఁ గలిగిన కుమారుఁడు, అల్లారు ముద్దుగఁ బెరుగుట యబ్బురమా? ముద్దుల మూట గట్టు నా బాలుఁడు క్రమముగఁ దోగాడుచుఁ, దప్పటడుగులు వేయుచు నందరి డెందంబుల నుల్లసిలఁ జేయుచు దినదిన ప్రవర్ధమానుఁడై, పెద్దయై, యాటపాటల నగ్రగణ్యుఁడై తోడివారిలో మేటి యయ్యెను. బాలచంద్రుని కై దేండ్లు పడఁగనే బ్రహ్మనాయఁడతనిఁ జదువవేయఁ దలఁచెను.

కొన్నాళ్లు వెన్నెల! కొన్నాళ్లు చీకటి! కాల మొకే రీతినుండునా? బ్రహ్మనాయఁ డొకనాఁడు కొలువుదీర్చి జ్యోతిష్కులఁ బిలువఁబంచి, తన కుమారుని భావి జీవిత ఫలములఁదెలుపఁ గోరెను. వారును జన్మనక్షత్రాదు లెఱిఁగి జాతకము గుణించి, మేషాది ద్వాదశ రాశిఫలంబులు, భావఫలంబులు నరసి, "ఈ జాతకుని తండ్రికిఁ

గొలందిి కాలములోననే ప్రాణహాని కలుగఁగలదు" అని నుడివిరి. ఆ నుడువులకు బ్రహ్మనాయఁడు విస్మితుఁడై యేమియుదోచక, బాలచంద్రుని వధియించినఁ దనకు రానున్న మృత్యువు తొలఁగునని నమ్మి యా తెఱఁగాలోచింపఁ దొడఁగెను. ఇంతలో నతనికి తన పెంపుడు కొడుకు హరిజనకన్నమదాసు స్మృతిపథమున గోచరించెను. వెంటనే యతఁడు కన్నమదాసును బిలచి, "బాలచంద్రునిఁ జంపివేసి రమ్ము" అని ముదలయిడెను. తన పెంపుడు తండ్రి మాటలు విని కన్నమదాసు గుండెలవిసిపోయెను. తన సోదరతుల్యుని నెట్లు వధించుట? తండ్రి యాజ్ఞ యెట్లు మీఱుట? అతనినోట మాట రాదయ్యెను. అతఁడు కొంతసేపటికిఁ దెప్పరిల్లి తండ్రి కాళ్లపైఁ బడి సోదరునికిఁ బ్రాణభిక్ష పెట్టుమని ప్రార్థించెను. కాని, బ్రహ్మనాయని ముదల వెనుదిరుగునది కాదు. కన్నమదాసు బాలచంద్రుని వధనిమిత్తము గొనిపోయెను. ఇంతలో నాతనికొక యూహ దోచెను. "బాలుని రహస్యముగాఁ గాపాడి, 'చంపివచ్చితిని' అని బ్రహ్మనాయనికిఁ దెలిపిననేమి? నాయఁడిప్పుడు వధింప నుత్తరు వొసఁగినను ముందుముందు మనసుమారి పుత్రునిపై వాత్సల్య ముదయింప వచ్చునేమో!" ఇట్లతఁ డాలోచించి బ్రహ్మనాయని సోదరుఁడగు పేరినాయని యింట బాలచంద్రుని రహస్యముగ నునిచి కాపాడఁ దొడఁగెను.

బాలచంద్రుఁడు పేరినాయని యింటఁ బెరిగి పెద్ద వాఁడయ్యెను. యుద్ధరంగ తత్త్వమునను, రణనీతియందును, నస్త్రశస్త్రముల సంధానమునను నాఱితేఱెను. గుఱ్ఱపు సవారీలో దిటవుగడించెను. ఏనుగుఁనెక్కి యుద్ధముసేయ నేర్చెను. అతఁడు తండ్రిని మించిన కుమారుఁడు, మహా బలవంతుఁడు, భూరిపరాక్రమశాలి, మేటి విలుకాఁడు, అతి సుందరుడు.

బాలచంద్రుఁడిట్లు నూనూఁగుమీసాల నూత్నయౌవనమున విరాజిల్లుచుఁ దన చిన్ననాఁటి నేస్తు లార్గురు బ్రాహ్మణ అనపోతు, వెలమ బోర్నీఁడు, చాకల చందన్న, మంగల మంచన్న, కుమ్మరి తేర్కుఁడు, కంసాలి చంద్రన్నలతో నాటపాటల వినోదించుచుండెను.

ఇది యిట్లుండ, మాచర్లలో గందు కన్నమనాయఁడను నొక ధనవంతుఁడుండెను. ఆయన తన కుమార్త మాంచాలకుఁ దగిన వరునిఁగానక బ్రహ్మనాదుల నిండుకొలువులో నీ సంగతి ముచ్చటించెను. అపుడు బాలచంద్రుఁడే మాంచాలకుఁ దగిన వరుఁడని కన్నమదాసు నిశ్చయించి, "త్వరలో నీ కూఁతునకుఁ దగిన వరుఁడు లభించును," అని కన్నమనాయనితోఁ బలికెను.

కొలఁది దినములు గడువగా నొకానొక దినమున బ్రహ్మనాయఁడు కొలువుదీర్చియుండ నాజానుబాహువగు నొక వీరశిఖామణి వారి కట్టెదుట నిలచెను. అతని మేనిచాయ యపరంజిని యాక్షేపించుచుండెను. అతని కనులప్పుడు విచ్చిన కమలములవలె సుందరముగ, సరసముగ నుండెను. అతని యలకలు లలాట పర్యంతము వ్రేలాడుచుండెను. గంభీర సుందరుఁడగు నాతనిఁజూచి యందఱు నాశ్చర్య చకితులైరి.

అంతటఁ గన్నమనాయఁడా నవయువకునిఁ వృత్తాంతము కొలువువారికి వివరించి యతఁడే బాలచంద్రుఁడనియు, మాంచాల కీడగు పతియనియుఁ దెలిపెను. బాలచంద్రునిఁ గనినంతనే బ్రహ్మనాయఁడు మఖమటు ద్రిప్పివైచి, మహోగ్రుఁడై కన్నమదాసును మందలించి, బాలచంద్రుని చంపించి రమ్మని మఱల నాజ్ఞయిడెను. కాని కొలువుదీర్చిన పెద్దలు బ్రహ్మనాయని యనునయించి బాలచంద్రుని స్వీకరింపుమని వేఁడుకొనిరి. వారందఱిమాట కాదనఁజాలక యాతఁడు వల్లెయనెను. పిదప నొక శుభముహూర్తమున గండు కన్నమనాయఁడు తన కుమార్తెను బాలునకిచ్చి కల్యాణమహోత్సవ మొనరించెను.

బ్రహ్మనాయఁడు మాచర్లకు వచ్చినను నాయకురాలు పగ మానలేదు. ఏదియే నొక విధముగ నాతని నవమానపఱచి యపకారము చేయనెంచుచునే యుండెను. మాచెర్లను దోపిడి చేయించుటకామె కొందఱు దొంగలఁ బంపెను. వారు వర్తకుల వేషమున వచ్చి యొకనాఁటి యర్ధరాత్రివేళ మలిదేవుని బొక్కసమును దోచుచుండిరి. కావలివాఁడొకఁ డంతలో మేల్కొని సంగతి యెఱిఁగి చయ్యనఁ గన్నమదాసునకుఁ దెలిపెను. కన్నమదాసు తక్కినవారిని మేల్కొల్పిన నిద్రాభంగ మగునని యెంచి యొక్కఁడే యొక్క యుదుటున నా దొంగలపైఁ బడి తన కరవాలముచేఁ దునాతునకలు కావింపసాగెను. కొందఱు దొంగలు కాందిశీకులు కాఁగా, మఱికొందఱు పట్టుబడిరి. కన్నమ శక్తియుక్తుల నెల్లరు మిక్కిలి కొనియాడిరి. ‘దొంగల వీపులపై నిసుక గోనెల నెత్తించి, మాచర్ల నుండి గురిజాలవఱకు గొఱ్ఱెలవలెఁ దోలుకొని పొ’మ్మని బ్రహ్మనాయఁడు కన్నమదాసునుఁ బనిచెను.

కన్నమదాసు గురిజాలకు వచ్చి నలగామరాజును దర్శించి యతని కీసంగతి మనవిచేసెను. ఇదంతయు బ్రహ్మనాయని మోసమనియు, నమ్మఁదగినది కాదనియు నాయకురాలు నలగామునికి నచ్చఁజెప్పి, చోరులను విడిపించెను. తన జిత్తులు వమ్మయ్యెఁగదా యని యామె చింతించి, దీనికిఁ గన్నమయే కారకుఁడని యాతనిని

గురజాల పొలిమేరలోఁ బొరియింప నెన్నియో మాయోపాయములు పన్నెను. కన్నమదాసు నెదుట నీ యెత్తులు ఫలించినవి కావు!

బ్రహ్మనాయని దిక్కులపాలు చేయుటకు నాయకురాలు మఱియొక తంత్రము పన్నెను. ఒకనాఁడు నలగాముని దూతయొకఁడు మాచెర్లకు వచ్చి బ్రహ్మనాయని కొక కమ్మనందించెను. రానున్న సంక్రాంతి పండుగనాఁడు గురిజాలలోఁ గోడిపందెము లేర్పాటు చేసితిమనియు, నాయఁడు తప్పక రావలయుననియు నా కమ్మలోని లేఖార్థములు. ఇది నాయకురాలి పన్నుగడయే యని బ్రహ్మనాయఁడు గ్రహించినను పిలిచినపుడు పోవకుండుట యనుచితమనియు, బౌరుషలక్షణమును గాదనియు నాహ్వానమునకు వల్లె యనియెను.

## యుద్ధసన్నాహము

సంక్రాంతిపండుగు నాఁటి కందఱునుఁ గురిజాలఁ జేరిరి. నలగామ మహారాజు బ్రహ్మనాయని కెదురేఁగి యెంతయో గారవంబున నతనిఁ దన సరసన గూర్చుండ బెట్టుకొనియెను. కోడి పందెము లారంభమయినవి. పోరనున్న కోళ్లలో నొకటి నలగామభూమిపుని దనియు, మఱియొకటి బ్రహ్మనాయని దనియు నిర్ణీతమయి యుండెను. ఎవరి కోడి యోడిన, వారు తమ రాజ్యము రెండవవారి కప్పగించి, ఏడేండ్లు ప్రవాస మొనర్పవలెనని యొప్పందము జరిగెను. ఈ సారి నాయకురాలి ప్రయత్నము ఫలించెను. దురదృష్టవశమున బ్రహ్మనాయని కోడి యోడెను. అతఁడు మాచర్ల రాజ్యము నలగామున కొప్పగించి యామఱుసటిదినమే మలిదేవాదులు వెంటరా మండాదికి వలస వెళ్లెను.

బ్రహ్మనాయఁడు, మలిదేవాదులు మండాదియందును మహావైభవముతో వఱలుచుండిరి. ఇది నాయకురాలికిఁ దెలిసినది. వారి ప్రాభవమున కామె కన్నులలో నిప్పులు పోసికొన్నది. వారిని డిందు పఱచుటకు వారిపై నామె కోయవారి నుసికొల్పెను. బ్రహ్మనాదులట నుండలేక కృష్ణవేణ్ణ దాఁటి శ్రీశైలముచేరి యటఁ గొన్నాళ్లుండి శ్రీశైలప్రభువు నుండి కొన్ని గ్రామములు గుత్తగొని వీరమేడపియను పట్టణము రాజధానిగా నుండిరి.

ప్రవాసకాల పరిమితి ముగిసెను. 'కోడిపోరిలో నోడిన నాఁటి యొడంబడిక ననుసరించి యేడేండ్లు గడచినవి కావున మాచర్ల రాజ్యమును మరలఁ దమ కీయవలయు'నని నలగాముని కడకు బ్రహ్మనాయఁడు అలరాజను వానిని

రాయబారమంపెను. అలరాజు నలగామునిఁ యల్లుండు. అల్లుని మొగము చూచియైన నలగాముండు మొగమోట పడునని నాయండు భావించెను.

అలరాజు మామకొలువు చేరి మలిదేవులకు వారి రాజ్యభాగము నీయవలసినదని యతనిం బ్రార్థించెను. నాయకురాలి మాటలకు నలగాముండు బేలుపోయి యల్లుని మాటలు పెడచెవిని బెట్టెను. నాయకురాలు అలరాజును విషము పెట్టి చంపించెను. అతని భార్య నలగామరాజు కుమార్త పేరమ్మ నాయకురాలిని, దన తండ్రిని శపించి భర్తతో సాగుమానము (సహగమనము) చేసెను.

రాయబారి యయి వచ్చిన యలరాజును విషము పెట్టి తుదముట్టించిన నాయకురాలిపైని, నలగామరాజుపైని, వీరమేడపిలో నందఱును మండిపడిరి. యుద్ధమే యిక శరణ్యమని వారు నిర్ధరించిరి. ఇక సమర సన్నాహము మొదలయ్యెను. బ్రహ్మనాయండు భట్టుమూర్తి యనునతని నలగామరాజు కడకుం బంపి యతనిని కార్యమపూడికి 'సంగరము సేయ ర'మ్మని తెలుపుమనెను–

భట్టుమూర్తి నలగాము కడకరిగి 'పోరువల'దని, 'బ్రహ్మనాయనితో నొడంబడు'మని ఎంతో బతిమాలెను.

"పోరు మంచిదిగాదు భూమి నెక్కడను,
పాడౌను దేశంబు పగ మించెనేని.
ప్రజలెల్ల నశియించి పాటిపోవుదురు.
... ... ... ...
చెడును యశంబును జెడును శౌర్యంబు.
చెడును రాజ్యంబులు. చెడ్డ పిమ్మటను
దేశంబు పరన్నపాధీనమౌ సుమ్ము!
పార తంత్ర్యంబు మీ పైం బడంగలదు.
పరతంత్ర జనముల పాలికష్టములు
చెప్పంగ నలవియే శివునకు నైన?
పంజరంబుననున్న పక్షులరీతి,
బంధించి పాములవాండు పెన్బుట్టం
బదిలతం బెట్టిన పాముల భంగి,
గంగిరెద్దుల వాండు కావర మణంచి
ముకుదాడు పొడిచిన పోతెద్దులట్లు,

బోనులోనుంచిన పులుల విధంబు,
స్వాతంత్ర్య రహితతc బడియుండవలయు"

– పల్నాటి వీరచరిత్ర

అని పలు తెఱcగుల నీతులు సెప్పినను నలగామునcడు విననొల్లcడయ్యెను. పిదప భట్టు కార్యమపూడికివచ్చి గురిజాలలో జరిగిన వృత్తాంతము నాయనికిc దెలిపెను.

## కార్యమపూడికి సేనల పయనము

బ్రహ్మనాదులు రాణివాసము గాచుటకు బాలచంద్రాదులను, మాడచియను దాదిని మేడపియందే యుంచి యానందముతో నటమీcద కార్యమపూడికిc బయనమైరి. రణభేరి మ్రోగసాగెను. గొల్లెములు (గుడారములు) కట్టిన గొప్పబండ్లు, బల్లాని పెట్టెలు, పట్టెమంచములు, పీటలు, తమ్మ పడిగెలు, వింత మందసములు, గొడ్గులు, వాసన పెట్టెలు, బొక్కసములు, బోనగావళ్లు, పడివాగెతేజీలు, పాలకీ జోళ్లు, అష్టభాగ్యములతో నంగళ్లవారు సందడిపడగా దండు కదలెను. దండుముందు డమాయీలు, మురజములు, బూరలు, భేరీలు, పోcటుధారలు, కాహళులు, వంకిణులు, కాలికొమ్ములు, శంఖములు, సన్నాయిజోళ్లు, మురళి, ముఖవీణె, తప్పెట్లు, డోళ్లు, తమ్మటంబులు, వీరణములు, రుంజలు, చేగంటలు, చిఱుగంటలు మున్నగు వాద్యముల మ్రోcతకు గగనము ప్రతిధ్వనించెను. శకటచోదకులు తమయెడ్లను "అందెల బసవన్న ఆదినాథ, సందులపిడిఘంట, నాగవాసయ్య, గోవులచెలికాcడ, గోగుబయ్యన్న, వంటరి పలిజంకు, వర పెరుమాళ్లు, కట్టని కలుకోట, కరినంది రంకె" మున్నుగాc బేరుపేరునc బిలచి తోలసాగిరి.

## మేడపిలో బొంగరములయాట

ఇcట వీర మేడపిలో బాలచంద్రున కుబుసుపోలేదు. కదన రంగమున కేcగcదలcచిన యాతనికిని మేడపిలో మిన్నకుండుట యెంతయేనిc గష్టముగనుండెను. అయినను బెద్దలమాట కెదురాడవచ్చునా? మేడపియందుc గడుపక తప్పినది కాదు. కావున దెచ్చి పెట్టుకొనిన యుత్సాహముతో సంగడి బాలురతోc గ్రీడావినోదంబులు సలుపుచుండెను. వారు వేడుకతో నొకప్పుడు గుమ్మడికాయలయాట యాడిరి. చెఱకు పందెము లొడ్డిరి. ఇట్లుండ నొకనాcడు బాలచంద్రునకు బొంగరములాడc గుతూహలము పుట్టెను. పుట్టుటయేతడవుగా నతcడు తల్లి కడకుcజని బంగరు

బొంగరము చేయింపుమని వేఁడెను. ఐతమ్మకు బొంగరాలాట యనినఁ గడు భయము. కాన నామె చాల కలఁగి కుమారునితో నిట్లనియె.

"నాయనా బొంగరా లాడవలదు. అవి యే యతివలకైన, బాలురకైనఁ దాఁకిన వారు శపియింతురు."

బాలచంద్రుఁడు: అమ్మా! వారికిఁగూడ నావంటి కొడుకులుండరా? వారేల శపియింతురు? భయపడకుము.

ఐతమ్మ: కుమారా! దుష్టులు, తులువలు; దుర్వాచకులుఁ దారతమ్య మెఱుఁగరు. కచ్చెకు ముందుగ కాలుదువ్వెదరు.

బాల: అమ్మా! నేను దుష్టుఁడను గాను, ధూర్తుఁడను గాను. నన్ను ఇతరవనితలు తనయునివలెఁ జూతురు. వెంటనే నా ముచ్చటఁ దీర్పుము.

అంత నైతమ్మ మారుమాటాడలేక యొజ్జలఁబిలిపించి తన యెదుటనే బంగరు బొంగరముసేయ నానతిచ్చెను. కంసలి యొజ్జలు పట్టెడ, కారు, కమ్మచ్చులు, నీరుకారు, సుత్తె, పడచ్చులు, కత్తెరలు, ఉచ్చులు, గుదులు మొదలగు పనిముట్లు గొనివచ్చి, చదురేర్చి, కూర్చుండి, పనిముట్లు పఱచి పెద్దమూసల బంగారు నిండించి, కరఁగించి బొంగరములు నిర్మించిరి.

బాలచంద్రుఁడు బొంగరములు గైకొని మిత్రులు వెంటనడువగా మొల్ల రావి యను ప్రదేశముఁజేరి బొంగరాలాడఁ బూనెను. వారు బొంగరాలాడు పొంకమంతయు నూరి వారికిఁ దెలిసెను. ఆబాలగోపాలము తండోపతండములుగా నాయాటఁ జూడఁ నరుగుదెంచిరి. అన్నమ్మయను వైశ్యకామినియుఁ దన చెలియగు నొక బ్రాహ్మణి వెంటరా నాటఁ జూడ వచ్చెను. బొంగరాలు గిరగిర తిరుగసాగెను. బాలచంద్రుఁడు తన బొంగరము పెక్కు విధములఁ ద్రిప్పుచు, నవనిపైఁ బడకుండ నంతరమందె పట్టి యాడించుచుచు, నందఱి కాశ్చర్యము కలిగించుచుండెను. ఇంతలో నాతని బొంగర మొక చత్రాతిఁ దాఁకి మింటికెగిరి యన్నమ్మ మీఁగాలికిఁ దాఁకెను. దాని ములికి యరకాలు దిగివచ్చి యవనికిఁ దాఁకెను. ఆ వైశ్యతరుణి భీతిల్లి మిన్ను విఱిఁగి మీఁద బడ్డట్టు కంపించి మూర్ఛిలి నేలఁగూలెను. వెంటనే బాలచంద్రుఁడాట యాపి యామె కడ కరిఁగి శైత్యోపచారములు సేయఁగ నామె మూర్ఛనుండి తేరుకొనెను. ఆమె బాలచంద్రునిఁజూచి కన్ను లెఱ్ఱఁగఁజేసి యిట్లని తూలనాడెను. "ఓరీ దురాత్ముఁడా! దుర్మార్గా! క్రిందుమీఁదెఱుఁగక కెరలుచున్నావు. కాంతల యెడ నీ

కింత గర్వమేటికి? నీకు నైశ్వర్యము కలిగినఁ దినవచ్చు, గట్టఁగ వచ్చును. అంతేకాని యిట్టియెఱుక మాలిన చేష్ట లేల చేసితివి? ఏల మురిసి పడెదవు? నీ పొంగెల్ల నణఁగనీ! నీ మదము, నీ మురిపెము క్రుంగిపోనీ! మల్లిదేవుని ధనమంతయు నీ యింటికిఁ జేరెనను బలముకొలఁది త్రుళ్లుచున్నావు. దుష్టుఁడా! నీ పాదములకు నారసాలేయ! చూచెడు కనులకు సూదులు గ్రుచ్చ! సమరంబున నిన్ను శత్రువులు గ్రుమ్మ! నీ తండ్రియు రాజును కార్యమపూడిలోఁ బోరుచుండఁగాఁ బోతుసింహమురీతిఁ బొదలుచు, మదముపట్టిన గిత్తమాడ్కి మేడపి నున్నావు. నీ కావర ముడిగెడు గాక!"

అని తూలనాడిన బాలచంద్రుఁడామె ననునయించుచు, "అమ్మా! నొప్పిగల్గుటచేత నో రాపలేక నీ వనరాని మాటల నాడితివి. కాని నీ మీఁద నా కేటి పగ? బాల్యచాపల్యమున బొంగరమాడితిని. అది నిన్నుఁ దాఁకెను. నయభావమున నా తప్పు మన్నింపుము! కరుణింపుము!" అని యామెను ప్రార్థించి, పచ్చవన్నెల పట్టుపటములనే చింపించి, ఘనమైన మందులు కాలఁ గట్టించెను. అన్నమ్మయుఁ బశ్చాత్తప్తురాలై "కన్న మాయయ్య! కాలికి నొప్పి గలిగినందునఁ గోపించి పలికితిని," అనెను. బాలచంద్రుఁడామెను వీడ్కొల్పి యాట చాలించి, యింటికేఁగెను.

## బాలచంద్రుని యుద్ధాలోచనము

బాలచంద్రుని చిత్తము పరిపరి విధములఁ బోవుచుండెను. అన్నమ యనిన పలుకులు ములుకులవలె నతని హృదయమున నాఁటెను. యుద్ధరంగమున కురుకక యింటనుండుట పందతనమని నిశ్చయించెను. కదన రంగమునకుఁ గదలి చనఁ గృతనిశ్చయుఁడై తల్లి కడకరిగి తనతండ్రి చనిన యుద్ధరంగము దెలుపఁగోరెను. ఐతాంబ తన ముద్దు పట్టి పలుకులు విని గుండెలు వఁటియలై భూమిపై నొరగెను. కొంతసేపటికి యామె మూర్ఛదేరి దుఃఖము నాఁపుకొనలేక వెక్కి వెక్కి యేడ్చుచు నిట్లనియె. "బాలుఁడా! నీకేమి భారము కలిగినది? ఇట్టి వెఱ్ఱి నెక్కడను వినను. ఇటువంటి కార్యము దెలుపుటకు నీ నాలుకెట్లాడెను? ఎన్నియో నోములు నోచి నిన్ను గంటిని. నిన్నెడబాసి యొకనిమిషకాలమైన నిల్వఁగ నోపను."

బాలచంద్రుడు : అమ్మా! నాతో దబ్బరలాడఁ దగునా? నా తండ్రియుఁ దక్కిన వీరులును కార్యమపూడి కదనభూమిలో శత్రువులఁ జెండాడుచుండ నే నేఁగకున్న నపకీర్తి పాలౌదును. తండ్రికష్టములు దప్పింపలేని పుత్రుఁడుండిన నేమి? పోయిననేమి? కార్యమపూడిలో నా వల్లఁగానున్న దేమి యని విచారింపకుము. తల్లీ! నా కిలలో నసాధ్యమేదియు లేదు. బ్రహ్మాండములఁ బట్టి బంతులాడఁగలను. మృత్యుదేవతను

మెదిపివేయఁగలను. నలగామరాజు బలమును గజిబిజిచేసి తుత్తునియలు చేయగలను. తడయఁగనేల? యుద్ధరంగమునకుఁ బంపుము! ఆశీర్వదింపుము!

ఐతమ్మ: నాయనా! తమకంబుగూడదు. తాళుము. నీవేడ? రణమేడ? నీ బలిమియేడ? బాలురతో నాటలాడు పగిది కాదోయి! నీ చెక్కులు మీటిన పాలుచిందును. నుదురు మీటిన నూనె వెల్లెడును. గండ్రతనములు గైకొనకుము. నీవు పిన్నవాఁడవు. బిరుదులు వలదు. ననువిడిచి పోవుట న్యాయముగాదు.

బాల: అమ్మా! నన్ను భయపెట్టఁదలఁచితివా? నా బలపరాక్రమముల నీ వెఱుఁగవు. నలగామరాజునకు నా శౌర్యము తెలియును. ఆయన సైన్యమునకు నేను ఉఱుమని పిడుగును. పగవారి కంటి నెరసును. ఎన్ని జింకలయినను సింహమున కీడగునా? ఎంత చిన్న మిరియమైనను కారము సెడునా? భయము వీడి నన్నుఁ బంపుము.

ఐతమ్మ : నాయనా! మొదట నాకు విసమిమ్ము. తర్వాత నీ తండ్రి దగ్గఱ కరుగుము.

బాల: అమ్మా! నీవు వీరపత్నివి. నీకీ వెఱ్ఱితనము. తగదు. మానవుని శరీర మనిత్యమైనది. కలిమి నీటి బుడగలవలె క్షణభంగురము. షట్చక్రవర్తులంతటివారు కాలధర్మమునందిరి. కీర్తి మాత్రమే శాశ్వతము. నీ వెఱుఁగని నీతు లేమున్నవి? మానవుడు రాజమందిర మందున్నను, అడవిలోనున్నను జావు తప్పదు. నేను పిన్నవాఁడనుగాను, మహాశూరుఁడను. మగువవలె నంతఃపురమునుండుట మగఁటిమికాదు. మఱియొక కారణమును గలదు. అలరాజును నలగామరాజు చంపించినపుడు నా తండ్రి నన్ను అలరాజు తండ్రియగు కొమ్మభూపతి కడకుఁ గొనిపోయి 'నా కుమారుఁడు పగదీర్చును' అని యొప్పించెను. ఆ మాట దక్కించుకొనుట కీ నాఁడు కార్యము గదిసి వచ్చినది. నన్ను బంపుము. ప్రాణమైన నిత్తును, పగయైనఁ దీర్తును. ఈ రెండునుఁ దప్పిన వారికి దాసుఁడనైన నగుదును. ధీరతతో దీవించి పంపుము.

ఐతమ్మ యిక బాలచంద్రుని నాఁపలేక పోయెను. అత్త యగు శీలమ్మ యాలోచన ప్రకారము తుద కతని మాటకియ్యకొని "మాంచాలను జూచి పొమ్ము" అని యనుజ్ఞ యిచ్చెను. తల్లిమాట మేరకు బాలుఁడు భార్యను జూచుటకు బయలుదేరెను. అతనికన్న ముందుగ నైతమ్మ కోడలు మాంచాల కడకుఁ జని, బాలచంద్రుని యుద్ధమునకుఁ బోకుండ నాఁపుమని కోరెను. అత్తమాటలకు మాంచాల యెదురాడలేదు.

బాలచంద్రుడు తన మిత్రులు వెంటరా మామయగు గండు కన్నమనాయని యిల్లుచేరెను. రాకరాక వచ్చిన ప్రాణకాంతుని మాంచాల పూజించెను. యుద్ధమునుండి యాతని మనసు మరల్చుట కన్నివిధములఁ బ్రయత్నించెను. శృంగారించుకొని వత్తునని మేడ దిగివచ్చి, తన తల్లి రేఖాంబ యొద్ద కేతెంచెను. "తల్లీ! నీ యల్లుడు యుద్ధమునకుఁ బోవుచున్నాఁడు. నా బ్రతు కడవిగాచిన వెన్నెలగును. నా కేది దిక్కు? అతని నాఁపు నుపాయముచెప్పి నా తల్లడము మాన్పుము" అని యంగలార్చెను.

రేఖాంబ వీరపత్ని. ఆమెకు మాంచాల ప్రార్థన రుచింపలేదు. మాంచాలను జేరదీసి చెక్కులు నిమిరి,

"వెలఁదిరో! నీ భర్త వీర శేఖరుఁడు
కీర్తికాముకుఁడయి కేరుచున్నాఁడు.
నీవు భోగములపై నిరతిఁ ద్యజించి,
బాలచంద్రుని మనోభావం బెఱింగి,
భావి మానవుల హృద్భువనంబులందు
తావకీన యశోలతా వివర్ధనము
సేంగఁ గోరుము. చెలువరో! యిపుడు
బాలచంద్రుని నాఁగఁ బట్టంగ వలదు".

– పల్నాటి వీరచరిత్ర

అని మందలించి పంపెను.

రేఖాంబ యొసంగిన వీర ధర్మోపన్యాసము మాంచాల మనసు గట్టిచేసెను. ఆమె సుఖాశల దిగఁద్రావి, యత్తమాటల నావలకుఁ ద్రోసి, తల్లిమాటలు తలంచి పతికడకుఁ బోయెను. ఇప్పుడామె వీరాంగన. బాలచంద్రుఁడామెను జూచుచు ముగ్ధుఁడై యుద్ధము సంగతి పూర్తిగ విస్మరించెను. మాంచాల కిది సహింపరాదయ్యెను. బాలచంద్రునిఁ జూచి,

"నాతోడ మసలిన నయమేమిలేదు.
కదువడిఁ గలనికిఁ గదలుఁడి మీరు.
కులవైరముందీర్చు గురు సాహసుండు
పరికించి చూడ నెవ్వరు మీరు దక్క?"

అని యాతనికి వీరధర్మ ముద్బోధించెను.

బాలునిలో మఱల రణోత్సాహము ప్రజ్వరిల్లెను. కదనమున విజయము గల్గునట్టు దీవింపుమని యాతఁడు తన కటారిని భార్య కందిచ్చెను. ఆమె దానిఁ గడు భక్తితో నందుకొని కన్నుల కద్దుకొని, యొౘదలఁ దాల్చి, యతని కిచ్చుచు నిట్లు దీవించెను:

"... ... ... రణరంగధీర!
కమల బాంధవతేజ! కరుణాలవాల!
వినతాత్మజుని లావు వెసనీకుఁ గలుగు.
సామీరి సమమైన సాహసంబబ్బు.
కృష్ణుని కెనయైన కీర్తి ఘటిల్లు.
రవి కాంతియుతుఁడవై రంజిల్లుచుండి
యలరాజు పగదీర్పు మనుజుల తోడఁ
బటుతర విక్రమ ప్రౌఢిమ మెఱయ.
శ్రీగిరి లింగంబు చెన్నకేశవుఁడు
వరము లొసంగఁగ వర్ధిల్లఁగలరు.
శాత్రవ విజయంబు సమకూరు నీకు.
నీ యాయుధము వడి నిచ్చును జయము
కలియుగమ్మున నీకు ఘన పూజ లమరు".

– పల్నాటి వీరచరిత్ర

## బాలచంద్రుని లేఖ

బాలచంద్రుడు వీరపత్ని దీవెనలుగొని యట నుండి తల్లి యొద్దకుఁజనెను. ఆమె యాశీర్వాదములందుకొని మిత్రులు, సైనికులు వెంటరాఁ గార్యమపూడి రణరంగమునకు బయలుదేరెను. బాలచంద్రునికిఁ దన బ్రాహ్మణ మిత్రుఁడనపోతు యుద్ధరంగమునకు వచ్చుట యిష్టములేదు, అతనిని వెనుక కంపుట కుపాయము వెదకసాగెను. కొంత దవ్వేఁగిన తర్వాత నేదియో మఱచినట్లు నటించి "ముత్యాల గళమాల, ముద్దుటుంగరము మఱచి వచ్చితిని. మేడపిఁజేరి వానిఁ గొనితెమ్ము. నీ కొఱకు మేము వేచియుందుము" అని యనపోతును మరలించెను. అనపోతు మేడపికిఁజని, యా యాభరణముల కొఱకెంతయు వెదకెను. కాని, యవి కానరాకుండుటచే మిగుల విచారించుచుఁ గదనస్థలికి బయలుదేరి నియమిత ప్రదేశమున మిత్రుల జాడ గానక యందంద యడిగి విఫలుఁడై యొక రావిచెట్టునీడ

విశ్రమించెను. కొంతసేపటికిఁ దలయెత్తిచూడ నటనొక కొమ్మకు లేఖ యమరించినట్టు గానరా నద్దాని నెత్తిచూచెను. అది తనకు బాలచంద్రుఁడు వ్రాసినది. అనపోతు ఎంతో నాత్రముతోఁ జదువఁ దొడఁగెను. చదివినకొలది యతనికిఁ గోపము శోకము ముప్పిరిగొనెను. ఆ పత్రికలో నిట్లుండెను.

"శ్రీగిరీశుని యాన! చెన్నుని యాన!
మలిదేవరాజాన! మా తండ్రియాన!
యవ్వదాళ్ళురు వీరు లందఱి యాన!
త్రోసివచ్చితివేని ద్రోహమంటెదును.
బాలుని మిత్రుల ప్రాణంబులకును
దప్పిన లాగౌను దరలితి వేని.
ఆనలు మీఱుట యది నీతి గాదు.
తన సంగడీలతోఁ దరలె బాలుండు
సాహసమున నీవు సాగిరాఁగూడ-దు"

– పల్నాటి వీరచరిత్ర

ఆ లేఖ చదివినంతనే యనపోతు నూనె చల్లిన నిప్పు చందమున భీకరకోపాగ్ని చిత్తమునఁ బెనగఁగా బాలచంద్రుని నిష్ఠురవాక్యములాడుచు వెనుదిరిగి వెళ్లుటకు మనసొప్పక యచటనే తన కరవాలముతో తల నరికికొని నేలఁగూలెను.

## బాలచంద్రుని యుద్ధము

అనపోతు మరణవార్తను మాడచి కార్యమపూడికి వచ్చి బాలచంద్రున కెఱింగించి రక్తసిక్తమైన యతని జందెమును, బిరుదంబును జూపెను. బాలచంద్రుని కన్ను లెఱ్ఱవాఱెను. ఱివ్వన మలిదేవుని కొలువుకూటమునకుఁ జని యిరువైపుల వారికిని జరుగుచున్న రాయబారముల నాపించి, వీరుల వేడినెత్తురుడుకున ట్లుత్సాహము గలిగించి పోరుకుఁ బురికొల్పి సంధి పొసగఁకుండఁ జేసెను.

మఱుదినమే పోరు మొదలయ్యెను. బాలచంద్రుఁడు సింహనాదము చేయుచు తన మిత్రబృందముతోఁ గదనరంగమున కుఱికెను. 'నలగామరాజు తమ్ముఁడును అలరాజును జంపిన వాఁడునునగు నరసింగునిఁ జంపి ప్రతిన తీర్పుదు'నని గర్జింపసాగెను. బ్రహ్మనాయఁడు తన కుమారుని వారింప నెంతేని బ్రయత్నించెను. కాని, విఫలుఁడై యాతనికి రణనీతి యుపదేశించి యాశీర్వదించి వీడ్కొల్పెను.

అంతట పోరు ముమ్మరముగ సాగెను. నరసింగభూపతి రణమునకు వచ్చెను. బాలచంద్రుని సైన్యము కో యని యార్చుచుఁ గుప్పించి యుఱికి యతని బలముపై వ్రాలెను. కుంతములతో శత్రువులఁ గుదులుగాఁ బొడిచెను. కత్తులచేఁ దలలు నేలపై దొర్లునట్లు దట్టించి నఱకెను. మోచేతు లెడచేసెను. ముక్కులు చెక్కివేసెను. ఫాలములఁ జించెను. పక్కలఁగోసెను. దౌడలూడఁగ నేసెను. ఏనుఁగుల తండంబుపై లంఘించి వాని కుంభములు పగులమోదెను. తొండములును, దోఁకలు తునుకలు చేసెను. మావంతులనుగొట్టి, పై నున్న దొరలు పడిపోవునట్లు బొడిచెను. అశ్వికులపై లంఘించి వారి జోడంగులు తుక్కుగనేసెను. గుఱ్ఱములగుండెలు, మెడలు రెండుగఁజేసి, మేనులు చించెను. ఇట్లు నరసింగు బలములఁ జీకాకు పఱచఁగా, నెత్తుటి కాల్వలు పాఱెను.

బాలచంద్రుఁడు చాపకట్టుగ తన సైన్యములఁ గూల్చుటఁజూచి నలగాముఁడు చింతింపఁదొడఁగెను. నరసింగా బాలుని ధాక కోర్వజాలక కాలికి బుద్ధిచెప్పెను. ఇంతలో మరొకవీరుఁడు మార్కొన నతఁడే నరసింగని భ్రమించి బాలచంద్రుఁడతని శిరంబుత్తరించి దానిని తనతండ్రి కడకుఁదెచ్చి చూపించెను. అది నరసింగు తల గాదనియు, వెంకుశిర మనియు నతఁడు నుడువ బాలుఁడు సిగ్గుపడి మఱల సంగరరంగమున కుఱికెను.

అట్టుఱికి, “నరసింగు డెక్కడరా? ఏడిరా వాఁడు? బాలచంద్రుని ధాకకు భయపడి ఎక్కడనైన దాగెనేమిరా? పందతనముగఁ బరుగెత్తెనేమిరా?” అని యార్చుచు, వెదకుచుఁ బోయి యాతఁడున్న చోటు గనుంగొని యతనిపైఁ బిడుగు కైవడిపడెను. ఇఁక వారొకరినొకరు ఢీకొనిరి.

“నరసింగరాజును నాయని సుతుఁడు
కర్ణుండు విజయుండు గలహించినట్లు
వృత్రుఁడు నింద్రుఁడు బెనఁగిన భంగి
రామరావణులు పోరాడినరీతి
హెచ్చి యుద్ధము చేసి రిరువురు జాము”

– పల్నాటి వీరచరిత్ర

బాలచంద్రుడు సామంతరాగోల చక్కఁగఁబట్టి నరసింగు వక్షమునఁ గడువడితోఁ గ్రుచ్చి యతనిఁ ద్రెళ్లనేసి, కత్తితోఁ దలగోసి, చేతబట్టి, తన తండ్రి తావుకుఁ గొనిపోయెను. బాలుని ప్రతిజ్ఞానిర్వహణమునకు నందఱు మెచ్చిరి. కాని నరసింగన్న

మడిసినందుల కందఱు మిగుల వగచిరి. అది చూచి బ్రహ్మనాయఁడు తన కుమారునిఁ దెగడెను. బాలచంద్రుఁడు దానఁగినిసి బ్రహ్మనాయని కపట కార్యము నెన్నఁబూనుకొనెను. అందులకు నాయఁడు గోపించి "నీవు శత్రువులకు వెన్నిచ్చి వచ్చితివి. నేను నీవంటి వీరుఁడఁగాను సుమ్ము" అని దూషించెను. బాలచంద్రున కా పలుకులు బల్లెములై గ్రుచ్చుకొనెను. తన మిత్రులతో మఱలఁగలనికి రయముననేఁగి శత్రువుల నసంఖ్యాకులఁ దునుమాడి రిపువ్యూహమునఁ జిక్కుకొని యభిమన్యు పగిది వీరస్వర్గ మలంకరించెను.

"అంతట భాస్కరుఁ డస్తాద్రి కేఁగె.
సాంద్రమై చీకట్లు జగమునఁ గ్రమ్మె.
జంగమస్థావర సకలవస్తువులు
కాటుక పట్టిన కైవడి నొప్పె".

– పల్నాటి వీరచరిత్ర

ఇక రెండే మాటలు: నలగామునిసైన్యము క్షీణించెను. నాయకురాలు నాగమ్మయు, నలగాముఁడును బ్రహ్మనాయని శరణనిరి. శరణాగత రక్షకుఁడగు నాయఁడు వారిని క్షమించి నలగామునికి గురిజాల రాజ్యమిచ్చివేసెను.



# 2. రుద్రమదేవి

"జనక పాల్యంబైన సామ్రాజ్య మంతయుఁ
దాల్మిమై హస్తగతం బొనర్చి
కాకతీయుల పరాక్రమ జీవితంబును
భావరంగస్థలిఁ బాదుకొల్పి
అహమహమికఁజూపిన మహాదేవరాయల
ప్రాంతభూములనుండి పాఱఁదోలి
శిల్పంబులకు దేశీయవృత్తులకును
ద్రవ్యంబు పలుమాఱు ధారవోసి
యాంధ్రుల చరిత్రములకెల్ల ననుపమాన
దీప్తిఁగూర్చెను. రుద్రమదేవి రాజ్ఞి

– శేషాద్రి రమణ కవులు

ఆంధ్రమహిళ ప్రాచీనప్రాభవము పరిమితి యిడరానిది. మహాసామ్రాజ్య దక్షతకా రుద్రమదేవి! వితరణ గుణమునకుఁ, బతిభక్తికిఁ, బితృప్రేమకునా గణపమ్మ! మంత్రాంగమునకా "బిరుదులందిన రాచబిడ్డల బొమ్మలచాయ నాడించిన" నాయకురాలు! ప్రాణనాథునిఁ గదనరంగమున కంపు పరాక్రమమునకా "పల్నాటి రంగమే పచ్చీసుగా... బ్రతికిన పల్నాడు రత్నాలమేడగా, చచ్చిన పల్నాడు పుచ్చుల బీడుగా" భావించిన మాంచాల! మానసంరక్షణకుఁ బ్రాణములఁ దృణప్రాయముగ నెంచుటకా రాగమ్మ, మల్లమ్మ, రమణమ్మలు! కర్తవ్యనిష్ఠకా వేంకటలక్ష్మి!

ఇప్పటికి దాదాపు 700 ఏండ్లనాఁటి మాట. తెలంగాణ ప్రజలకది యొక గండము. కాకతీయసామ్రాజ్యమంతటను విషాదచ్ఛాయ లావరించి యుండెను. ఇంతటి విశాలసామ్రాజ్యమున కేమి చేటు వాటిల్లునో, ప్రజలకేమి కీడు మూడునో యని యందఱును బరిపరి విధములఁ బరితపించు చుండిరి. ఏబది సంవత్సరములు

రాజ్యమేలి, తన సామ్రాజ్యమును దక్షిణమునఁ గాంచీ నగరమువఱకును, ఉత్తరమున దేవగిరి వఱకును, పూర్వదిశను కటకముదాఁకను వ్యాపింపఁజేసిన, తమ్ముఁ గన్న కొడుకులకన్న మిన్నగాఁ జూచిన గణపతి దేవుడు దివంగతుఁడగుటయే యా పరితాపమునకుఁ గారణము.

గణపతిదేవునకుఁ బుత్రులు లేరు. రుద్రమ యతని కేకమాత్రదుహిత. పురుష సంతానమాతనికి లేదనియు, సామ్రాజ్యభార మతని తర్వాత నెవ్వరు భరింతురో యనియు జనులు చింతించుచుండిరేమో కాని, యతఁడు మాత్ర మావంతయును వంతఁ జెందలేదు. ఆమెనే బుత్రునిఁగా భావించి సామ్రాజ్య నిర్వహణమున కవసరమగు రాజకీయ శిక్షణ మొసంగెను. ఆమెకు రుద్రదేవుఁడను పురుషనామమిడి యుద్ధములందు సహితము బాల్గొనఁ జేయుచుండెను. తన యవసానదశయందు గాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నము గాకుండుటకై యతఁడేర్పాట్లు గావించుకొనుచుండెను. ప్రజలకు, సామంతులకు నామెయందు గౌరవ విశ్వాసములు పెంపొందఁ జేయుటకు నతఁడామెకుఁ బురుషోచితకృత్యముల నేర్పుచు, రాజ్యాంగములోఁ బ్రవేశము గలిగించుచుండెను.

## జననము

రుద్రమదేవి 1225 వ సంవత్సరమున జన్మించెను. ఆమె కొక్కొక్క సంవత్సరము నిండుకొలఁది యొక్కొక వింతసోయగ మబ్బుచుండెను. పుత్రులు లేనికతమున గణపతిదేవుఁడామెను బురుషవేషములో నలంకరించి ముద్దుముచ్చటలు దీర్చుకొనుచుండెను. క్రమముగా నామె యౌవనదశలో నడుగిడినది. దుర్గాలక్ష్మీసరస్వతులు ముగ్వురు నామెలో నొకరికొకరు పందెములు వైచుకున్నట్లుండెను.

రుద్రమాంబ సాహిత్యమర్మజ్ఞ. న్యాయజ్యోతిశ్శాస్త్రములయందును సుపజ్ఞ గలది. సంప్రదాయసిద్ధమగు నాట్యసంగీత కళలలో నిష్ణాత. ఆమె కళాభిలాష దినదిన ప్రవర్ధమానమగు చుండెను. కవితయనిన నామెకు మక్కువ యెక్కువ. ఆమె కఱ్ఱ సాముఁ గఱచెను. కత్తిసాములో చిత్తము హత్తించి కొత్తపోకడలు కనిపెట్టెను. ఏటున కేడు ముక్కలుగా నఱుకఁగల లాఘవము గడించెను. శరవిద్యలో నామె శబ్దవేధిని. పురుషవేషముతో నామె యువకులతోఁ బోటీపడి నెగ్గుచుండెడిది. పరిసరాటవులలో నామె మృగయావినోద మొనర్చుచు లక్ష్యసాధన మొనర్చు కొనెడిది. వేఁట నొక యాటగా నామె భావించెను. తండ్రి కొలువు తీర్చువేళల నామె యతని చెంతన గూర్చుండి

మంత్రాంగ మాకళించుకొనెను. వృద్ధుఁడగు దన తండ్రికి రాజ్య నిర్వహణమునఁ దోడ్పడసాగెను.

ఆ అతిలోక సుందర వీరమూర్తికి గణపతిదేవుఁ డత్యంతవైభవముతో నుద్వాహమొనరించెను. భర్త పేరు వీరభద్రేశ్వరుఁడు. ఈతఁడు చళుక్యవంశీయుఁడు. ఇతని తండ్రియగు నిందు శేఖరుఁడును, తాతయగు మహాదేవరాజును నిడదవోలు రాజధానిగాఁగల మండలమున కధిపతులు. వీరభద్రేశ్వరుఁడు మామయింట నిల్లరిక ముండెను.

రుద్రమాంబ యన్నిటను తనకనురూపుఁడగు బతిని బడసి సంతోషమున నోలలాడుచు, ఒక కంట రాచకార్యములఁ దండ్రికిఁ జేదోడు వాదోడుగా మెలఁగుచు నుండెను. వీరి దాంపత్యమునకు విధి సహింపక తన కన్నులఁ జిచ్చు వెట్టుకొని, వీరి కాఁపురమునను జిచ్చువెట్టెను. ఒకపుత్రిక జన్మించిన కొలఁది నాళ్లకు వీరభద్రేశ్వరుఁడు మరణించెను. ఈ పుత్రిక నామము ముమ్మడమ్మ. భర్తృశోకముతో రుద్రమాంబ గుందుచు, నా నిసుగుపై యాశలు పెట్టుకొని మనుగడ సాగించుచుండెను. అల్లుని మరణముతో గణపతిదేవు నాశలు కూడ యడియాసలయ్యెను అతఁడు రుద్రాంబ కుమారునిఁ గన్నచో నతనిని తన యనంతరము రాజ్యమునకుఁ బట్టము గట్టఁదలఁచి యుండెను. ఇఁక నా యాశ నశించెను. మనుమరాలి భవిష్యత్తును కాంక్షించి, యామె కడుపున నైననొక కాయ కాచుని యాసపడుచుండెను.

ముమ్మడమ్మ చాళుక్యమహాదేవున కిల్లాలై 1254వ సంవత్సరమున నొక మగనిసుగును గనెను. ఈతని నామధేయము ప్రతాపరుద్రుఁడు. ఈతని జననముతో గణపతిదేవరుద్రమాంబల యాశాలత చిగిర్చెను. కాని, గణపతిదేవుఁడు మునిమనుమని చిన్నారిపొన్నారి చిఱుతకూకటి నాఁటి ముచ్చటలు చూడక మునుపే దివంగతుఁడయ్యెను.

## రాజ్యపరిపాలనము

తండ్రి మరణమువల్ల రుద్రమాంబ కార్యభారము గురుతరమాయెను. మనుమఁడగు ప్రతాపరుద్రుఁడు ముక్కుపచ్చలారని పసికందువ యగుట నామె రాజ్యధూర్వాహమొనర్ప వలసెను. ఆమె 1260వ సంవత్సరమున నోరుగంటి రత్న సింహాసనమధిష్ఠించెను. గణపతిదేవ చక్రవర్తి యానతియు నిదియె. ఆ యానతికిఁ బూటకాఁపు మంత్రిశేఖరుఁడు శివదేవయ్య. ఈయన మంత్రాంగరక్ష రుద్రమదేవి పరిపాలనకు శ్రీరామరక్ష యాయెను.

రుద్రమ సింహాన మెక్కిన వెంటనే యాంధ్రదేశమునఁ బ్రళయము లావరించెను. ఆడుదాని యడుగులకుఁ దలలు వంచుట సామంత మండలేశ్వరుల కవమానముగాఁ దోచెను. వారామెను సింహాసనము నుండి తొలఁగించి తామాక్రమింప వేగిరపడు చుండిరి. గణపతి దేవునిచేఁ బరాజితుఁడైన దేవగిరి యాదవరాజు మహాదేవుఁ డదను చూచి యొరంగల్లుఁ గొల్లగొనఁ జూచుచుండెను. అబల పట్టమునకు వచ్చినదని విన్నంతనే దక్షిణమునుండి పల్లవులు, చాళుక్యులు, పాండ్యులు దమతమ రాజ్యముల విస్తరించుకొను వాంఛతో నోరుగల్లుపై నోరు తెఱచుకొని యుండిరి. గణపతి దేవుఁడు ఏబదేండ్లుగాఁ బ్రోదిచేసి పెట్టిన కాకతి రాజ్యము వికావికాలగునట్లు చూపట్టెను.

నాఁడునాఁటికి ముంచుకొనివచ్చు నీ విపరీతపరిస్థితులలో నప్రమత్తత యవసరమని యామె వెంటనే గ్రహించెను. రేపో, మాపో పోరు తప్పదని నగర రక్షణ కుద్యమించెను. కూలిపోయిన దుర్గభాగముల బాగుచేయించెను. నగరమునకుఁ జుట్టును గంపకోట గట్టించెను. దీనికి లోపలిభాగమున మట్టికోట గట్టించెను. దీని చుట్టును లోతైన యగడ్తను త్రవ్వించెను. దీనిలోపల నొక రాతికోట నిర్మించెను. రాతికోటకు లోభాగమునందామె మెట్లు గట్టించెను. ఇందుచే శత్రువులు దుర్గమును ముట్టడించినపుడు లోపలివారు సులభముగ నా రాతికోటపై కేఁగి వారిపై నాయుధములు ప్రయోగింప వీలగుచుండెను. రాతికోట యలంగముమీఁదఁ జుట్టాలలో నతిముఖ్యులగు శూరవరుల నుండనియమించెను. రాతికోట లోపల మఱియొక కోట నేర్పఱిచెను. ఇది యిటుక కోట. తక్కిన బంధువులు నివసించుటకీ కోటను నిర్ణయించెను.

కంపకోటకు గవనులెనిమిది, దిడ్లు పదునాఱు, మట్టికోటకు గవనులు నాలుగు, దిడ్లెనిమిది, రాతికోటకు గవనులు నాలుగు, దిడ్లెనిమిది. కోటగోడలపై నెన్నియో బురుజులు వేయించెను. పిదప నీ కోటల రక్షణము కొఱకు కొమ్మకిరువురును, బురుజున కేఁబదిమందియు, దిడ్డికి నూర్గురును, గవనున కేనూర్వురును వీరభటులు కాఁపుండునట్లు రుద్రాంబ కట్టుదిట్టములుచేసెను.

రుద్రమదేవి సేనానులును మిగుల జాగరూకులై యుండిరి. జన్నిగదేవ సాహిణి, త్రిపురాంతకదేవుఁడు, అంబిదేవ మహారాజు, రేచర్ల వంశీయులగు ప్రసాదాదిత్యనాయుఁడు, రుద్రమనాయుఁడు; మనుమగణపతి, అన్నయ దేవుఁడు, రుద్రుఁడు, గోనగన్నారెడ్డి, నాగదేవుఁడు, సామంత పోతినాయకుఁడు, మహారాజ్ఞి యంగరక్షకుఁడగు పర్వతనాయకుఁడు, ఆదిదమ్మ, పట్టసాహిణి దాది

గన్నమనాయకుఁడు, అతని పుత్రుఁడు దాదిసోమయ సాహిణి వీరవరులను ఎప్పటికప్పుడే సిద్ధపఱచుచు శత్రువుల ధాక కోర్చుటకు సన్నద్ధులగు చుండిరి. రాజనగరరక్షకుఁడగు వల్లనాయకుఁడు నగరరక్షణ బాధ్యతను నిర్వహింపఁబూనెను. అమాత్యవరుఁడగు శివదేవయ్య శత్రువుల జాడల నెప్పటికప్పు డఱయుచు మంత్రాంగ మొనర్చుచుండెను.

## సామంతుల తిరుగుఁబాటు

కాకతీయరాజ్య విస్తృతి దాక్షిణాత్యరాజులందఱకుఁ గంటకముగ నుండెను. దానిని ముట్టడించి మ్రింగివేయుటకు గణపతిదేవుని కాలమున వారికి సాధ్యముకాలేదు. ఆ మహాపరాక్రమునిధాటి కెవ్వరెదురాడఁగలరు? ఇప్పుడు వారికట్టి తరుణము లభించెను. పాండ్యులు తిరిగి కాంచీపురముపై దండెత్తి, యచ్చటి కాకతీయ సేనానిని బాఱఁదోలి, నెల్లూరును ముట్టడించి, మనుమసిద్ధిని జయించిరి. కాంచీపురాధీశుఁడగు విజయ గండగోపాలుఁడు, కులోత్తుంగుఁడు; చోళరాజులు మనుమలి దేవుఁడు, సిద్ధయదేవుఁడు, పల్లవరాజు కొప్పెరుంజింగదేవ రెండవ కాడరాయలు మున్నుగాఁ గలవారు ఒక్కుమ్మడిగా నామెపైఁ గత్తికట్టిరి.

ఇదియే సందని సామంత మండలేశ్వరులు గూడ చెలరేఁగి తిరుగుఁబాటు చేసిరి. అందుఁ గర్నూలు మండల పరిపాలకుఁడు రాజేంద్రచోడుఁడు, అల్లాడ పెమ్మయదేవ మహారాజు పరిచ్ఛేది పంద్రాజు, వల్లభరాజు, పెదకొమ్మరాజు పాల్గొనిరి. ఈ విధముగ దక్షిణదేశమంతయు నొక్కపెట్టునఁ గాకతీయరాజ్యముపై జోరుచూపెను.

రుద్రాంబ యిసుమంతయు జంకలేదు. మహాబలపరాక్రమశీలురగు తన సేనానులకు ముట్టడిఁగొన ముదలయిడెను. వారును దమతమ బలముల సన్నద్ధము చేసికొనసాగిరి. పాలెగాంద్రను, దొరలను, బడవాళ్లను బిలిపించిరి. రేవంతతుల్యులైన రాహుత్తుల రావించిరి. విజయునికి నీడగు విలుకాంద్రగముల నాహ్వానించిరి. భటులును బంతములు మీఱఁగ, సురియలు, పరిఘలు, శూలములు, ప్రాసములు, ముద్గరములు, ఖడ్గములు, చక్రములు, భిండివాలములు, పరశువులు, బల్లెములు, బాఁకుకటార్లు, శార్ఙ్గములు, శరధులు దాల్చి బయలుదేరిరి.

రౌతులు తమ గుఱ్ఱములను సిద్ధముచేసిరి. కుచ్చులు, జుల్లులు వ్రేలాడు బంగారుకుప్పె పక్కెరలు గుఱ్ఱములపైఁ గట్టిరి. మఖమల్ పట్టలు వాని మొగములఁగట్టిరి. వాని పాదములకందెలు, మెడలో పుత్తడిగజ్జెలు పొందుగా నమర్చిరి.

మావటీండ్రు ఏనుఁగులను బారులుగా నిల్పిరి. వాని మెడకుఁ బట్టుబొందుల జోళ్లగజ్జెల పేరులు, గంటలు కట్టిరి. కొట్టికాండ్రు శూలాలు గట్టిన శకటములను మొదటసాగించిరి. గుడారములు, తక్కిన వస్తువులు ఎద్దులమీఁద, నొంటెలమీఁద, కంచరగాడిదల మీఁద మోపి తోలసాగిరి. రణభేరులు మ్రోయఁదొడఁగెను. సాహిణులు దక్షిణాపథమువైపు జైత్రయాత్రకు బయలుదేరిరి.

రుద్రమనాయఁడు, అంబదేవత్రిపురాంతకసేనానులు కాంచీపురముచేరి, బలదర్పములతో శత్రువుల నెదుర్కొనిరి. రుద్రమ సేనాని, త్రిపురాంతకుఁడు సిద్ధయదేవచోడునిఁ, గులోత్తుంగుని జయించిరి. అంబయదేవుఁడు కొప్పెరుంజింగనిఁ దఱిమికొట్టి, విజయగండగోపాలుని శిక్షించి, వారాక్రమించుకొనిన భూభాగములను వశపఱచుకొని, విశాలాంధ్ర రాజ్యమునకు వాటిల్లిన ప్రళయమును బోఁగొట్టి, దక్షిణభాగమున శాంతి నెలకొల్పెను.

గణపతిదేవుని కాలమున సామంతుఁడైన కటకప్రభువు కూడ నిదియే సమయమని కప్పము కట్టుటమాని, స్వాతంత్ర్యము ప్రకటించుకొనెను. అతని యుక్కడంచుటకు రుద్రమదేవి పోతయనాయఁడు, మారయనాయఁడు నను నిద్దరు సాహిణులఁ గటకమునకుఁ బుత్తెంచెను. వారు చతురంగ బలములతోఁ గటకము చేరి యతని పీచమడఁచి, సామంతునొనర్చి, యేటేటఁ గప్పము కట్టునట్టు కట్టడచేసి వచ్చిరి.

వీరసాహిణులు తిరుగఁబడిన సామంతులను, ఎత్తి వచ్చిన శత్రువులను నణఁచివేసి వచ్చుచుండఁగా, నేకశిలా నగరమున మఱియొక యుపద్రవ ముప్పతిల్లెను. రుద్రమకు హరిహరుఁడు, మురారిదేవుఁడు నను నిద్దరు జ్ఞాతులుండిరి. వారు కాకతి సామ్రాజ్యము నపహరింపఁ దలఁచి దేవగిరి యాదవులతో లోలోపలఁ గుట్రలు పన్ను చుండిరి. వారి కుట్రలు సాగునవకాశమొందు కలిగెను. బాలుఁడగు ప్రతాపరుద్రుఁడు అరిష్టముగడచి సుఖియై దినదినప్రవర్ధమానుఁడగుటకు రుద్రమ దేవతాదర్శనము కొఱకు నగరు వెడలి, తమ యిలువేల్పును, కులదేవతయునగు కాకతమ్మను దర్శించి, కీర్తించి, వడ్డెపల్లి గణపతి దేవునకు వందనములు సమర్పించి; మొగిడిచర్ల యేకవీరాదేవికి మ్రొక్కులిడి; ఐనవోలు మైలారదేవునకు మస్తకము వంచి; మఱలివచ్చునంతలో, హరిహర మురారిదేవులు కోటద్వారములు బంధించి, యామెను నగరమునఁ బ్రవేశింపనీయరైరి. కాని, రుద్రమాంబ మంది మన్ననలు బడసిన

మహారాణి గదా! నగరవాసుల కా జ్ఞాతుల చెయిదములు రుచింపవయ్యెను. వారు తండోపతండములుగ వచ్చి, కోటగవనుల కెగఁబ్రాకి, బిడాయించిన తలుపుల నొక్కుమ్మడిగఁ దెఱచి, యామెకు స్వాగతము పలికిరి. రుద్రమదేవి తన బంధు మిత్రులును, మంత్రులు, బురజనులు వెంటరా ననాయాసముగ లోనఁబ్రవేశించి, తనపై నింతటి దౌర్జన్యమునకుఁ దలపడిన యా జ్ఞాతు లిరువుర నిశ్శేషముగాఁ దునిమి, వారి బొక్కసములఁ గొల్లగొట్టి, యా ధనముతో నోరుగంటిలోని దేవతల కుత్సవము గావించెను.

## బతకమ్మ పండుగ

కల్లోలము లణఁగెను. శాంతి యేర్పడెను. విజేతలగు సాహిణులు నగరము చేరిరి. ఇంతలో శరన్నవరాత్రములు సమీపించెను. బతకమ్మ (కాకతమ్మ) పండుగ లీతటి సమధికోత్సాహముతో జరుప మహారాజ్ఞి యానతిచ్చెను. నగరమంతయు నలంకరింపఁబడెను. వీథులు రత్నతోరణాబద్ధములైనవి. ఇంటింట నుత్సాహము తాండవించుచుండెను. మంగళ తూర్యధ్వనులతో దిక్కులు ముఖరితము కాసాగెను. కోటబురుజులపై విజయకేతనము లెగిరెను. పురసీమంతినులు సాలంకృతలై వివిధ పుష్పతతులతో, నపూర్వనైపుణితో ప్రభలుకట్టి పురవీథులలో నూరేగిరి. ప్రజలలో నపూర్వ కళాకౌశలము వెల్లివిఱియు చుండెను.

బతకమ్మ పండుగ వేడుకలు జూచుటకు ఇరుగుపొరుగు నగరములవారు ఓరుగంటికి చీమలబారుగ వచ్చుచుండిరి. వారు తూరుపు తెలతెల వాఱఁగనే లేచి స్నాతులై యోరుగంటికిఁ బయనమై వెలిపాళెమునఁ బ్రవేశించిరి. అచ్చటి నుండి మేదరవాడ మీఁదుగ యగడ్తదాఁటి, నగరములోనికి బోవు హట్టమార్గమున (పెద్దబాటలో) మైలసంత గడచి, యచట జరుగు జూదపు వినోదములను జూచుటకుఁ గొంత తడవాఁగు చుండిరి. అటఁ గనుమయవ్వలి దేశంబు కరణకాంతలును, తెలికు జోటులును అమ్ము సంపెఁగనూనె మున్నగు వాసననూనెలను గొనుచు ముందుకుఁ జనిరి. కొంతముందుకుఁ జనగా మోహరివాడ కననయ్యెను. అక్కడ వీరభట సమూహములఁ జూచి యాశ్చర్యపడుచు నడచిరి. ఇప్పటికి వెలికోట వీథులు గడచిరి. ఓరుగల్లు రాతికోట యాకాశము నందుకొన నుంకించుచు, వారికి దిగ్భ్రాంతి కలిగించుచుండెను. వారు జనసంకులమగు వంకదారఁ బ్రవేశించి బంగారు తలుపులు

గల గవనులలోఁ జొచ్చిరి. రాజమార్గ మేనుఁగులు, గుఱ్ఱాలు, బండ్లు, భటులు మొదలగు వానిచే సంకులమై ధూళిరేఁగుచు కష్టముమీఁదఁ బోవఁ దగినదిగా నుండును. కావున కొందఱు కలకలము లేని క్రంత త్రోవలఁబోవుచు వినోదములఁ జూచు చుండిరి.

పల్నాటివీరుల దేవాలయములోఁ గొంత విశ్రమించి, యా కోవెలలో గచ్చుచేసిన చిత్రంపు గద్దెపలక మీఁదఁ జిత్రితమైన పల్నాటి వీరుల చరిత్రము చూచియు, వీరచరిత్రము పాడువారి చేష్టలు, నృత్యము, కథాప్రకారము పరిశీలించియు నానందించిరి. పిదప నటనుండి కదలి, యేకవీరాదేవి మందిరమున కరిగి, యామెకు సాష్టాంగపడి, యట బవనీఁడు పాడు పరశురామకథను వినిరి. జక్కులపురంధ్రులు పాడు కామేశ్వరి గేయమును వినుటకు గుంపులు కట్టుకొని మూఁగిరి. మఱికొంత దవ్వుచనఁగా మైలారభటులు, గొరగలు (శివార్చనాపరులగు దేశద్రిమ్మరులు) చేయు వింతలు కాననయ్యెను. మైలారభటులు అవఅవ మందు నెఱ్ఱని చంద్రనిప్పుల గుండాలలో దూకుచుండిరి. గాలపుఁగొంకికి చర్మము గ్రుచ్చి, దాని నాకాశమున కెగురవేసి యుయ్యాల లూఁగుచుండిరి. గండ కత్తెరలు మ్రింగు చుండిరి. గొరగపడుచులు వెనుకకు మొగ్గవ్రాలి, యొక నీటి తొట్టిలో మునిఁగిన ముంగర ముక్కుకు గ్రుచ్చుకొని లేచుచుండిరి. నాలుకకొనతో నల్లపూసలు గ్రుచ్చుచుండిరి. ఈ వినోదములన్నియుఁ జూచుచు నాగంతుకులు మిసిమింతు లగుచుండిరి.

అక్కడినుండి కదలి, భైరవుని గుడి, చమదేశ్వరీ మహాశక్తినగరు, వీరభద్రేశ్వరాగార మంటపము, బౌద్ధవిహారము, ముద్దరాలు ముసానమ్మవసతి, కొమరసామి గుడి, పాండవులగుడి, తుర్కలమసీదు, వీని కన్నిటికి నవ్వల బంగారు గోపురాలతో మేరు శిఖరాలవలెనున్న కేశవ స్వయంభూదేవాలయములు జూచుచుండిరి. ఇంతలో రాజనగరుమోసాలపై నున్న గడియారపు ఘంటా ఘణాత్కారములు విన్న కొందఱు పూట కూటింటికి భోజనమునకు వెడలిరి. ఒక్కరూక యిచ్చి కప్పురభోగి బియ్యపు సన్నన్నము, కమ్మని గోధుమపిండి వంటఁ, గుప్పెడు పంచదార, అప్పుడు గాఁచిన యావునేయి, పెసరఁబప్పు, కొమ్ము నల్లనటి పండ్లు, నాల్గయిదు పచ్చళ్లు, నూరుఁగాయలు, లప్పలతోడి పెరుగుగల దొడ్డభోజన మారగించి విశ్రమించిరి.

నాల్గు గడియల ప్రొద్దు కలదనఁగా మఱల బయలుదేరి, రాజమార్గమునఁ బోవుచు, పాములాటలు, పొట్టేళ్ల పోట్లాట, కోళ్లపోరితము చూచుచు, తూర్పునాటిగడీని పాటలు వినుచు, రాత్రులనాటకములు, తోలుబొమ్మలాటలుఁ గనుచుఁ గడపిరి.

## యాదవరాజు పరాజయము

ఓరుగల్లునగర మిట్లు క్రీడావినోదములతో నోలలాడు చుండఁగా, ముట్టడికిదియే యదనని దేవగిరి యాదవరాజు మహాదేవుఁడు మూఁడు లక్షల సైన్యముతో రణభేరి మ్రోయించుచు హుటాహుటిగఁ గదలి వచ్చెను. కోటవెలిపాళెము ముందఱ దండు విడిసి లగ్గలు పట్టుకొనుట కాలోచించుచుండెను. వేగులవారు వెలిపాళెము చుట్టును దిరుగుచుఁ గోటలోని లొజ్జులు చూడనగునేమోయని రహస్యముగఁ బరిశీలించుచుండిరి.

యాదవరాయని యాగడమునకు రుద్రమ కాలాగ్ని రుద్రురాలయినది. తానే సేనల నడపి యాతని పొగరుపోకార్చఁదలంచినది. పురుషవేషము దాల్చినది. దట్టీకట్టి నడుమునఁ గాసె బిగించినది. పగతురకు భయముగొల్పు భద్రగజము సిద్ధము చేయుమని యుత్తరువు చేసినది. మావంతులు భద్రగజమునెదుట నిల్పిరి. తగటు పటంబులు కూర్చిన గంతలు దాని వెన్నుపైఁ గప్పిరి. దానిపై చౌడోలు (అంబారీ) కట్టిరి. దానిలో మఖమల్ పఱపులు వేసిరి. చౌడోలుపై చప్పరము సమకూర్చి, దానిమీఁద బంగారు శిఖరము పాదుకొల్పిరి. ఏనుఁగు మెడలో గంటలు, మువ్వలు కట్టిరి. ఇరుప్రక్కల ఘంటలు వ్రేలాడ వేసిరి. ఫాలమున పంచ వర్ణాలు చిత్రించిరి. ముత్యాల జుల్లుల వస్త్రముతోఁగప్పిరి. దంతములకు బంగారు పొన్నులు వేసిరి. పాదముల బంగారు గొలుసు లలంకరించిరి.

ఈ విధముగ నలంకరించిన భద్రగజంబు ముందఱనిలువ రుద్రమాంబ ఏనుఁగు వీపునుండి వ్రేలాడు గంటను పట్టుకొనియే విసవిసనెక్కి, చౌడోలులోఁ గూర్చుండి, సాహిణులకు సాహిణియై సేనల నడపఁదొడఁగెను. ఆమె వెంట వెలమసేనానియగు రుద్రమ నాయుఁడును, కమ్మసేనాని యగు నాగన్నయు, రుద్రమ నాయునియన్న ప్రసాదాదిత్యనాయుఁడు నరిభయంకరముగా నడచిరి. రుద్రమదేవి కోటగవనులు తెఱచి యకస్మాత్తుగ యాదవరాజు బలముపైఁ బడెను. యాదవరాజిట్లగునని తలఁచి యుండలేదు. ఓరుగల్లులోనుండియే శత్రువులు పోరుదురని భావించి యుండెను. కాని రుద్రమదేవియంతటి సాహసమునకుఁ గడంగునని యూహింపలేదు.

సంకుల సమరము ప్రారంభమాయెను. రుద్రమదేవి సేనమొనలోనే కనుపించుచుఁ దన సైనికులకుఁ బ్రోత్సాహమిచ్చుచు శత్రుభటులపై వాడివాడి

నారాచముల విడువసాగెను. పోరితము మరింత ముమ్మరమయ్యెను. రుద్రమ వీరభటులు శత్రుబలములఁ జీల్చి చెండాడిరి. ఖడ్గకుంతములు కరమునఁబట్టి రాహుత్తపటలిని జంపిరి; సింగిణివిండ్లను జిదుకలు సేసిరి. తూణీరబాణములు తుముఱు గావించిరి. ఖడ్గఖేటకములు ఖండించిరి. మెడలు రెండుగఁజేసిరి. మేనులుచించి యెదుఱు ఱొమ్ముల నీటెలు గ్రుచ్చిరి.

తెలుగుజోదుల సమరధాటికి యాదవుల గుండె లవిసెను. సైన్యము కలఁగిపోయెను. పడి తన్నికొని చచ్చువారు, మస్తకంబులు తెగిపడఁగాఁ బ్రాణములు విడిచెడివారు, పాదములు విఱుఁగగాఁ బండ్లు గీటుచుఁ దూలిపడువారు, తునిసిన కత్తులు వదలి బల్లెములకొఱకుఁ బాఱువారు, రుద్రమను గని కాలికి బుద్ధిచెప్పెడివారు, పాఱి పోవఁగలేక బ్రతుకుపై నాశతో నెదరి వీరులను బతిమాలువారు, "ఇటువంటి జగడంబులు కనినదే లేదు. ఎట్లూరు సేరుదుమో!" యని యేడ్చువారు, "భార్యను బిడ్డలను బాసివచ్చి యీ నేలఁ బ్రాణములు పోగొట్టుకొనవలసి వచ్చెనే" యని యసు రుసు రనుచుఁ బ్రాణముల విడిచెడువారు, "పాఱి పోనిచ్చిన బ్రతుకుదుమయ్యా" అని మ్రొక్కువారును, "మీ కేమియు భయములేదని మహాదేవరాజు నమ్మఁబలుకఁగా వచ్చితిమిగాని, యిట్లగుననిన వత్తుమా? జీవములు దక్కిన బలుసాకైనఁ దిని బ్రతుకఁ గలము" అని వేఁడువారు, చచ్చి యున్నట్టు నేలపయి వ్రాలు వారు, పఱుగెత్తి పోలేక చచ్చినవారిపైఁ బడి కదలక మెదలక యుండెడి వారు, చచ్చిన యేనుఁగుల చాటున దాఁగి యుండువారు, పుట్టలలోను, గడ్డిగాదములోను జొరఁబడి యుండువారు, వెన్నిచ్చి పాఱువారు, 'నీ వారమేనయ్యా' అని పలికి యస్త్రశస్త్రములఁ గ్రిందఁ బడవైచి నిలుచుండువారు, ప్రాణములు పాసినను చేతి యాయుధములను విడువని వారు - ఇట్లు యాదవరాజు సైన్యము కకావికలై పోఁ దొడఁగెను.

అంత యాదవరాజు మిగుల క్షుభితుఁడై పాఱిపోవు సైనికుల నాఁపుచుఁ, బ్రోత్సహించుచు ధైర్యవాక్యములఁ బలుకుచుఁ, బోరు కాయత్తము చేయుచు నిట్లనియెను:

"వీరభటులారా! పాఱిపోవుట వీరధర్మమా? స్త్రీని జూచి పురుషసింహులు వెన్ను జూపుదురా? మీ శరీరము రాజాన్నవర్ధితము గదా? మీ యన్నదాతలకు ద్రోహము దలపెట్టుట యేటి న్యాయము? నమ్మినవారిని నట్టేట ముంచిపోవుట నీతియా?

దేహములు శాశ్వతములుగావు. భాగ్యములు హుళక్కి. శాశ్వతముగ నుండునది కీర్తి యొక్కటియే. ధైర్యము విడనాడుట వీరపురుషధర్మము గాదు. కీర్తిని, గర్తవ్యమును వదలిపెట్టిపోవు వెఱ్ఱులా మీరు? మను సమరరంగములే యుద్యానవనములు. పాఱిపోయిన భుక్తిముక్తులకు దూరమై రెంటికిఁ జెడిన రేవడ లౌదుము. మన మిచ్చటికిఁ బెండ్లి కొఱకు వచ్చితిమా? యుద్ధమునకు గదా వచ్చితిమి. వచ్చిన పని వఱదలోఁ గలిపిపోయిన మీ కన్నము పుట్టదు. నా యానసుఁడీ! పోకుఁడు!"

రాజు మాటలకు సైనికులు రోసము దెచ్చికొని ప్రచండముగఁ బోరఁదొరకొనిరి. మహాదేవుఁడు తాన సాహిణియై మొనల నడపెను. ఇదిచూచి రుద్రమ "యిఁక తడసిన ప్రమాద"మని కరినుండి క్రిందికి లంఘించి, ఖడ్గధారిణియై మహాదేవునిపై కుఱికి, యతనితో ద్వంద్వయుద్ధమునకుఁ దార్కొనెను.

అప్పుడామె భయంకరమూర్తి, కాళికాశక్తిని దలఁపించుచుండెను. కొప్పువీడి మూఁపున వ్రేలుచుండెను. మిడినాగువంటి కత్తి చేతఁ దళదళలాడు చుండెను. కంట నిప్పు లొలుకసాగెను. ముఖ మరిభయంకరమయ్యెను. ఆమె నడుమునఁ గట్టిన కాసె బిగించి మహిషాసురమర్దనివలెఁ గుప్పించుచు, గిలకిల నార్చుచు నీటియతో నతనిఁ బొడిచెను. రుద్రమ సామాన్యవనితయని తలఁచిన మహాదేవుఁడు ఱిచ్చవడి, యీటె పోటు గాచుకొనుచుఁ బోరాడెను. కొంతసేపటికి మహాదేవుని చేతిబల్లెము రుద్రమాంబ బల్లెము దెబ్బకు విఱిగిపడెను. మహాదేవుని గుండె చెదరెను. తన కోటమి తథ్యమని యతనికిఁ దోచెను. తోచుటయే తడవుగా నిఁక రణరంగమునఁ గాళ్లూన లేకపోయెను. దాఁపున నాశ్వికుఁడు మరణించఁగా నిలిచి సకిలించుచున్న యొక యశ్వమెక్కి శరవేగమునఁ బరువెత్తెను.

మహాదేవుని పలాయనవార్త రణరంగమున నల్లుకొనఁగనే యతని సైనికులలో హాహాకారములు చెలఁరేఁగెను. వారు చెట్టుకొకఁడు పుట్టకొకఁడుగాఁ బరువిడిరి. రుద్రమ వారి నంతతో విడువక దేవగిరి వఱకును దఱిమి తఱిమి కొట్టెను. మహాదేవుఁడు పశ్చాత్తప్తుఁడై రుద్రమదేవిని శరణువేఁడెను; కోటి మాడలు (బంగారు నాణెములు) దండుగ యిచ్చి సంధి చేసికొనెను. రుద్రమ యాదవరాజ్యము సరిహద్దుల నిర్ణయించి జయస్తంభముల నాటి, వానిపై "రుద్రదేవ మహారాజు" అను పేర విజయప్రశస్తి చెక్కించెను. యాదవ విజయ మిట్లొక కవి కీర్తించెను.

గళిత బంధంబైన కబరీ భరము మహా
భీలమై మూఁపున వ్రేలుచుండ,
క్రుద్ధ దర్వీకర క్రూర జిహ్వాంచల
చ్ఛవికరాళాసి హస్తమున మెఱయ,
పరిపంథి కంధర ప్రకర నిర్యచ్ఛోణి
తార్ద్రమై ముఖము భయమ్ము గొలుప,
కుపిత శౌర్యాగ్ని పరిఘూర్ణిత దృక్ర్పపా
తమ్మె శాత్రవుల దగ్ధ మ్మొనర్ప,

తఱిమి తఱిమి కొట్టిన నీకు వెఱచి విఱిగి
పఱచి యాదవపతి యౌదు గఱచునాఁడు,
తొమ్ము విఱిచి నిల్వఁగల పురుషుఁ డొకఁడు
కానిపించఁడు మచ్చునకేని రుద్ర!

– పాటిబండ మాధవశర్మ

యాదవరాజు పరాజయమునఁ గాకతి సామ్రాజ్యప్రజల యానందమునకు మేరలేదు. రాజధానిలో విజయోత్సవములు జరిగెను. విజయలక్ష్మీసనాథయై యేకశిలానగరమునఁ బ్రవేశించు తమ సామ్రాజ్ఞికి నగరవాసులు వెలికోట గవని కడనే స్వాగతము చెప్పి, మణి నీరాజనము లర్పించి, మహావైభవముతో నూరేగించుచు నగరుచేర్చిరి. పరాక్రమమూర్తులగు తన సైనికులకు రుద్రమదేవి యేఁబదిలక్షల హొన్నుల బహుమతి చేసెనఁట!

ఇంతటితోఁ గల్లోలము లణఁగెను. రుద్రమదేవి తన రాచకార్యములఁ జక్కపఱచు కొనుచుఁ, బ్రజల మేలే యాలోచించుచు ముప్పదియైదు సంవత్సరములు పరిపాలన మొనర్చెను. ఆమె సత్పరిపాలనమునకుఁ దార్కాణములు నేఁటికిని మనకుఁ గాననగును.

"ప్రోల ననేక శివాలయంబుల రీవిఁ
గట్టించె, బయలి యంగణములందు
నానామహీరుహోద్యానముల్ వేయించె,
నైదువేల వసుంధరామరులకుఁ
బెండ్లిండ్లు సేయించె, బృథివి నాలుగుకోట్లు
ద్రవ్యంబు బాతించె, తవిలిపెక్కు

చెఱువులు త్రవ్వించెc, చెప్పనగ్రంబుగ
నన్నసత్రంబు లెన్నైనc బెట్టె,
నఖిలజనులును తను నంబ యనుచు సారె
పలుకుటయుc దనపేర 'నంబాల' యనెడు
నూరు కట్టించి, నిజమైన పేర వేయి
రుద్రవరములు కట్టించె రుద్రమాంబ."

– సోమదేవ రాజీయము

ఇట్లామె యెనుబది వర్షంబులు జీవించి తన మనుమcడు ప్రతాపరుద్రునికిc బట్టముకట్టి 1295వ సంవత్సరమునc గాలధర్మమొందెను.

## సత్పరిపాలనము

రుద్రమదేవి తన సామ్రాజ్యపు రాబడిని పెంచెను. భూమి నెల్లcగొలిపించియు, బన్నుల నేర్పరచియు ననేక సంస్కరణముల నొనర్చెను. విదేశములతో వాణిజ్యము విరివిగా జరిపించెను. గుంటూరు జిల్లాలోని మోటుపల్లి రేవు నుండి తూర్పున బర్మా, చైనా, తూర్పుదీవులు, సింహళము– వీనితోడను; పశ్చిమమున నరేబియా, పారసీకము, ఈజిప్ట్ మున్నగు దేశములతోడను వర్తకము నభివృద్ధి పఱచెను. ఓడ దొంగలను శిక్షించి వర్తకులకును, ఓడలకును రక్షణనిచ్చుచు ఆయా వస్తువులపై సుంకము నిర్ణయించెను. ఆ కాలమున శ్రీగంధము, కర్పూరము, ముత్యాలు, దంతము, లోహములు, నూలుబట్టలు, కంబళ్లు, సుగంధ ద్రవ్యములు, మిరియాలు, రత్నములు ఎగుమతి యగుచుండెను. ఉల్లిపొరల వంటి సన్నబట్టలకుc దెలంగాణమప్పుడు పేరు మోసియుండెను.

ఆంధ్రదేశ మున్నికిc బ్రసిద్ధమనియు, నచట నున్నన్ని గొబ్బెలు ప్రపంచములో మఱెచ్చటను లేవనియు మోటుపల్లికి వచ్చి చూచిన ఇటలీ యాత్రికుcడు "మార్కోపోలో" వ్రాసి యున్నాcడు. "ఆ దేశమున రత్నాలు దొఱకు కొండలే గలవు. వానకాలమున రత్నములు ప్రవాహములోc గొట్టుకొనివచ్చును. వానిని ప్రజ లేరుకొందురు. కొండలోయలలోc బడిన రత్నములను దెచ్చుటకు అక్కడివారు వింత పద్ధతుల నవలంబింతురు. వారు మాంసపు ముద్దలను లోయలలోc బడవేతురు. ఆ ముద్దలు రత్నములపైc బడగా నా రత్నములు మాంసమున నతుకుకొని పోవును. గ్రద్దలామాంసము దెచ్చి తినుచున్నప్పుడు జనులు వాని నదలించి రత్నములc

గై కొందురు. మాంసముతోఁబాటు గ్రద్దలు మింగిన రత్నములు వాని రెట్టలోఁ బడినప్పుడును వానిని లోకులు తీసికొందురు," అని యతఁడు వ్రాసెను.

ఆమె కాలమున వైద్యశాస్త్రము, తర్కశాస్త్రము, విశేషముగ నాట్యసంగీత శాస్త్రములు పెంపొందెను.

మతవిస్తరణమునకు నామె యెంతయేని తోడ్పడెను. ఆమె కాలమున శివాచార్యులలో నగ్రగణ్యుఁడగు విశ్వేశ్వరపండితున కామెకొన్ని గ్రామముల ధారవోసెను.

రుద్రమదేవి సమకాలికురాలు సుల్తానారజియా. ఢిల్లీ సింహాసనము నెక్కిన యీ యేకైకరమణికిని, రుద్రమదేవికిని రాజ్యనిర్వహణమునఁ బోలికయే లేదు.

తెలంగాణమును తేనె మాగాణముగఁ దీర్చిదిద్దిన యా రుద్రమతల్లికి జోహారొనర్తము గాక!

"తనరాజ్యసీమా నితంబముల్ దాఁట శ
త్రులఁ బాఱఁద్రోలిన రుద్రమాంబ
తెలుఁగు దేవళముల వెలుఁగుచు నున్నది
మలఁగిపోక చుక్క మాడ్కి, దీక్ష
వీరవాసరముల నారాధనము సల్పుఁ
డమృత యోగదీప్తులలమ సతులు!"

– రాయప్రోలు సుబ్బారావు

# 3. బొబ్బిలి రంగారావు

రావుకులాభిమాని, బుధరంజనధర్మ గుణప్రధాని, నా
నా వసుధాధి నాయక గణ స్తవనీయ యశో నిధాని, శౌ
ర్యావసథాయమానవివిధార్భటిమద్వరసేని, రంగరా
యావనిజాని పొల్పెసఁగు నాహవరంగ జితారిమానియై.

– రంగరాయ చరిత్రము

క్రీస్తుశకము ఉత్తరార్ధము ప్రారంభమున బొబ్బిలి సంస్థానమును రావు గోపాల కృష్ణరంగారా వేలుచుండెను. అతఁడు మిగుల బలశాలి; మహాపరాక్రముఁడు; నీతియందు విదురుఁడు. అతని సోదరుఁడు వెంగళరాయఁడు. అతఁడును శౌర్యధనుఁడు; కార్యమన ముందుకుఱుకువాఁడు. దామెర్ల వారింటి యాఁడు బడుచు, శూరనారి మల్లమ్మ రంగారాయని సతీమణి. దామెర్ల ధర్మారావు మల్లమ్మ సోదరుఁడు. వెంగళరాయని బావమఱఁది తాండ్ర పాపారాయఁడు. ఇతనిపేరు విన్ననే పాపలందఱును బాలుత్రాగుట మానివేసెడివారఁట.

అన్నదమ్ములు రంగారావు, వెంగళరావు నింద్రోపేంద్రుల వలె, రామలక్ష్మణుల పగిది యత్యంత సౌభ్రాత్రమున మెలఁగు చుండిరి.

బొబ్బిలికిఁ బొరుగున నున్న విజయనగర సంస్థానము నాకాలమునఁ బూసపాటి విజయ రామరాజు పాలించుచుండెను. రంగారావు సాహసౌదార్యములు, వినయము, ధర్మప్రజానుపాలనము, సౌందర్యము, ప్రతాపము, సైన్యబలము, రాజ్యతంత్ర చాతుర్యము మున్నుగా గల గుణములకు విజయరామరాజున కీర్ష్య జనించెను. "రంగారావను వజ్రము యొప్పిదమునకు నా వైభవమంతయుఁ బూసపాటిది గదా!" యని పూసపాటి విజయరామరాజు చింతించుచు నెట్టయినను రంగారాయని నోడించి బొబ్బిలికోటను స్వాధీనము చేసికొన నిశ్చయించెను. బొబ్బిలి వారిని పరాక్రమమున

జయించుట సాధ్యము కాని పని. కావున, మోసముననే యోడింపవలెనని తలపోసి, కోడిపందెము లేర్పాటుచేసి బొబ్బిలివారి నాహ్వానించెను.

## కోడి పందెము

బొబ్బిలివారిలో రంగారావు తమ్ముఁడు వెంగళరావు కోడిపందెములలో మొనగాఁడు. అతఁడే విజయరామరాజున కుద్దియని విజయనగర సంస్థానాశ్రితులు తెలిపిరి. అందుమీఁద విజయరామ భూపాలుఁడు "కోడిపందెములాడఁదలఁచినాము. విజయనగరము, బొబ్బిలి సరిహద్దులో నొక డేరాలో నీ యాట జరుగును. మిమ్ముల నాహ్వానించుచున్నాను," అని యొక లేఖ వ్రాసి హర్కారాలతో బొబ్బిలికంపెను. వారు నచటికివెళ్లి దానిని వెంగళరాయని కొసఁగిరి. కోడిపందెమన్న మాటకే చెవికోసికొను వెంగళరాయఁ డా యాహ్వానమునకు వల్లెయనెను.

సొదరీకోళ్లు, ఖాస్లాకోళ్లు– ఇట్లు మేలిపందెము కోళ్ల యెన్నిక జరిగెను. బొబ్బిలి దొరలందఱు పందెము డేరా చేరి కొలువుదీరిరి. విజయరామరాజు బలగమంతకు ముందే సిద్ధముగ నుండెను. కోళ్లకుఁ బట్టుకుచ్చులు కట్టిరి. కాళ్లకు బంగారు అందెలను వేసిరి. పంజాకు కత్తులు బిగించిరి. పందెము మొదలయ్యెను. ఇరు పక్షముల వారు దమతమ కోళ్లను వదలిరి. బొబ్బిలి కోడి కలకలమనుచు నువ్వెత్తుగ నెగిరి విజయనగరము కోడి తలపయిని కాలికొలఁది పొడిచెను. విజయనగరము కోడి గిరగిరమని తిరుగుచు భూమిపైఁ బడెను. బొబ్బిలికోడి కొక్కిరించుచుఁ గూఁత వేసెను. విజయరామరాజు మఱియొక పోతరించిన పుంజును విడిచెను. దానిని జూడఁగానే బొబ్బిలికోడి మహోద్రేకమున ఱెక్కలార్చుచు, నిటారుగ నిలచి, తటాలున నా కోడిమీఁద దూకి, ఱెక్కలదిమిపట్టి, ముక్కునఁ, గడుపునఁ, గాలునఁ బొడుచుచుఁ, గాలికత్తితో గొంతుకోసెను. ఇట్లెన్ని కోళ్లు వచ్చి యెదిర్చినను బొబ్బిలికోడి వాని నన్నిటిని జయించెను.

బొబ్బిలివారు గెలిచిరి; విజయరామరా జోడిపోయెను. పాపారాయఁడు, వెంగళరాయఁడు, రంగారావు నొకరినొకరు చూచుచు ముసిముసినవ్వులు నవ్వుకొనిరి. ఆ నవ్వు విజయరామరాజు గుండెలో బల్లెమువలెఁ గ్రుచ్చుకొనెను. దీన నతని యీర్ష్య మఱింత రగిలి ప్రబలశత్రుత్వముగాఁ బరిణమించెను.

బొబ్బిలి, విజయనగరము సంస్థానములు గోలకొండ నవాబు నిజామలీ కధీనరాజ్యములుగ నుండెను. నిజామలీ 1753 వ సంవత్సరమున ఉత్తర సర్కారులను

(గంజాము, విశాఖ పట్టణము, తూర్పుపడమర గోదావరులు, కృష్ణ, గుంటూరు జిల్లాలను) ఫ్రెంచివారికిచ్చివేసెను. అగుట నీ రెండు సంస్థానములును ఫ్రెంచివారి యధీనమునకు వచ్చెను.

## ముష్యూర్ బూసీ ప్రయాణము

బహుకాలమునుండి యుత్తర సర్కారులలో 'ఖిరదా బాద్' (జమాబందీ) జరుగలేదు. కావున జమీందారులందఱు నెంతయో పేష్కష్ బకాయ చెల్లించవలసి యుండెను. దీనిని వసూలు చేయుట ఫ్రెంచివారి కవసరమయ్యెను. అగుటచే ఫ్రెంచివారి గవర్నరు ముష్యూర్ బూసీ, హైదరుజంగను శిరస్తాదారుతోను, బెద్ద సైన్యముతోను 1856 వ సంవత్సరము నవంబరు నెల 16వ తేదీన గోల్కొండనుండి బయలువెడలి ఆనెకపల్లి, రేకలవలస, చోడవరము, పిఠాపురము, పెద్దాపురము మజిలీల మీఁదుగా రాజమహేంద్రవరము చేరెను. అక్కడ నతఁడు గౌతమీ నదీతీరమునఁ గల కోటిలింగ క్షేత్రమున దండువిడిసి చెంగావి మఖమల్ కనాఁతు కుట్టు సొగ సుట్టిపడఁగాఁ దీర్చి కట్టినట్టి యున్నిగుడారములో మకాముచేసి, జమీందారులను బిల్వఁ బంపుమని హైదరుజంగున కాన తిచ్చెను.

హైదరుజంగు జమీందారుల కందఱికిని తాఖీదులు పంపెను. తాఖీదులు చేరుటయే తడవుగా పాయక రాయఁడు, కిమిడిపట్టణపురాజు, నారాయణదేవుఁడు, నరసరాజు, గొలుగొండ మన్నెపురాయఁడు మున్నుగాఁగల జమీందారు లందఱుకు బూసీ భేటికి వచ్చిరి. నవలక్ష కళింగాధీశ్వరుఁడగు విజయరామరాజు, కాకర్లపూడి జగన్నాథరాజు కొంత ఫౌజుతోను, సత్యవరపు రామభద్రరాజు కొంతబలముతోను, ముఖీ కాశీపతి రాజు కొంతదళముతోను, చింతలపాటి నీలాద్రిరాజు వేఱొక సైన్యముతోను వెంటరాఁగాఁ, జతురంగబలములతో మహావైభవమున నేనుఁగు నెక్కి వచ్చెను.

విజయరామరాజు బూసీకడకు బయలుదేఱుటకు ముందు బొబ్బిలివారి కొక లేఖ వ్రాసి పంపెను. "జమాబందీకి ఫ్రెంచివారు వచ్చినారు. వారి భాష మనకుఁ దెలియదు, మన భాష వారికిఁ దెలియదు. మాకును మీకును నెన్నిపగ లున్నను మన సైన్యము నొక్కటిగాఁ గూర్చికొందము. బూసీయొద్ద కాని పోని మాటల వల్ల కలహము వచ్చిన, వానిని పుదుచ్చేరి వఱకుఁ దఱుమ గొట్టుదము," అని యా లేఖలోని వర్తమానము చదివి వెంగళరాయఁడు కిలకిలనవ్వి "మిమ్ముఁ బిలచితే మీరు పోవలెను,

మమ్ముఁబిలచితే మేము పోవలెను. మేము మీకుఁ దోడుగా రాము," అని ప్రత్యుత్తరము పంపెను.

దీనితో విజయరామరాజు ఎక్కడలేని కోపముతో "బొబ్బిలివారింతకు దిగినారా? ఒక్క గడియలో బొబ్బిలి కోటను లేపించెదను. కోటలోని రాజస్త్రీలను జెఱపట్టించి పరాసు కూడు తినిపించెదను. వెంగళరాయని కింత పొట్ట క్రొవ్వు పట్టినదా? బొబ్బిలికోటను స్వాధీనము చేసికొని, గాడిదల చేత దున్నించక పోయితినేని నా పేరు విజయరామరాజు కాదు!" అని కుడి మీసము దువ్వి, ప్రతిన పట్టెను.

రావు రంగారావుకును బూసీ తాఖీ దందెను. దాని నాతఁడు లెక్క పెట్టలేదు; తిరుగుజాబైనను వ్రాయలేదు. దివాణమునకును రంగారావునకును రవరవలు పుట్టించుటకు మంచియదను చేకూరినదని భేదనిపుణుఁడగు విజయరామరాజు సంతోషమునఁ బొంగిపోయెను.

## విజయరామరాజు తంత్రము

విజయరామరాజు బూసీకి వెలలేని కానుకలిచ్చి, హైదరు జంగునకు లక్ష రూపాయలు లంచముపోసి, తన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనుటకుఁ బన్నుగడ తలపోయుచుండెను. బొబ్బిలి కోట తన కప్పగించినచోఁ బన్నెండు లక్షల రూపాయలు నజరిత్తు నని యాతనికాశగొల్పెను. బూసీ దుబాసి లచుమన్నయు నీ కుట్ర కనుకూలించెను.

బూసీ కొలువుతీర్చి, జమాబందీ చర్చలు ప్రారంభించెను. "కళింగసీమలోని రాచకార్యమును యథావిధిగాఁ బయికముతో నిఖావివరణఁజేసి తెలుపుఁడు. ముందునుండి కళింగమునకుఁ బన్నెండు లక్షలరూపాయలు జమాబందీ మొత్త మేర్పాటు గలదు. సగము మీ కిప్పుడు చెల్లింతును. తక్కినది మీరు గోదావరి దాటి వెళ్లులోపుగఁ జెల్లింతును," అని విజయరామరాజు తెలిపెను.

"పేష్కష్ చెల్లించుట కందఱు జమీందారులును వచ్చిరా?" అని బూసీ ప్రశ్నించెను.

"బొబ్బిలి దొరలు మాత్రము రాలేదు," అని విజయరామరాజు లంచము చవిగొన్న శిరస్తాదారు హైదరుజంగు ప్రత్యుత్తర మిచ్చెను.

బూసీ: కారణమేమి?

హైదరుజంగు: సరకారులలో బొబ్బిలి వెలమదొరలు మహాబలవంతులని వాసికెక్కినారు. బెబ్బులి మీసమైన మెలిపెట్టవచ్చుఁగాని బొబ్బిలికోటపై నడచి పోరుచేయ సాధ్యము కాదను ప్రథయున్నది. ఆ కండ కొవ్వుతో వారు మన ఉత్తరువును లెక్కపెట్టలేదు. విజయరామరాజుగారు మిగుల నాదరముతో మనకెదురు సేవలు చేయఁగా, బొబ్బిలివారు జవాబు కూడఁబంపలేదు.

బూసీ: (రామరాజు వైపు తిరిగి) రాజుగారూ, ఇది యెంతవఱకు నిజము?

రామరాజు: ఏలినవారికిఁ దెలియని దేమున్నది? కండ కావరము కానిచో వారు దివాణము తాఖీదును గడ్డిపఱకవలెఁ జూతురా?

బూసీ: ఏమేమీ?

రామరాజు: రంగారావు సీమలోపల పితూరీలు చేయుచు శిస్తు వసూలు చేయనివ్వఁడు.

బూసీ: దివాణము శిస్తుదస్తుకుఁ గూడ నడ్డుపడగల బలవంతులా వారు?

రామరాజు: తాండ్ర పాపారాయఁ డొక్కఁడే చాలునండీ, తిరుగుఁబాటు చేయుటకు!

బూసీ: సరే! వారు దివాణానికి పయిక మెందుకు చెల్లింపరో చూతము? మా ఫిరంగులముందు వారి పరాక్రమ మేపాటిది?

హైదరుజంగు: పెక్కు రాజులను తజివీజుతో మెలఁగఁ జేసిన మన ఫౌజుల యెదుట నీ మన్నెదొర లెంత వారండీ?

రామరాజు: దివాణమువారు బొబ్బిలివారి నొక కంటఁ గనిపెట్టుచుండవలెను. లేనిచోఁదక్కిన జమీందారులును నవిధేయులగుదురు.

హైదరుజంగు: అందుకు సందేహమా? బొబ్బిలి వారిని శిక్షింపని యెడల నిఁక దివాణమనిన నెవరికిని మన్ననయే లేకపోవును.

బూసీ: నిజమే. బొబ్బిలిని ముట్టడించుటకు నిశ్చయించినాము.

విజయరామరాజు: బొబ్బిలి రాజులను మీ పరాక్రమముతో జయించి నాకు బొబ్బిలిలోఁ బట్టము గట్టుఁడు. వారి జమీను నా కప్పగింపుఁడు. మీ ఫర్మానాకు కట్టువడి బకాయి శిస్తు వసూలు చేసి యప్పగింతును.

హైదరుజంగు: బొబ్బిలి కిల్లాను హల్లా చేయుదుము. మీ కప్పగింతుము. కల్ల కాదు, అల్లా యాన సుఁడీ?

బూసీ: (హైదరజంగుతో నాలోచించి) రాజుగారూ, బొబ్బిలికోట మీకు ఫర్మానా వ్రాసి యిచ్చుచున్నాను.

తన పన్నుగడ యిట్లు కొనసాగినందుకు విజయరామరాజు సంతోషించెను. బొబ్బిలి యిఁక తనదేనని యతఁడు లోలోన నానందహర్మ్యములు నిర్మించుకొనుచు, బొబ్బిలికోట ముట్టడి కాయత్తపడుచుండెను.

పరాసువారు డేరాలు గాడిబండ్లమీఁద గట్టించిరి. తక్కిన సరకు సరంజామా యెడ్ల మీఁద నెత్తించిరి. రాజమహేంద్రము కదలిరి. మొదట గుఱ్ఱపు దళములు, తర్వాత నేనుగుఁలు వాని వెంట లాల్‌ఖాన్ అను సేనాని, పిదప శిరస్తాదార్ హైదరుజంగు పరివారము, దాని వెనుక ఫ్రెంచి బలములతో ముష్యార్ బూసీ, యతనితో దుబాసి లచుమన్న, రాజుల రాణువలతో విజయరామభూపాలుఁడు తరలి, రాత్రి బొబ్బిలిఁజేరిరి. పాత బొబ్బిలి యొద్దఁ గొందఱు, గొల్లపల్లి కోనేఁటి సమీపమునఁ గొందఱు విడిసిరి. మొత్తము దండు పదనొకండువేలకుఁ బైగా నుండెను.

## ధర్మారావు దౌత్యము

బొబ్బిలిదొరలకీ సంగతి యేమియుఁ దెలియదు. ఏబది పెండ్లిండ్ల వేడుకలో వారు మైమఱచి యుండిరి. ఇంతలో ఫ్రెంచివారి ఢంకా "ఢాంఢాం ఢా"మ్మని పలికెను. రంగారావుకిది వింతఁగా దోఁచి, చంద్రశాల యెక్కి, కోటచుట్టును గలయఁ జూచెను. కనుచూపుమేర వఱకుఁ గోట చుట్టును దండే కనిపించెను. ఫ్రెంచివారి జండా, విజయరామరాజు పతాకము గనుపించెను. ఇది రాజుకుట్రయేనని యాతనికి తేటతెల్లమాయెను. దండను సముద్రమధ్యమున బొబ్బిలి చిన్న ద్వీపమువలెఁ గన్పట్టుచుండెను. రంగారావు తన యాప్తులఁ బిలిపించి, జమాబందీకోసము బూసీ వచ్చుట, విజయరామరాజు మున్నగు జమీందారులు బూసీకడకు వెళ్లుట, హైదరుజంగు రామరాజు పక్షమగుట, రామరాజు లక్షలకొలఁది పైకము లంచమిచ్చి తమ పైకి జాతివారలను దెచ్చి కలహించి తమ రాజ్యమనుభవింపఁ దలఁచుట మున్నగు విషయములను బూసగుచ్చినట్టు తెలియఁబఱచి, గర్తవ్య మేమి యని ప్రశ్నించెను.

బూసీ రాజమహేంద్రవరముకడ విడిసి యున్నప్పుడే యతనిని గలిసికొని యుండిన నింత చేటు వచ్చియుండదు గదా? సరే! అదికాకున్నఁ గానుకలతో దూతలఁ

బంపి మన్ననవేఁడి యున్న నీ తగవే యుండెడిది కాదు గదా? పెండ్లి సందడిలో రాచకార్యముల నేమఱుట పాఁడియా? నగరు నిండను నాలగోల బాలగోలగ నున్నదే? ఈ వివాహ ముహూర్తమేలాటిదో? తాండ్రపాపారాయఁ డుండిన నెంత బాగుండెడిది? – అని యిట్లు గడచిన దానికిఁ జింతించువారును, విజయరామనృపాలుని దూషించువారునే కాని, చేయఁదగుఁ గార్యమును సూచించువా రొకరును లేకుండిరి. రంగారావు తన తమ్ముఁడు వెంగళరావు, సేనాపతులు పడాల రామన్న, ముత్యాల పాపన్న, బంధువులు చెలికాని వెంకన్న, పంతెన బుచ్చన్న మున్నగువారితో నాలోచింపసాగెను. రంగారావు వెంగళరావుతో నిట్లనెను:

"తమ్ముఁడా! పరాసువారిని మనము జయింపలేము. వారిని యెదుర్కొను ఫిరంగులు మనయొద్ద లేవు. పాపారాయఁడును బొబ్బిలిలో లేఁడు. పాలకొండ పరగణాకు వలస వెడలి యచటఁ దల దాఁచుకొని యా మీఁదట వెనుకపాటుగ బొబ్బిలి గడీ మఱల పట్టుకొందము."

అన్న మాటలు విని వెంగళరావున కెక్కడలేని కోపము వచ్చెను. "రాజస్త్రీలతో వలసబోయిన పడమటి వెలమదొరలు నవ్వరా? ఇరుగుపొరుగు వారు హేళన చేయరా? మానము పోయినపిదప ప్రాణ మెందులకయ్యా? ఈ శుష్కసంభాషణము వలనఁ బ్రయోజనము లేదు. లడాయికిఁ దయారుకండు!" అని వెంగళరావు తెగ వేసి చెప్పెను.

"తమ్ముడా, తొందర పడకుము. సంధికోరనిచో సర్వనాశనము తప్పదు. ఒక్క ప్రయత్నముచేసి, యది సఫలము గాకున్న నీవు చెప్పినదే గతి," అని రంగారావు వెంగళరావు నూఱడించి, తన బావమఱఁది ధర్మారావును బూసీయొద్దకు రాయబార మంపెను.

ధర్మారావు బూసీకడకు వెళ్లి యిట్లు విన్నవించెను. "మీరు మా శత్రువగు విజయరామరాజు మాటలు విని మా మీఁది కన్యాయముగా దండెత్తివచ్చినారు. రాజుమాట వినుట న్యాయముగాదు. మాకును మీకును పగలు లేవు. ఇందు మాయపరాధ మేమియు లేదు. మీ తాఖీదు మాకందు వేళకు మేము పెండ్లి సందడిలో నుంటిమి. మా ప్రభువు రంగారావు తమ్ముఁడు వెంగళరావునకుఁ, గుమార్తె సుందరమ్మకు నిట్లేఁబది వివాహములు జరిగెను. కావున మా ప్రభువు మీ సముఖమునకు సకాలమున రాలేకపోయెను. కోటలోఁ బెండ్లిముచ్చట లింకను ముగియలేదు. కోటమీఁది కిట్టియెడ వచ్చు టుచితముగాదు. ఆఱులక్షల శిస్తు అగావుగా

నిత్తుము. సిబ్బంది ఖర్చు కూడఁ జెల్లింతుము. ఈతూరి బొబ్బిలికోటను మన్నింపుఁడు. రంగారావు నిప్పుడే పిలువ నంపుదును.”

ధర్మారావు మాటలు బూసీ చెవికెక్కలేదు. “ఇఁక నిట్టి సమాధానపు మాటలతో ఫలములేదు. బొబ్బిలికోటను విజయరామరాజునకు ఫర్మానా యిప్పించినాము. దానికిఁక తిరుగులేదు. వెంటనే బొబ్బిలి గడీని ఖాళీచేయుఁడు. మీరు మా చెప్పుచేతులలో నున్న యెడఁ బాలకొండ పరగణా మీకీయఁగలము. దానిని బాగుచేసికొని వలసవెళ్లుఁడు,” అని బూసీ యనెను.

“ఆడితప్పనట్టి సత్యవంతులా మీరు? పుదుచ్చేరి విజయరామరాజుకిచ్చి మీ జనానాతో వలసపోరాదా? ఒకరి యిల్లు మఱియొకరి కివ్వను మీ రెవరు? తాతముత్తాతల నాఁటి రాజ్యము విడిచి వలస పోవలసిన యగత్యము మాకెందుకు? ఇల్లు ఖాళీ చేయుటకు మేము చేసిన యపరాధమేమి? అంతఃపుర స్త్రీలతోఁ బరదేశమునకుఁబోయి నగుబాట్లు చెందుటకు మేము పిఱికి పందలమా? బొందిలో నూపిరి యున్నంతవఱకు బొబ్బిలి వదలము!” అని ధర్మారావు కుండబ్రద్దలు కొట్టినట్టు నుడివి వెనుదిరిగి వెళ్లెను.

## రంగారావు నిశ్చయము

సమాధానము కుదురలేదు. ఇఁక సమరముతప్ప గత్యంతరములేదు. రంగారావు మిగుల వగచెను. విజయరామరాజు మాటలకులోఁగి పరాసు గవర్నరు చేయు నన్యాయకార్యమతనికిఁ జాల వ్యథకలిగించెను. “దివాణమువారు అర్థమోహమున నున్నారు. ఇఁక ప్రయోజనములేదు. విజయరామరాజు భేదోపాయ మేపాటినది. ధనాశాపరులకు యుక్తాయుక్తములు దెలియవు. కావున నిఁక జడియఁబనిలేదు. ధైర్యముగాఁ బోరి మడియుటే సరి!” అని కృతనిశ్చయుఁడాయెను. యుద్ధమున కాయత్తము చేయుఁడని యానతిచ్చెను.

రణభేరి మ్రోఁగసాగెను. కోటలోని, యుద్ధవీరులందఱును దొరకినమట్టుకు నేవో యాయుధములు పూని రణమునకు సిద్ధమైరి. వీరులందఱు ననఁగా నెందఱో కారు; మూఁడువందల మంది మాత్రమే. బొబ్బిలివారికి ఫిరంగులు లేవు. ఉన్న తుపాకులును కొద్దియే. అవియును నంత మేలైనవి గావు. వెలమవీరులలో నొక్కొక్కరు మన్నె హంవీరులె; పెరమన్నె మదవిభాళులే; వైరి రాజగాయ గోవాళ బిరుదాంచితులే; గుఱిదప్పక యొకదెబ్బ కేగురు, నార్గురు శత్రువులను నొంపఁగలవారే; నూటికొక్కఁడే చాలనఁదగిన మేటిమగలే; శత్రువుల గుంపులను గగ్గోలుగా బడఁగ్రుమ్మ దిట్టలే.

కాని, వారికి సమరసామగ్రి తక్కువ. ఎదిరి యుద్ధసామగ్రి యపారము. ఫుట్లకుఁబుట్లు తుపాకిమందు వారికడ నుండెను. అయినను రంగారావు వెనుకంజ వేయలేదు. కోటబందోబస్తు చేయింపసాగెను.

బొబ్బిలిపట్టణము మొదటికోట తట్టుకోట. ఈ కోట రక్షణ పడవాల రామన్నకు అప్పగింపఁబడెను. రెండవ కోట పుట్టకోట. దీని రక్షణకూడ రామన్నకే యివ్వఁబడెను. ఈ రెండిటికి లోపలనున్న రాతికోట నాలుగు బురుజుల మీఁద కాకర్లపూడి వెంకన్న, ఇన్గంటి ధర్మారావు, చెలికాని వెంకన్న, దామెర ధర్మారావు తమ తమ దండుతో సిద్ధముగనుండిరి. ఈ నాలుగు బురుజులలో నొకటగు మూల బురుజులో ముత్యాల పాపన్న సన్నద్ధుఁడై యుండెను.

కోటబురుజుల నెక్కుటకు వచ్చు శత్రువులపైఁ బోయుటకు బురుజులో జిగురంబళ్లు, వేడి వేడి నూనెకుండలు, పొగబాణములు, చిచ్చుబుడ్లు, వడిసెలలు, మందు తిత్తులు, వత్తులు మున్నగునవి సిద్ధముగా నుంచఁబడెను. రంగారావు కోటగోడలపైఁ గలయఁదిరుగుచు నన్ని యేర్పాట్లను సరిచూచు చుండెను. ఈ మాఱు రణభేరి మఱింత గంభీరముగ మ్రోఁగెను. దాని ధ్వని,

ప్రళయకాల పయోదపటలీ పరిస్ఫుర
ద్గర్జా సమూర్జితాఖండశక్తి,
శైలశిఖాతట స్ఖలిత గండోపల
జనిత నిర్ఘోష ప్రచండ పటిమఁ,
బురభిదుద్య త్కరాంభోరుహోచ్చాలిత
కల్పాంతఢక్కా నికామ కలన,
మందరక్షోణి భృన్మథిత మహార్ణవ
ఘుమ ఘుమా రభటికా గుంభనంబు" గా వినఁబడియెను.

– రంగరాయచరిత్ర

## మల్లమ్మ లేఖ

యుద్ధము తప్పదన్న సంగతి యంతిపురమున నున్న రంగారావు రాణి మల్లమ్మ విని మిగులఁ జింతించెను. పెండ్లిండ్ల సందడితోఁ గలకలలాడు కోట బుగ్గిపాలు కానుండుట యామె సహింపలేక పోయెను.

"బొబ్బిలి వారి కెట్టి యాపద గలిగినను జింతలేదు. కాని, పెండ్లికోసము వచ్చిన చుట్టా లందఱును మాతోఁబాటు మడియుట యుచితమా? పెండ్లి పిదప పదునాఱునాళ్ల పండుగ గూడ జరుగలేదు. పోరు మరి కొన్నాళ్ల వఱకాఁగిన, వచ్చిన బంధువులు క్షేమముగాఁ దమ యూరు చేరికొందురు. తర్వాత యుద్ధము జరిగినను బంధువు లకారణముగా మరణించుట యుండదు. ముట్టడి నాఁపుట కేదియేని యుపాయ మాలోచించుట మంచిది. దీని కంతకునుఁ గారణము విజయరామరాజుగదా! అతని పేర నొక లేఖ వ్రాసినఁ బ్రయోజనముండునేమో! ప్రయత్నించి చూచెదను," అని రాణి మల్లమ్మ యాలోచించి లోకొలువున నేకాంతమునఁ గూర్చుండి విజయరామరాజు పేర నిట్లుత్తరము వ్రాసెను.

"అన్నా!

వందనములు. ఇంతకాలము నుండియు మిమ్ము నన్నఁగా నమ్మియున్నాను. దామరవారి సంస్థానమును మఱచి పూసపాటి వారిల్లే పుట్టిని ల్లనుకొన్నాను. విజయనగరము, బొబ్బిలికోట కావడి కుండలవలె నిరుగు పొరుగున నుండునవి. మునుపటి పగలు మనసులో నుంచుకొని, కాని సమయమున నూరు పేరెఱుఁగని పరాసువారినిఁ దెచ్చి మాకోట ముట్టడించుట న్యాయము కాదు. నా కూఁతురు సుందరమ్మ వివాహమును జూచుటకు మా చుట్టాలు పసిపిల్లలతో, ముదుసళ్లతో వచ్చియున్నారు. వారికిఁ గష్టము కలిగించుట మాకుఁదగదు. నా పసుపు కుంకుమలు, చేతినల్లగాజులు, మెడనల్లపూసలు నిలుపుఁడు. ఈతూరి బొబ్బిలిని మన్నింపుఁడు."

ఇట్లతిదీనముగఁ గమ్మవ్రాసి మల్లమ్మ తనదాదులలోఁ బెద్దదియు, రాజసేవలో నేండ్లు గడపినదియునగు వేంకటలక్ష్మి యనుదానినిఁ జేరఁబిలచి, యది యందించి, విజయరామరాజున కిచ్చిజవాబు తెమ్మనిపంపెను. వేంకటలక్ష్మియు నాలేఖఁగైకొని, పహరాజవానులఁ దప్పించుకొనుచుఁబోయిఁ, గొల్లపల్లికొనేఁటి యొద్ద ఠాణ్యము వేసిన విజయరామరాజు డేరాఁజేరి, యాతని దర్శించి, యాలేఖయున్న లకోటా నందించెను.

రామరాజా లకోటాను జింపి చదివెను. "ఆఁడువారి జాబులిపుడు కొలువునకు రారాదు. రాణిమల్లమ్మగారు నాకుఁ దోబుట్టువులే. కాని, యిప్పుడు బావమఱఁదులకుఁ బగవచ్చినది. రంగారావును హతమార్చి బొబ్బిలి గైకొన నిశ్చయించినాను. మల్లమ్మ ముండమోసితే ముండభరణముగ మూఁడూళ్ల నిచ్చెదను. ముండకోక ముందుగనే యంపుదును. చింతింప బనిలేదని యామెతో నినుము," అని యతఁడు వేంకటలక్ష్మిని బంపివేసెను.

వేంకటలక్ష్మి తిరిగివచ్చి మల్లమ్మకు విజయరామనృపతి మాటలు వినిపించెను. అవి యామె చెవులకు ములుకులుగా సోఁకెను. 'విజయరామరాజు బాలగోల యాలగోల వినకుండునా?' యని యనుకొనిన యామె యాశలన్నియు నడియాసలయ్యెను. "దురాత్ముఁడా! పెండ్లిముచ్చటలోనున్న మాపై హఠాత్తుగ నెత్తివచ్చి, మమ్ముఁజంపు పాపకృత్యమున కొడిగట్టి యున్నావు. పట్టుమని మూఁడుదినములు గడువక మునుపే బొబ్బిలి పాటి మట్టిమీఁదనే దిక్కు లేని చావు చచ్చెదవు!" అని యామె యతనిని శపించెను.

## విజయరామరాజు ప్రోత్సాహము

ఇట్టి యాపదలోఁ దనబావమఱఁది తాండ్ర పాపారాయఁ డుండిన నెంతయో మేలని వెంగళరాయఁడు యోచించి రాజాముకోటలోనున్న యతనినిఁ బిలువనంప నెంచెను. ఇద్దరు బేగిరావులను రావించి కూరలమ్మువారి వేషము వేయించెను. వారును చీరకట్టి, రవికతొడిగి, గంపలనిండ కూరలు నింపుకొని, యచ్చముగఁ గూరలవారివలెనే యగపడసాగిరి. వెంగళరావు పాపారాయని కొక జాబు వ్రాసి, దాని నొక లకోటాలోఁ బెట్టి యతికించి, యా లకోటాను గోధుమరొట్టె మధ్యనబెట్టి, యొక గంపలో నుంచెను.

ఆ బేగిరావులును బొబ్బిలికోట వెలుపలికివచ్చి ముట్టడివేసిన పరాసుల దేరాలయొద్ద కూరలమ్మిన ట్లభినయించుచుఁ, గనుమఱఁగిపోవుచు, రాజాముదారి మలుపుతిరుగు కొండను సమీపించిరి. అచట పహరాయున్న పరాసులకు వీరియెడ సందేహము కలిగెను. అగుటవారు వారిని యాపిరి. గంపల యట్టడుగునున్న రొట్టెలను త్రిప్పిచూచుచు, వానిని జింపిరి. ఒక రొట్టెనుండి మర్మము జాబు బయటఁబడెను. బేగిరావులు శత్రువులకు బందీలగుట కిష్టపడక పహరావారిని జంపి, తాము పొడిచికొని చచ్చిరి.

బేగిరావులు పట్టుబడి వీరస్వర్గమందిన సంగతి వెంగళరావునకుఁ దెలియదు. పాపారాయఁడు తెల్లవారువేళకు బొబ్బిలిఁ జేరునని యతఁడాసపడుచునే యుండెను.

తాండ్ర పాపారాయఁడు బొబ్బిలిలో లేఁడనుట యీ మర్మముజాబు వలన పగతురకుఁ దెలిసెను. విజయరామరాజు ముదమునకు మేరలేదు. ఎవరనిన నతని గుండెలు జల్లు మనునో యతఁడు కోటలో లేఁడు. వెంటనే యతఁడు కట్టుపంచెతోఁ, గాలి నడకతోఁ దన దేరా నుండి బయలు వెడలి, బూసీ దేరా చేరెను. అర్ధరాత్రివేళ నతనిని జూచి బూసీ విస్మితుఁడయ్యెను.

"ఏమి మహారాజా! ఇట్లర్ధరాత్రి విచ్చేసితిరి?" అని ప్రశ్నించెను.

విజయరామరాజు : ఈ క్షణమునకే బొబ్బిలికోటను పట్టవలెను. రాత్రి తప్పిన నిఁక మనవలనగాదు.

బూసీ : ఏల?

విజయరామరాజు : డొంకలోని పులి పొదలోఁ జేరినది. తాండ్ర పాపయ్య కోటలో లేఁడు, రాజాములో నున్నాఁడు. ఇదిగో! చూడుఁడు రంగారావు వ్రాయించిన మర్మముజాబు. అతఁడు వచ్చిన మనము కోటపట్టుట కడుగష్టము.

బూసీ : అయ్యా, ఇపు డంధకారము గదా! తెల్లవారనిండు. జాబు తెచ్చినవారు మన కంటఁబడిరి గదా? ఇఁక త్వరలోఁ దాండ్ర పాపయ రాఁడు గదా?

విజయరామరాజు : దొరగారూ! ఏమి యిట్లు సెలవిచ్చుచుంటిరి? ఇట్టి బేగిరావుల నతఁడెందఱిని బంపెనో? వేలకొలఁది మన్నె ఫౌజుచేత ఇలాయీలు వేయించి పట్టపగలు గావింతును. ముట్టడి కిదియే సమయము.

బుస్సీ యొప్పుకొనక తప్పినదికాదు. సర్దార్ల నందఱను బిలువనంపి వెంటనే ఖిల్లా హల్లా కానతిచ్చెను.

## ఖిల్లా ముట్టడి

సాహసోద్ధతుఁడగు జంద్రాల్ మహమ్మదు, మహాపరాక్రమవంతుఁడగు లాల్ ఖాను, సిద్దీబిలాల్ ఖాను, హుసేన్మయూరు, షుకురలీ మున్నగు మొగలాయి సేనానులును, లాసూ, పనాల్, మార్టిన్, కుప్లాం మున్నగు పరాసు సరదారులును దమ తమ బలములతో వచ్చిరి. చెరి మూఁడు గిన్నెల చొప్పున సైనికుల కందఱకును సారాయి పంచి యివ్వఁబడెను. సారా నిషాలో వేలకొలఁది సిపాయిలు, ఫరంగులు, చట్కార్లు, వలందులు, బుడతకీచులు, గోసంగులు కోటవైపు నడచిరి. జెఱ్ఱిని జీమలు బట్టినట్టు నిచ్చెనలు, శిరస్త్రాణములు, కఱ్ఱులు, కోలలు, పాఱచిప్పలు మున్నుగాఁగల సాధనములతో సుతారులును; దుమికివచ్చు నాశ్వికదళములును; ఊపునవచ్చు కుంజరపుంజములును; ఫిరంగులు, సూరతు మందుగుండ్లు పట్టించుకొనుచుఁ బదాతి సైన్యములు నువ్వులు చల్లినను రాలనంత దట్టముగాఁ గోటచుట్టును మూఁగినవి.

తూర్పు తెలతెలవాఱుచున్నది. ధామ్! ధామ్! ధామ్! ధామ్! నాలుగు ఫిరంగులు ప్రేలినవి. రంగారావొక బురుజుమీఁదికి జనెను. ఆహా! ఫౌజులసంఖ్య! చేతులతో

సన్నలుచేయుచు, నెలుగెత్తి యానతు లిచ్చుచున్న పరాసు ఉద్యోగులు; తొందర తొందరగా సిపాయిలను బారులుగాఁ దీర్చుచున్న మొగలాయి సర్దారులు; అక్కడక్కడ నిల్చి సైనికులను వ్యూహములుగా నేర్పఱచుచున్న రాచవారు; ఫిరంగులలో మందును, గుండ్లను దట్టించుచున్న సేవకులు; గుఱ్ఱములపై జీనులు గట్టుచున్న రౌతులు; కోట తలుపులు పగులఁగొట్టుట కేనుఁగులు తోలుకొని వచ్చుచున్న మావటివాండ్రు - వీరితో తట్టుకోట ముందుభాగపు మైదానమంతయుఁ గిటకిట లాడుచుండెను. “అన్నన్నా! కానిపనికిఁ బూనుకొన్నాఁడే మహారాజు!” అని మాత్రము రంగారావు మనసులో ననుకొనెను.

ధామ్! ధామ్! ధామ్! ధామ్! ఇరువాగులవారును దలపడిరి. ఫిరంగుల తొలిదెబ్బకే తట్టుకోట బ్రద్దలాయెను. గడ్డలుగడ్డలుగ మట్టి పడసాగెను. పడవాల రామన్న తన సైనికులతోఁ గోటగోడ మాటుననుండి తుపాకిగుండ్లు ప్రేల్చఁదొడగెను. కోట యనుశక్తి గ్రుడ్లెఱ్ఱ గావింపఁగా రాలునిప్పులో యనునట్లు, కోటయను నల్లత్రాచు క్రక్కు వేడివిసపు గుళికలో యనునట్లును తుపాకిగుండ్లు కననగుచుండెను. తట్టుకోట గండిపడియెను. పరాసు సైనికులు ప్రవాహమువలె లోపలి కుఱికిరి. పడవాల రామన్న వెంటనే యొక బారా తేజీనెక్కి, గండిపడ్డచోట దనసేనల నడ్డుపెట్టి, శత్రువులను దునుమాడు చుండెను. శత్రువులు వేల సంఖ్యలోఁ ద్రోసికొనివచ్చు చుండిరి. పడవాల రాముని భటులు శత్రువుల నీటియలతోఁ బొడుచుచుఁ గత్తివ్రేటులఁ దినుచుఁ, బిడికిలితోఁ గ్రుద్దుచు, గొంతులు నులుముచు, నిట్లతిఘోరముగాఁ బోరుచుఁ దరుముచుండిరి.

పరాసువారు పడవాల రామన్న ధాటికి వెనుదీసిరి. కత్తులయుద్ధము, బల్లెములపోరు చేయుచున్నంత కాలము వెలమవారిని జయింపలేమని హైదరుజంగు యోచించెను. అతనికొక యుపాయము తట్టెను. ఒకచోట మూఁడుపుట్ల తుపాకిమందు పఱపించి, నాలుగు వైపులనుండియు మందు త్రాళ్లుతగిలించి, పడవాల రాముని సైనికుల నావైపు మరలించెను. పడవాల రామన్న తన సైనికుల మొనలో నిలిచి, దెబ్బకుఁ బదుగురుగా నఱకుచు, మందు పఱచిన ప్రదేశము చేరఁగనే పరాసులు మందు త్రాళ్లకు నిప్పంటించిరి. మందు భయంకరధ్వనితోఁ బ్రేలెను. పడవాల రామన్న యొక్క యుదుటున మందుబయటికి దూకెను. తక్కినవారు మందులో మలమల మాడిపోయిరి. రామన్న తన తోడివారి మరణమునకు మహారోషావిష్టుఁడయ్యెను. శత్రువులపై కుఱికి వీరవిహారముచేసెను. ఏఁబదిమంది మొగలాయి సైనికులు అతనిపైఁబడి తుపాకులు కాల్చిరి. శరీరమునుండి నెత్తురు వెల్లువయై పాఱుచుండగాఁ,

బ్రేగులు, కండలు జీరాడcగా, నతcడు బల్లెముతో వారినిc దతిమితతిమి కొట్టుచుc గ్రిందcబడెను. శత్రువులు రామన్న గొంతు కోసిరి. బూసీ పడవాల రామన్న మరణించెనని దండోరా వేయించెను.

## బేరి రామక్క

తట్టుకోటలో ఫ్రెంచివారు తమజండా యెత్తించిరి. పిదప పుట్టకోట వంతువచ్చెను. మొగలాయీలు, ఫ్రెంచివారు పుట్టకోటక్రింద మకాము వేసిరి. ఏcబదినాలుగు రేఖలాలుగా మోర్చాలెత్తించి, తుపాకులలో మందుగుండు దట్టించి, పెళపెళమని కాల్చిరి. ధాంధామ్మనుచు ఫిరంగిగుండ్లు కోటకుcదగులు చుండెను. ఒక్కొక్క గుండు దెబ్బకు బెత్తెడు చెక్కపడుచుండెనే కాని గండిపడలేదు. ఇది పనిగాదని కొందఱుదుములు దెప్పించి, కోటకొమ్మలకు విసరి, వానితోకలకు గట్టిన త్రాళ్ల వెంట గోడనెక్కుచుండిరి.

“యథారాజా, తథాప్రజా” అనినట్లు రంగారా వెంత ధీరుcడో యతని ప్రజలును నంతటివారే. పుట్టకోటలో బేరివాడ పెద్దది. పురుషులందఱును బెహారమునకుc బోయి యుండిరి. బేరి స్త్రీలలో మహాసాహసికురాలు రామక్కయనునామె. “అక్కా, ఓయక్కా యీ పరాసులు, సిద్దీలు మనరాయని వారి యింటికిc బెండ్లికి వచ్చిన చుట్టాలేగదా! వారికిc జుట్టాలైన మనకునుc జుట్టాలే. కడమ చుట్టములకు వారువిందు చేసిన, మనము వీరికి విందు చేసెదము,” అని యామె తన కులము వారినందఱిని పోరున కాయత్తలc జేసెను. “అక్కా, ఓయక్కా, వేడివేడినూనె యంటి, వేడివేడి నీళ్లుపోసి, పలుచని యంబలిపెట్టి, నంజుకొనుటకు మిరపగుండలువేసి, తలకు సన్నెకల్లు పొత్రాలునిచ్చి, పెద్దనిద్దుర పొండని పండుకొనుcడందమా?” అని వారెగసక్కెము లాడుచు, ఱాలు, రప్పలు నొడిలోcగట్టుకొనిరి; రోcకళ్లు తీసికొనిరి; వడిసెలలు పట్టుకొనిరి; వేడినూనె కుండలు, నీటికుండలు, నంబటి కుండలు మోసికొనిరిc; కోట యలంగము నెక్కిరి, చీరచెరcగులు నడుమునకు బిగించి, చీరలు వెనుకకు విఱిచి కచ్చకట్టి, కోటనెక్కుటకుc బ్రయత్నించు సైనికులపై వేడినూనె క్రుమ్మరించిరి; వేడినీరు చల్లిరి, వడిసెలతో ఱాలురువ్విరి; వీశగుండ్లతోను, బలముల గుండ్లతోను జావcగొట్టిరి; అంబటి బానలు దొర్లించిరి; కారపుకుండలు తలలపైc బగులనేసిరి; బండలు, గుండ్లు విసరిరి; దగ్గఱకు వచ్చిన సైనికులను రోcకళ్లతోc జావమోదిరి; రుబ్బు పొత్రములతోc దలలు పగులcగొట్టిరి. ఇట్లీపోరు మధ్యాహ్నము వఱకును జరిగెను.

బేరి యాఁడువారి ధాకకుఁ గొన్నివేలమంది మడిసిరి. రామక్క గుఱితప్పినవాఁ డొక్కఁడును లేఁడు. సిద్దీబిలాల్ ఖాన్, జంద్రాల్ మహమ్మద్ వంటి సేనాపతులు మరణించిరి. దీనితో పరాసులకు రోషము హెచ్చెను. ఫిరంగులు మఱియు వేగముగ గుండ్లు వర్షింపసాగెను. గోడ కొంచెముగ సందిచ్చెను. సిద్దీమక్కాల్ అను సేనాని సాహసించి కొన్నివేలమందితోఁ గోట లోపలకు లంఘించెను, తుపాకుల బారికి రామక్కయు, నామె దండును బ్రాణములువాసి వీరస్వర్గ మందిరి.

పరాసువారు బేరివా రుండు బకాల పేటను దోచుకొనిరి. బంగారు, వెండి, రత్నరాసులు, వెలలేని నగలు బూసీ డేరాకుఁ దరలించిరి. పిదప మన్నెగూడెము మాడ్చివేసిరి. బొందిలిగూడెము 'భగ్గంపాడు' చేసిరి. కాఁపు గూడెములోఁ గాఁపులు నాగేళ్లు, కాళ్లు, కఱ్ఱలు, గంద్రగొడ్డండ్లు, కొడవళ్లు, గునపములు, పాఱలు – వీనితోఁ బోరి, యొకరికి నలుగురు చొప్పున శత్రువులను హతమార్చి మడిసిరి.

## రంగారావు శౌర్యము

లోపలికోట బారి వచ్చెను. రంగారావు కోటలోని దొంగదారుల గుండా నాలుగు బురుజులకుఁ బోవును, శత్రువుల నెదుర్కొనుట కేర్పాట్లు చేయుచుండెను. బూసీ తన సైన్యమును నాలుగు భాగములుగఁ జేసి, యొక్కొక్క భాగము నొక్కొక్క ఫిరంగితో జతపఱచి, యొక్కొక్క బురుజు నెదుర్కొన నిర్ణయించెను. నాలుగు ఫిరంగులును నొక్కమాఱు గర్జించెను. నాలుగు గుండ్లు నొక్కమాఱుగా బురుజుల దాఁకగా, గోట గజగజలాడెను. దెబ్బకుఁ దులము చొప్పున పెళ్లలు రాలెనేగాని గోడలు పగుల లేదు. ఫిరంగిగుండ్లు గోడలో గ్రుచ్చుకొనుచుండెను.

సూర్యుఁడు పడమటకు వాలెను. ఫిరంగులకు విశ్రాంతి లేదు. కోటగోడలు బీటలు వాఱసాగెను. ముప్పు హెచ్చుచున్న కొలది వెలమవీరుల మగఁటిమియు హెచ్చుచుండెను. మూలబురుజు – బేతాళబురుజు – రాణువకు సేనాపతి ముత్యాల పాపయ్య. కోట గోడమీఁద నడుగిడ నుంకించిన ప్రతిసైనికుని నతఁడు తన చంద్రహాసముతో నఱకి తుత్తునియలు చేయుచుండెను. రంగారావు నాలుగు బురుజులలోను ఎక్కడ జూచినను దానే యగుచు శత్రువులను గాలిని నఱికిన ట్లూచ కోఁతగా నఱకెను. ముష్యార్ పనాల్ లగ్గబట్టి ముత్యాల పాపయ్యతోఁ గలియఁ బడెను. ఇద్దఱును మహాసేనానులే. 'అంతర్పల్టీ దొంతర్పల్టీలు' వేయుచు డేగలవలె నతని నితఁడును, నితని నతఁడును దాఁటి పోవుచు, ద్వంద్వయుద్ధ మొనర్చిరి.

ముష్యూర్ పనాల్ తనపేరు చెప్పి ముత్యాలపాపయ్యను పేగులు వెళ్లఁబొడిచెను. ఇంతలో రంగారావు చెంగున వచ్చి పనాల్‌ను ఢీకొనెను. అతనిని నాల్గయిదు చోట్ల నీటియతోఁ బొడిచి కందకమునఁ గూలనేసెను. లాల్‌ఖానును నఱకిత్రోసెను.

## అంతిపురము జోహారు

కాని, యతఁ డెంతసేపు చేయఁగల డీ యింద్రజాలము? మఱునాఁటి వఱకైనను గోటను గాపాడుట యసాధ్యమని నిశ్చయించి, బాహాటముగఁ బ్రచండముగ మోహరించి, ప్రాణములు వదల నిశ్చయించుకొనెను. వెనువెంటనే దన చేతి పట్టాకత్తి చెలికాని నరసారావను వీరునకిచ్చి యవరోధజనము బరిమార్పఁ బంచెను.

తన భర్త చేతి కత్తి పుచ్చుకొని వచ్చుచున్న నరసరావు నల్లంత దూరముననే చూచి, మల్లమ్మ సర్వము గ్రహించెను. సంతోషముగఁ బ్రాణము విడుచుటకు సిద్ధముగానున్నను, దన యేకైకపుత్రుఁడు ఐదేండ్ల పసికూన వేంకట రంగారావు మాత్ర మానాఁడు ఘోరముగ మడియకుండుటకును, దనవంశాంకుర మెచ్చటనైన వర్ధిల్లుటకును, ఆమె యొక యుపాయమొనర్చెను. ముసలిదాది వేంకటలక్ష్మిని బిలిచి, తన పుత్రుని గడసారి మోము పుణికి, ముద్దుపెట్టుకొని, కడుపార పాలిచ్చి, యతని నామె కప్పగించి, “అమ్మా, బొబ్బిలి రావువారి వంశము నిలుఁపు భారము నీది. నా యీ ముద్దు పట్టి నెట్లయినను శత్రువుల కనుమఱపి దాటించి, సామర్లకోటలో నున్న మా చెలియలి యొద్దఁ జేర్పుము. నాకుఁ బుత్రభిక్ష పెట్టుము,” అని ప్రార్థించెను.

వేంకటలక్ష్మి తాను మాఱు వేషము దాల్చి, యతనికిఁ గూడ మాఱువేషము వెసి తన వెంట బిలిచికొని వెడలిపోయెను.

ఇంతలో చెలికాని నరసారా వచ్చుటికి వచ్చెను. అతని చేతి చంద్రహాసము మిఱుమిట్లు గొలుపుచుండెను. మల్లమ్మ యా కత్తిని పుచ్చుకొని, యొక్కసారి విజయరామరాజు డేరా వైపు దృష్టి సారించి, “ఓ విజయరామరాజా! మమ్ములను జంపుట కెన్నాళ్లుగ నీ వాలోచించితివో! కొండలుఁబడ్డ కొన్నాళ్లకైనను కోనలు పడకమానవు. పాపారాయఁడు త్వరలో వచ్చును. నీవు సంతోషమునఁ బట్టెమంచము పరుపు మీఁదఁ బవ్వళించి యుండఁగా నొక్క పోటు పొడుచును. పుట్టెఁడు నల్లపూసలు, పుట్టెఁడు గాజులును ఒక్కరేవులోనే నీ భార్యలు తెంచు యోగమున్నది!” అని శపించుచు ఠొమ్మునఁ బొడుచుకొని ప్రాణము వదలెను. తమరాణి యిట్లగుట జూచి తక్కిన

వెలమవనితలును తమ యసువుల నా కటారి కెరవేసిరి. ఏఁబదిమంది పెండ్లి కూఁతులు పసుపుఁ బుట్టములతోనే మరణించిరి. దామర ధర్మారావు భార్య రమణమ్మ గర్భిణి. ఆమెను జంపుట కతనికిఁ జేతు లాడలేదు. కత్తి ఖంగున క్రిందబడెను. మానవతియగు రమణమ్మ యిది చూచి, నరసరాయని హృదయదౌర్బల్యము దెలిపి, యతనిని గర్తవ్యనిష్ఠుఁడు గమ్మని యుద్బోధించెను. అయినను నరసారావు చేతులాడలేదు. తుదకు రమణమ్మయే యా గత్తిని బట్టి పొడుచుకొని మరణించెను. తక్కినవా రగ్నికుండమున నాత్మ సమర్పణము గావించిరి. ఈ కృత్యమున కందఱు నద్భుతపడిరి.

"దేవ తిర్యఙ్మనుష్యులం దీ విధంబు
పెంపు గన లే దటంచు నిలింపు లెల్ల
వెలమ వెలఁదుక సాహస విక్రమములు
భళి భళీ యని పొగడి రభ్రములనుండి." – రంగరాయ చరిత్ర

వేంకటలక్ష్మి రాజకుమారు నెత్తికొని కోటవెలువడి, పరాసు వారి దండులో బిచ్చమెత్తికొను చున్నట్లభినయించుచుఁ, బహరావారిని దప్పించుకొనుచుఁ బోవుచుండెను. ఇది తన డేరా ముందు కొలువు దీర్చిన విజయరామరాజు కంటఁబడెను. అతఁడు బాలుని రూపరేఖలు చూచి, యేదియో మోసము జరుగనున్న దని తలఁచి "యా బిచ్చగత్తెను పోనివ్వకుఁ"డని సేవకుల కానతిచ్చెను. వారు ఆమె నడ్డగించి, బూసీ యొద్దకుఁ దోడ్కొని పోయిరి. బూసీ, "అమ్మా నీవెవరు? ఈ బాలుఁడెవరు?" అని యామెను ప్రశ్నించెను.

"అయ్యా, నేను బొబ్బిలి రంగారాయనింగారి జనానా దాసీజనములో తలదాసిని, ఈ పసికూన వేంకటరంగారావు, మా యేలినవారి కుమారుఁడు. బొబ్బిలిరాణివాస మంతయు జోహారు చేసినది. రాణిమల్లమ్మ యీ ముద్దుపట్టిని శత్రువుల చేతఁ బడనీక సామర్లకోటలోఁ జెల్లెలి యిల్లు చేర్చుమని నా కప్పగించినది. నా బొందెలోఁ ప్రాణముండఁగా నీ బాలున కపాయము దేను. అటుపైని దేవరచిత్తము," అని వేంకటలక్ష్మి యనెను.

"శత్రుశేషమును, ఋణశేషము నుండరాదు" అను నీతిశాస్త్రోక్తి ననుసరించి విజయరామరాజు, ఆ బాలుని జంపివేయ నాలోచన చెప్పెను. కాని బూసీ చిదిమినఁ బాల్గారు చెక్కుల యా పసిపాపను జూచియు, బొబ్బిలి వీరరమణుల మరణము

వినియుఁ గరుణించి, యతనిని, వేంకటలక్ష్మిని సైనికుల దోడిచ్చి సామర్లకోటకుఁ బుత్తెంచెను.

## రంగారావు వీరశయనము

ఫిరంగులు మ్రోఁగుచునే యుండెను. సాయంకాలమగు చుండెను. శత్రుసైనికులు లగ్గల కెగఁ బ్రాకుచునే యుండిరి. బురుజులమీఁది కెక్కుటకుఁ బ్రయత్నించుచున్న వారినిఁ ద్రోసి వేయుటకు ముందున కుఱుకుచున్న వెలమవీరులు మఱుఁగేమియు లేక గోడలమీఁద స్పష్టముగాఁ గాన్పించుచుండుట చేత, శత్రువుల తుపాకుల బారిబడి కూలిపోవుచుండిరి. క్రమముగఁ గోటలోని వీరులసంఖ్య తగ్గుచుండెను. ఎట్టకేలకు శత్రువుల దళవాయి యొకఁడు బురుజుమీఁది కెక్కి నిలువఁగలిగెను. అతని వెంబడిని మఱికొందఱు, వారినంటి వేఱొకకొందఱును బురుజుమీఁదికిఁ ద్రోసికొని వచ్చిరి. వారి నాఁకట్టుటకు రంగారావు శరవేగమున నట కుఱికెను. ఇంతలో నవరోధజనము జోహారైన వర్తమాన మతనికిఁ జేరెను.

రంగారావు మనసు కుదుటఁ బడెను. "ఇక మానహాని భయము లేదు! విచ్చలవిడిగా వీరవిహారముచేసి వీరశయన మందవచ్చును," అని యతఁడు తలఁచుచున్నంతలో, వెలమవీరులందఱును నతనిచుట్టును జేరిరి. అంతట నతఁడు, "తమ్ముఁడా, వెంగళరాయా, బావా ధర్మారాయా, నేస్తుఁడా వెంకన్నా, మన వీరావేశమునకు సమయము వచ్చినది. నేటితో మనకు నీకోటకును ఋణము దీరినది. గుండెఱాయి చేసికొని ముందు కుఱుకుఁడు. వెనుకంజ వేయకుఁడు. బొబ్బిలిదెబ్బ బుస్సీ చూడఁగలఁడు. చేతి కఠారులకు సీతారాములే తోడు. లెండు!" అని వారిని వీడ్కొల్పి, జయజయ ధ్వనితో శత్రువులతోఁ దలపడెను.

మహావేశముతోఁ బఱతెంచుచున్న యీ వీరులఁగని బురుజుమీఁది పరాసుబలము బెదరి వెనుకంజ వేయసాగెను. రంగారావు ముందునడువ, బొబ్బిలి వీరులు శత్రువులను విచ్చలవిడిగా నఱకసాగిరి. రంగారావు సింగపుఁబిల్ల కొమ్ముటేనుఁగులను జిందవందర జేయునట్టు, పగతురను దునుమాడఁ దొడఁగెను. జెక్కుచెక్కుగ నఱకుచు; నల్వురను, ముప్వురను నొక్కుమ్మడిగ నీటెతోఁ బొడచి నేలఁగూల్చుచు; నిట్లు రణరంగమంతటను దానైయై పోరుచుండెను. తక్కిన పోటరులును దక్షాధ్వర ధ్వంసమునాఁడు ప్రమథగణములవలె విజృంభించిరి. కాని, యెంత పోరిన

నేమి ప్రయోజనము? రంగారావు ప్రభృతులు పదులు; ఎదిరి సైనికులు వేనకువేలు, శస్త్రాఘాతములతో రంగారావు శరీరము నుండి రుధిరము స్రవింపసాగెను. కుడిభుజము తెగిపోయెను. ఎడమకాలు విఱిగెను. కొంతసేపటి కతఁడు సొమ్మసిలి క్రిందఁబడియును జముదాడి జళిపించుచు, దగ్గఱిలు వారిని హుంకరించి తఱుముచుఁ; గొంత దడవుపోరి, యనంతరము బలిమి దఱికి, మైసోలి, నేల కొరగెను.

రంగారాయఁడు మరణించెనని దండోరా వేసిరి. బూసీ. విజయరామరాజు, హైదరుజంగు మున్నుగాఁగల యరాతి ముఖ్యులాతని శవముచుట్టును జేరిరి. దానిని జూచి విజయరామరాజు, "బొబ్బిలి వారిని నమ్మరాదు. చచ్చెనని మనము దగ్గఱ కరిగితిమేని వారు దిగ్గునలేచి లడాయి చేయుదురు. ఈటెతోఁ గదలించిచూచి, యటుతర్వాతనే మరణించినట్లు నమ్ముఁడు," అని యనెను. అందఱును విజయరామరాజు మాటలకుఁ గటకటపడిరి. రంగారావు పరాక్రమముఁదలచి యాతని మరణమునకు బూసీ ప్రభృతులును జింతించిరి.

సూర్యుఁడస్తమించెను. చీకటులు క్రమ్మెను. కదనరంగము భయానకముగఁ గనుపట్టుచుండెను. అన్న మరణవార్తవిని వెంగళరావు మిగులశోకించుచు, "శత్రువుల లష్కరుపైఁబడి చీకాకు పఱచి పోరుటయే యుచితము. దుశ్శాసనుని భీముఁడు వధించి నట్టు తాంద్ర పాపయ విజయరామరాజును మడియించుటకుఁ గలఁడు. నేను మొదట హైదరు జంగును, దఱువాత బూసీనిఁ దునుమాడెదను," అని మిగిలిన పదుగురు సైనికులతో మహావేగమున, మెకములనడుము చించుకొనివచ్చు బెబ్బులివలె, సైనిక వ్యూహముల జీల్చుకొనుచు వచ్చెను. వెంగళరావు సహచరులు చాటు మాటున వేఁటకాండ్రు గుఱిచూచి మృగముల గూల్చునట్లు సైనికుల వేఁటాడ మొదలుపెట్టి, కుప్పికుప్లాం మున్నుగాఁగల పెక్కు పరాసు యోధులను జంపిరి.

వెంగళరావు హైదరుజంగును దాఁకెను. అంత వారిద్దఱును బులులుఁ గ్రోల్పులును, కరులుఁ గరులును పర్వతములు బర్వతములును దలపడినట్టు ఘోరముగఁ బోరిరి. ఉదయము నుండియు నరులఁ జెండాడుచున్న వెంగళరావు డస్సి తూలసాగెను. కాయమునందలి గాయముల నుండి రక్తము ధారలు ధారలుగా గురియఁగా నతఁడు బలముడిగి, ప్రాణావశిష్టుఁడై పడిపోయెను. మూర్ఛితుఁడైన యాతనిని బూసీ తన గుడారమునకుఁ గొంపోయెను. గుడారములో వెంగళరావు మూర్ఛదేరెను.

అంతటితోఁ బోరు ముగిసెను. ఎక్కడఁజూచినను పీనుఁగులు, చచ్చిపడిన గుఱ్ఱములు, విఱిగిపడిన యాయుధములు, కఱుఁడు గట్టిన నెత్తురు కాలువలు, ప్రోఁగుపడిన యాయుధములు, కఱుఁడు గట్టిన నెత్తురు కాలువలు, ప్రోఁగుపడిన కాలునేతులు, ప్రక్కలు, డొక్కలు మున్నగు వానితో నాహవరంగము భయంకరముగ నుండెను. బొబ్బిలి వారిలో వెంగళరావు, బూసీ రక్షించిన రంగారావు కుమారుఁడు వేంకట రంగారావును, దాది వేంకటలక్ష్మియును దప్ప నందఱును మడిసిరి. లూసీ సైన్యములో వేనకు వేలు సహతులైరి. 'ఇంతటి నష్టమునకుఁ గారణభూతుఁడు హైదరుజంగే'నని యతనిఁ జాలగ నిందించెను. "జగడమునకుఁ దొరకొనకున్న నింత విషాదగాథ జరిగియుండదు గదా?" యని యతఁడు మిగుల దుఃఖించెను. జీవశేషుఁడగు వెంగళరావు నెంతయేని యాదరముతోఁ జూడసాగెను.

వెంగళరావు మఱల బ్రతికినందులకు విజయరామరాజు చాల కినిసెను. "నీ హితులు, బంధువులు మరణింపఁగా నీవు మాత్ర మేల బ్రతికితివి?" అని యీసుతోఁ బ్రశ్నించెను. అంత వెంగళరావు నవ్వి.

"నీ విభవమెల్లఁ గనుఁగొన
జీవించినవార, మిట్టి చేష్టకు నీకుం
గావలయు పనులు దైవము
గావించును" అనియెను.

## విజయరామరాజు దుర్మరణము

రాజాము కోటలో నున్న పాపారాయనికి బొబ్బిలి ముట్టడి వార్త రెండురోజుల తర్వాతఁ దెలిసెను. అతఁడు తన బాల్యమిత్రుఁడు మదాల వెంకన్నను, తన దివాను మిరియాల సీతన్నను దోడ్కొని యొక్క పఱుగున బొబ్బిలి దారి పట్టెను.

బొబ్బిలి కోట కూలిన మూఁడవనాఁటి రాత్రి విజయరామరాజు కోటలోఁ బ్రవేశించెను. తరతరముల నుండియు నున్న పగ సాధించితి మను సంతోషముతోఁ దన గుడారమున నిద్రించుచుండెను. పాపారాయఁడు బొబ్బిలి చేరు వేళకర్ధరాత్రి యాయెను. కనుచూపు మేరలో నెచటఁ జూచినను డేరాలే కాని, సైనికుల యలికిడియే లేదు. విరోధులు నిశ్శేషముగ మడిసిరి గనుక రాణువ యంతయు హాయిగ నిద్రించుచుండెను. పాపారాయఁడు నిరాఘాటముగఁ గోట సమీపించెను. కోటగోడలలోఁ పెద్ద గండ్లు పడియుండుటయు, బురుజులు గూలిపోయి

యుండుటయు నతనికిఁ గానవచ్చెను. మనసు మసి చేసికొని యతఁడు కోటలో నడుగుపెట్టెను. కోటలో నలు ప్రక్కలకును బోయి, బీభత్సదృశ్యములఁ జూచుచు నగరు బ్రవేశించెను. మల్లమ్మదేవి దివాణము బావురు మనుచుండెను. తలుపులు తెఱచియుండెను. దీపము వెలిగించు దిక్కులేక దివాణము మృత్యుగహ్వరమువలె నగపడు చుండెను. మఱికొంత ముందుకేఁగఁగా, ముకుపుటములు పగులునట్టు దుర్గంధము గుప్పుమనెను. వీరవనితల నాహుతిగొన్న యగ్నిగుండ మింకను గుములు చుండెను. ఆ గ్రుడ్డి వెలుతురుతో నచ్చటి శవముల జూచి దుఃఖము పొంగిపొరల, నతఁడు గొల్లుమని యేడ్చెను. అతని సహచరులును గోడుగోడున నేడ్చిరి. శోకము క్రమముగ విజయరామరాజునెడ రోషముగఁ బరిణమించెను. అంతఁ గృతనిశ్చయులై వారు వెనుదిరిగిరి.

నగరు వెడలి వారు విజయరామ నృపతి గుడారము వైపు నడచిరి. గుడారము చెంత కరుగుట సులభముగాదు. కావలివారు విచ్చు గత్తులతో నప్రమత్తులై యుండిరి. పాపారాయఁడొకింప తడవు యోచించి యొక యుపాయము పన్నెను. వెంటనే ముగ్వురును తూర్పుసీమ రాజుల వేషము వేసికొనిరి. బొమ్మంచు దోవతులు కట్టిరి. మెడలో జందెము వేసికొనిరి; గోడు రుమాలు ధరించిరి. నిర్భయముగా గుడారము దెసకు నడచిరి. కావలి భటు లడ్డగించి "ఎవరు మీ"రని గద్దించి పలికిరి.

"అయ్యలారా, మేము విజయనగరమునుండి యానందరాజుగారు పంపిన జరూరు జాబులుగొని వచ్చినవారము. తూర్పు సీమరాజులము. కొలువుండుట కొఱకు విజయనగరమునకు వచ్చితిమి. అట విజయరామభూపతి లేనందున నానందరాజు మము బొబ్బిలికిఁ బుత్తెంచెను. వెంటనే వారిని దర్శింప వలెను," అని తాండ్ర పాపయ్య తెలిపెను.

"రాజుగారు నిద్రించుచున్నారు. మేల్కొనిన తర్వాత దర్శనము చేసికొనుఁడు," అని కావలివారనిరి.

పాపారాయఁడెంత బతిమాలినను కావలివారు వారిని వదలేదు. రాజుగారు మేల్కొనువఱకు డేరా వెలుపల పండుకొనుఁడనియుఁ, దర్వాత రాజు దర్శనము చేయవచ్చుననియు వారనిరి. అందులకు వెలమదొరలు వల్లెయని, డేరాకొకింత దూరమున నేలపైఁ బరుండిరి.

చంద్రుఁడస్తమించెను. చీకటిలోఁ బాపయ్యయు, నతని యనుచరులును దొర్లుచు గుడారముచేరి, దానిని తమ బాకులతోఁ జించుకొని లోపల ప్రవేశించి, యొకమూల నొదిగి యుండిరి. గుడారములోపల నిరువురు కావలివా రిటునటు పహరా తిరుగుచుండిరి. తన యలవాటుకొలఁది "చలో! చలో!" యని యఱచుచు వారిలో నొకఁడు వెలమవీరుల దిక్కుకు వచ్చుచుండెను. పాపారాయఁడు మదాల వెంకన్న చెవిలో "ఇతఁడు నీ వంతు, మిత్రుఁడా!" యని గుసగుసలాడెను. మదాల వెంకన్న మొలనున్న బాకు వెంటనే పైకిఁదీసి, చెంగున నా పహరావానిపై దూకి గొంతునఁ బొడిచెను. పహరా జవాను గిరగిరఁదిరిగి భూమిపైఁ బడెను. ముగ్గురును ముందుకు నడచి మంచముపయి నిద్రించుచున్న విజయరామ భూపతి కల్లంత దూరముచేరిరి. అక్కడ రాజుగారి సేవకుఁడు, చల్లా రాముఁడు మంచమున కిటునటు దిరుగుచుండెను. "వీఁడు నీ వంతు, రాజు నా వంతు," అని పాపయ్య మిరియాల సీతన్న చెవిలోననెను. సీతన్న యొక్క యుదుటున వెనుక పాటుగ నతనిపైఁబడి, తన పచ్చులబాకుతోఁ బొడిచి చంపెను.

పిదప, తాండ్ర పాపయ్య "పులి! బెబ్బులి!" యని పెద్దపెట్టున బొబ్బలిడుచు, విసరుగ నుఱికి, రాజురొమ్ముపైఁ గూర్చుండి, యతని నొక్క చఱపు చఱచెను. విజయరామరాజదరిపడి "చల్లా రాముఁడా! చల్లా రాముఁడా! ఈటెయెక్కడరా? కత్తియేదిరా?" అని కేకలు వేయుచు దిగ్గున లేవఁబోయెను. "రాజా! ఈటె యెందులకు? కత్తియెందులకు? పక్కలో బల్లెమై నేనే యున్నానుగదా!" అని పాపయ్య జవాబు చెప్పెను. రామరాజు వెంటనే కనులు దెఱచి "ఏమిది? తాండ్ర పాపారాయఁడా?" అని బిట్టుగ నార్చెను.

"ఔను. రాజా, నేనే. బొబ్బిలికోటను పట్టుకొందు నని ప్రతిన పట్టితివే? ఎవ్వరిపంతము నెగ్గెనోయీ? బెబ్బులుల గుహ సుమా యీ బొబ్బిలి కిల్లా! దిగులు తీఱి యెంతహాయిగా నిద్రించితివి? ఈ కోటలోనికి వచ్చినవాఁడు వెలుపలికిఁ బోఁజాలఁడని తెలియకపోతివే?" అని పాపా రావనుచు, బాకుతీసి రాజు ఱొమ్మునఁ బొడిచెను. రాజు పాపారాయనితోఁ గలియఁబడెను. ఇద్దరును బెనఁగుచు మంచమునుండి క్రిందికి దొర్లిరి. పాపారాయఁడు బొడుచుచునే యుండెను. రాజు కొంతసేపటికి బాపారాయని వెనుకకు నెట్టివేసి, లేచి నిలువఁ గలిగెను. కాని, యతఁడు నిరాయుధుఁడు. బాకుపోటు గాయములనుండి నెత్తురు గాఱఁగా నతఁడు నీరసింపఁ

దొడఁగెను. అయినను రాజు పాపారాయని తలపట్టుకొని వంచెను. అపుడు పాపయ రాజు కడుపు చీల్చి చంపెను. రాజు నేల కొరఁగెను.

తమ వైరి చచ్చెనని సంభ్రమించుచున్న పాపారాయని, నతని సహచరులను విజయరామవిభుని భటులు కత్తులతోఁ జిదిమివేసిరి.

రంగారావు పగ, మల్లమ్మశాపము, విజయరాముని పేరాస, పాపారాయని పౌరుషము నింతటితోఁ దీఱెను. సాహసమునకు జరమసీమ యనఁదగిన బొబ్బిలి యుద్ధము సంభవమా యని యనుమానింపవలదు!

లక్షదళ మీఁద నాల్గువేల్దళముతోడ
కయ్యమున కెక్కుట సమాన కక్ష యనుచు
నివ్వెర పడంగ వలవదు, నవ్వుగాదు,
దీప మింతైన గొలుపదే తిమిర హృతికి? – రంగరాయ చరిత్ర

# 4. కట్టబొమ్మ సోదరులు

"ఏరు తెలుంగునాడు వెలయించిరొ, యెవ్వరు దాని యెల్లలన్
దూరముగా సుదూరముగఁ దోడ్కొనిపోయిరొ, యెవ్వ రందు క
వ్వారిగఁ బోర నిల్వఁబడి ప్రాణము, రక్తము ధారపోసిరో
వారి పదాలముందు తలవాలిచి పోదము ముందుముందుకున్."

– శ్రీ వేలూరి శివరామ శాస్త్రి

"ఇదిగో! వింటివా నీ వొనర్చిన నేరములు? కుంఫిణీవారి యేలుబడిని ఒప్పుకొనకపోవుట మొదటి నేరము. కప్పముకట్టక కాలహరణ మొనర్చుట రెండవ నేరము. కలెక్టర్ లూషింగ్టన్ ఎన్నిమార్లు తాఖీదు పంపినను ముఖము తప్పించుకొని తిరుగుచు నతని దర్బారుకు హాజరు కాకపోవుట మూఁడవ నేరము. కుంఫిణీవారిపైఁ దిరుగుఁబాటు చేయుట నాల్గవది. కుంఫిణీసైనికులతోఁ బోరి కొందఱిని మడియించుట యైదవది. పలువురు పాళెగార్లను కుంఫిణీయేలుబడిపై రెచ్చగొట్టుట యాఱవది. కుంఫిణీవారి మిత్రులైన పాళెగార్లపై దండెత్తుట యేడవది..."

అని యిట్లొక యాంగ్లేయుడు పెక్కు నేరములను ఏకరువుపెట్టుచుండెను. వీరరసము, నాత్మవిశ్వాసమును పొంగిపొరలువాఱు మధురగంభీరముద్రతో నొక యువకుఁడు ఆ యాంగ్లేయుని యెదుట నిలచియుండెను. వెనుకకు విఱిచిన యతని చేతులకును, గాళ్లకును సంకెలలు బిగించియుండిరి. ఆ వీరునికిఁ గొంతదూరమున నొక చెట్టుకొమ్మకు ఉరిత్రాడు వ్రేలాడుచుండెను. ఇరువు రాంగ్లసైనికులు ఆ వీరుని వెనుక విచ్చుకత్తులతో, ఎక్కుపెట్టిన తుపాకులతో సిద్ధముగా నుండిరి. ఆ ప్రదేశము చుట్టును పెద్దపెద్ద పాగాలును, మోఁకాళ్ల వఱకును జీఱాడు విలువగల పట్టు అంగరఖాలును ధరించి, రాజలాంఛనములతో గంగిరెద్దులవలెఁ దలయూఁపుచుఁ గొందఱు వ్యక్తులు బారులుతీరి కూర్చుండి దొమ్మరియాటను జూచు కౌతుకముతో

నఱ్ఱులు సాఁచి చూచుచుండిరి. కనుచూపుమేరలో నెటు చూపువఱపినను పాడువడిన యిండ్లే! పీనుఁగుల ప్రోవులే!

ఆంగ్లేయుఁడు వల్లించిన నేరము లన్నియు నిజమైనవేయని నలువురు సాక్షులును వాఙ్మూలమిచ్చిరి.

నిగళబద్ధుఁడై నిలఁబడినయున్న యా వీరవరుఁ డిసుమంతయును చలింపలేదు. కొంతవడి నిశ్శబ్ద మలమికొనెను.

“నీ నేరములు రుజువైనవి. నీవు చెప్పికొను మాట యేదైన కలదా?” అని ఆంగ్లేయుఁడు గర్జించెను.

వీరవరుఁ డొక్క వెడనవ్వు నవ్వెను. కాలుసేతులకుఁ గట్టిన సంకెలలు గణగణలాడెను. వేడుక చూచుచున్న పెద్దపాగాల పెద్దమనుష్యుల గుండెలు దడదడ లాడెను.

“మీరు నుడివినవి, సాక్షులు పలికినవి చాలవఱకు నిజమైనవే. కాని వానిని నేను నేరములని భావింపను. నాకు ముందు పాంచాలన్ కుఱిచ్చిని పాలించినవా రెవ్వరును ఇతరుల యాధిపత్యమునకుఁ దలయొగ్గినవారు కారు; కప్పము చెల్లించినదియును లేదు. వారి యడుగుజాడలలో నడచు నేనును గప్పముకట్ట నిరాకరించుట యపరాధ మెట్లగును? మా యింటికి వచ్చు నతిథులకును, అభ్యాగతులకును స్వాగతము పలికి యుపచరించుట మా కులాచారముగాని ఇతరుల యునికికిఁ జని వారిని దర్శించుట మా యాచారము కాదు. కావున నేను కలెక్టర్ లూషింగ్టన్ దర్బారుకు వెళ్లకపోవుట నేరమగునా? పాంచాలన్ కుఱిచ్చి నా మాతృభూమి. దానిని పగవారినుండి రక్షించుకొనుట నా కర్తవ్యము. కుంఫిణీసైనికులు నా మాతృభూమిని ముట్టడించినప్పుడు వారి నెదిర్చిపోరాడుట తప్పిదమెట్లగును? వీనినన్నిటిని తప్పిదము లనుటయే తప్పిదము” అని యా వీరవరుఁడు నిర్భయుఁడై నుడివి యూరకొనెను.

వీరవరుని పలుకు లాంగ్లేయుని చెవులకు ములుకులవలెఁ దాఁకెను. కోపముతో నాతని ముఖము మఱింత జేగురించెను. ఆ వీరవరుఁడతనికి సాధారణ భారతీయుఁడుగాఁ గాక భారతదేశమున నాంగ్ల సామ్రాజ్య మూలబంధమునే మట్టివైచు

రాక్షసుఁడుగా దోఁచెను. న్యాయదేవత పేరుతో నతఁ డావీరునికి మరణదండన విధించెను

★ ★ ★

## పూర్వగాథ

ఈ భయంకరహత్య నేఁటికి రెండువందల నాల్గు సంవత్సరముల క్రిందట-1799 అక్టోబరు నెల 16న తేదీని జరిగినది. ఆ వీరవరుఁడు పాంచాలన్ కుఱిచ్చి తెనుఁగు పాళెగాఁడు కట్టబొమ్మ కఱుత్తయ్య నాయకుఁడు; దక్షిణాపథమునఁ దొట్టతొలుత నాంగ్లేయుల నెదిర్చిన తెనుఁగు పాలకుఁడు. అతనిని న్యాయదేవత పేరుతో నురితీయించిన వాఁడు ఆంగ్లసైనికాధికారి మేజర్ బానర్మాన్.

కట్టబొమ్మ యనునది వంశనామము. కట్టబొమ్మవారు తొలుత బళ్లారి మండలవాసులు. ఒకప్పు డచటఁ గఱవేర్పడఁగా నితరులతోఁబాటు వారు దక్షిణదేశమునకు వలస వచ్చిరఁట. వారిలో బాలరా జనునతఁడు తిరునెల్వేలి మండలమున శాలికుళమను గ్రామమున స్థిరనివాసము మేర్పఱచుకొనెను. బాలరాజు కుమారుఁడు బహుపరాక్రమశాలి; అప్పటి పాండ్యరాజగు జగవీరపాండ్యుని కొలువులోఁ జేరి, యతని మెప్పించి దళవాయి యాయెను. జగవీరపాండ్యునికి సంతానము లేక యుండెను. తన రాజ్యము నతఁడు తన దళవాయికే యప్పగించి మరణించెను. కఱవునకు భయపడి వలసవచ్చిన కట్టబొమ్మవా రీవిధముగ నొక రాజ్యమునకే యధిపతులైరి. క్రమముగ కట్టబొమ్మ యను మాట రాజపర్యాయముగ మాఱెను. ఈ వంశమువా రందఱును 'జగవీరపాండ్య కట్టబొమ్మనాయక' బిరుదమును ధరించుచువచ్చిరి.

మొదటి కట్టబొమ్మరాజు ఒకనాఁడు శాలికుళము గ్రామసమీపమున నున్న యొక యడవికి వేఁటాడఁబోయెను. వేఁటకుక్కలు వన్యమృగములను దఱుముచుండెను. అందొక కుందేలును కొన్ని కుక్కలు తఱుమసాగెను. ఆ కుందేలు ప్రాణభీతితోఁ బరుగిడుచుఁ బోయి పోయి యాయడవిలో నొక చోటఁ జేరఁగానే కుక్కల నెదిర్చి తఱిమికొట్టెనఁట. అది చూచిన రాజు మిగుల విస్మయమంది, గడ్డిపోచలనుగూడ గండుమగలుగా గండరించఁగల చేవయట నున్నదని కనుంగొని, యచట నొక కోట కట్టింప నిశ్చయించెను. అదియే పాంచాలన్ కుఱిచ్చి.

పాంచాలన్ కుఱిచ్చి యను పేరును గూర్చి పండితులు రెండువిధములుగాఁ జెప్పుచున్నారు. మొదటి కట్టబొమ్మరాజు తన పితామహుఁడగు పాంచాలుని పేర నీ కోట గట్టించెనని కొందఱనుచున్నారు. 'పాంచాల' యనఁగా నైదువృత్తులవారనియు, 'కుఱిచ్చి' యనఁగా గ్రామమనియు, నైదువృత్తులవారి యూరు గావున దీని కీపేరు వచ్చెననియు మఱికొందఱు తలఁచుచున్నారు. ఏది ఎట్లున్నను ఈ కోట చాల దృఢమైనది. దీనికి రెండు ప్రహరులుండెను. వెలుపలి ప్రహరి మట్టితోఁ గట్టఁబడినది. దాని చుట్టును కందకము లేదు. కందకమునకు మాఱుగా వెడల్పయిన ముళ్లకంపల కంచె యుండెను.

మధురనాయకరాజుల కాలమున నీ పాంచాలన్ కుఱిచ్చి యొక పాళెముగా మాఱెను. మధురనాయకులు తమ సువిశాలరాజ్యమును (నేఁటి మధుర, తిరుచిరాపల్లి, రామనాథపురము, తిరునెల్వేలి జిల్లాలు) డెబ్బదిరెండు పాళెములుగా విభజించి, వానినిఁ జెఱియొక పాలకుని యధీనము గావించిరి. ఈ పాలకుని పేరు పాళెగాఁడు. ప్రతిపాళెగానికి నొక కోట యుండును. అతఁడాకోట కాణాచిగా పరిసర గ్రామములను బాలించుచుండును. గ్రామములలోఁ బన్నులు వసూలుచేసి, పరిపాలన వ్యయముపోను శేషించినది నాయకరాజులకుఁ బంపవలెను. యుద్ధకాలమున నాయకులకు సహాయముగా సైన్యమును బంపవలెను. మధురనాయక రాజ్యము శక్తియుతముగ నున్నంతవఱకు నీపాళెగార్లు లొంగియుండిరి. అది హీనబలము కాఁగానే స్వతంత్రులై, పరస్పరము కలహించుచుఁ బాళెముల నాక్రమించుకొనుచుండిరి. ఇట్లు ప్రబలశత్రువులైన వారిలో పాంచాలన్ కుఱిచ్చి, ఎట్టియాపురము పాళెగార్లు ముఖ్యులు. ఎట్టియాపుర పాళెగార్లును తెలుఁగువారే.

ఈ పాంచాలన్ కుఱిచ్చి జగవీరపాండ్య కట్టబొమ్మ నాయకుల వంశమున నేఁటికి రెండువందల నాల్గేండ్ల నాఁడు ముగ్గురు వీరవరులుదయించిరి. వారిలో జ్యేష్ఠుఁడు కఱుత్తయ్య నాయకుఁడు; రెండవవాఁడు కుమారస్వామి; మూఁడవవాఁడు సుబ్బయ్య. కఱుత్తయ్య మేనిచాయ నలుపు. కావున నతనిఁ బ్రజలు కఱుత్తయ్య (నల్లయ్య) యనియు, కుమార స్వామిని – ఎఱ్ఱటివాఁడు గనుక – శివత్తయ్య (ఎఱ్ఱయ్య) యనియు, సుబ్బయ్య సరిగా మాటలాడఁ జాలనందున నతనిని మూఁగదొర యనియుఁ బిలుచుచుండిరి.

కఱుత్తయ్య నాయకుఁడు తన ముప్పదియవయేఁట రాజ్యమునకు వచ్చెను. అప్పుడు తమిళనాడంతయు ఆర్కాటు నవాబు వశమున నుండెను. పాళెగార్లందఱును

నవాబుకుఁ గప్పము చెల్లించవలసియుండెను. కాని, యొక్కరైనను కప్పమును సరిగాఁ జెల్లించుచుండలేదు. నవాబు పేరునకు మాత్రమే దక్షిణదేశపాలకుఁడుగా నుండెను. కాని పాళెగార్లందఱును స్వేచ్ఛగా వ్యవహరించుచుండిరి.

## కుంఫిణీ పరిపాలన

ఇట్లుండఁగా, మన దేశమున వ్యాపారసాపారములు కొనసాగించుకొనుట కనుమతి పొందిన కుంఫిణీ (ఈస్టిండియా కంపెనీ) వారియొద్ద ఆర్కాటునవాబు అప్పుచేసెను. దానిని దీర్చుటకై తిరునెల్వేలిమండలమును అతఁడు కుంఫిణీవారి కిచ్చివేసెను. కుంఫిణీవారా మండలమును సక్రమముగాఁ బరిపాలించుటకుఁ బూనుకొనిరి. కప్పము చెల్లింపవలెనని పాళెగార్లను నిక్కచ్చి చేయఁదొడఁగిరి. పాళెగార్లు సాగినంత కాలము మొగము తప్పించుకొని తిరుగుచుఁ గప్పము నెగవేయుటకు ఎత్తులు వేయుచుండిరి. కాని పాళెగార్ల నెట్లయినను లొంగఁదీయవలెనని జిల్లా కలెక్టర్లకు కుంఫిణీవారు కచ్చితమైన యుత్తరువులు చేసిరి.

తిరునెల్వేలి మండలమునకు జాక్సన్ అనునతఁడు క్రొత్తగా కలెక్టరుగా నియమింపబడెను. అతఁడు చతుర్విధోపాయనిపుణుఁడు. పాళెగార్లను మట్టుపెట్టనిదే యాంగ్ల సామ్రాజ్యము దక్షిణదేశమున వేరులుతన్నదని యతనికి బాగుగాఁ దెలియును. జాక్సన్ తిరునెల్వేలిమండలపు నానుపానులు తెలిసిన పిదప పాళెగార్లకు తాఖీదులు పంపఁ దొడఁగెను. కాని యొక పాళెగాఁడును దానికి తలయొగ్గలేదు, కలెక్టరు తాఖీదుకు సమాధానముగా నొక పాళెగాఁడు పదిసంచుల నిండుగ గులకఱాలు వేసి పంపెనఁట. వీరి కందఱకును మొనగాఁడు కట్టబ్రహ్మయ్య నాయకుఁడు.

ఇట్లు పాళెగార్ల యవిధేయత నానాఁటికి మితిమీఱుచుండెను. ఇట్లు దాదా పెనిమిదేండ్లు గడచినవి. ఇఁక నూరకున్నఁ బ్రయోజనము లేదని జాక్సన్ నిశ్చయించుకొనెను. మొదటఁ గొందఱనైనను లొంగఁదీసికొనుట కార్యమని భావించెను. పాళెగార్లలోఁ బరస్పరశత్రుత్వమున్న వైనము గ్రహించి దానితోఁ తన పని చక్కబెట్టుకొనఁ గడంగెను. ఎట్టియాపురపు పాళెగానికిని, పాంచాలన్ కుఱిచ్చి పాళెగానికిని రవరవ లుండుట తెలిసికొనెను. కట్టబ్రహ్మయ్యను అణఁచివేయుట కిదియే యదనని ఎట్టియాపురపు పాళెగాఁడును జాక్సన్‌తోఁ జేతులు కలిపెను.

క్రమముగ నొక్కరొక్కరుగా పాళెగాండ్రు లొంగిపోయిరి. ఒక్క కట్టబొమ్మ పాళెగాఁడు మాత్రమే లొంగలేదు. కలెక్టర్ జాక్సన్ కఱుత్తయ్య నాయకునికి గట్టిగా నొక కమ్మ వ్రాసెను. కడచిన యాఱుసంవత్సరముల కప్పము ఆఱు వేలరూపాయలు వెంటనే చెల్లింపవలెననియు, కుంఫిణీ యధికారమునకు లోఁబడినందుకు చిహ్నముగా నామమాత్రపుఁ గప్పము చెల్లించినను చాలుననియు నా కమ్మలో నతఁడు తెలిపెను. కాని కఱుత్తయ్య యీ నయగారపు మాటలకు లొంగువాఁడా? అన్యులకుఁ దలయొగ్గుటకన్న మడియుటయే మేలని యెంచువాఁ డతఁడు. "నలుబదియేడు తరములుగా మావంశమువా రెవరికినిఁ గప్పము కట్టి యెఱుఁగరు. దేశద్రిమ్మరులుగా వచ్చి వ్యాపారముతోఁ గడుపుకొనుచున్న యాంగ్లేయులకా మేము లొంగుట? అది యేనాఁడును సంభవము గాదు" అని యతఁడు సమాధానము పంపెను.

ఇఁక మిన్నకుండుట తగదని జాక్సన్ నిశ్చయించుకొనెను. వారములోపుగాఁ దన యెదుట హాజరు కావలెనని కఱుత్తయ్య నాయకునికి వర్తమానమంపెను. కలెక్టరు ముదల వినుట వీరపాండ్యున కిష్టము లేదు. కాని, ఇరుగు పొరుగుపాళెగార్లందఱును ఆంగ్లేయులకు గులాములైనందున ఒక్కమాఱు కలెక్టరును చూచినచో నతని కోపమును గొంత చల్లార్పవచ్చునని తలఁచి యాతని భేటికి ఇయ్యకొనెను. "ఒంటరిగా వెళ్లినఁ గీడువాటిల్లవచ్చు" నని మూఁగదొర సైఁగచేసెను. కాని స్వభుజబలముపై విశ్వాసమున్న జగవీరపాండ్యునికి మూఁగదొర మాటలు చెవికెక్కలేదు. అయినను అతని నిర్బంధముపై నమ్మినబంట్లతోఁ, దమ్ములు వెంటరాఁగా నతఁడు కలెక్టరును చూడఁబోయెను.

కఱుత్తయ్యను ముప్పుతిప్పలు పెట్టి యెట్లయినను గయ్యమున కీడ్వఁదలంచిన జాక్సన్ అతఁడు తిరునెల్వేలికి చేరనుండఁగా కుత్తాళమునకు బయలుదేఱెను. కఱుత్తయ్య తిరునెల్వేలిలోఁ గలెక్టరు లేఁడనియు, కుత్తాళమునకు బయలుదేఱెననియుఁ దెలిసి యచటికి బయలువెడలెను. కాని యచటకుఁ జేరినపిదపఁ గలెక్టరు శివగిరికి వెళ్లెనని వార్త తెలిసెను. ఇట్లు జాక్సన్ వీరపాండ్యునికి సులభముగ దర్శనమివ్వక ఊరూరుఁద్రిప్పుచుఁ దుదకు రామనాథపురమున దర్శనమిచ్చెను.

రామనాథపుర పాలకుఁడగు సేతుపతి నగరులోని రామలింగవిలాస మను మేడలో నిరువురకు సమావేశ మేర్పాటు చేయఁబడెను. ఎటులుండి యెటువచ్చునో యని వీరపాండ్యుఁడు తన సైనికులను ప్రచ్ఛన్నముగ నామేడచుట్టును కావలి యుంచెను. తన తమ్ములతోఁగూడి జాక్సనును జూడ మేడయెక్కఁబోయెను. కాని

యింతలో జాక్సన్ 'ఒంటరిగా వచ్చిననే కాని చూడను' అని సేవకునితో వీరపాండ్యునికిఁ దెలియఁజేసెను. ఈ వార్త విని యాతని సహచరులు భయభ్రాంతులైరి. అయినను వీరపాండ్యుఁడు వారిని సమాధానపఱచి తానొక్కఁడే మేడమీఁదికి వెళ్లెను. ఇరువురికి సంభాషణ ప్రారంభమాయెను. ప్రాఁతపత్రముల పరిశీలన జరిగెను. "కుంఫిణీవారమైన మేము ఆర్కాటు నవాబున కిచ్చిన ఋణమునకు ఈ మండలమును చెల్లుగట్టుకొంటిమి. దీనిని పాలించు నధికారము మాది. కనుక తడవుసేయక కప్పము చెల్లించి తీరవలెను" అని జాక్సన్ కఱకుగా ననెను. "పన్ను, కప్పము చెల్లించు నాచారము మావంశముననే లేదు. ఇతరుల కణఁగిమణఁగి యుండుట మా రాజఱికమునకు తగనిది. కనుక పన్ను చెల్లింప వీలులేదు" అని వీరపాండ్యుఁడు నిర్భయముగా సమాధానమిచ్చెను. "అయినచో మిమ్ములను ఇచ్చటనే ఖైదుచేసితిని. ఇక్కడనుండి కదలుటకు వీలులేదు. ఇది కుంఫిణీవారి యాజ్ఞ" అని జాక్సన్ గద్దించి పలికెను. "ఒక పాళెపు టధిపుఁడు పరదేసికి బందీయా? ఇదిగో నేను వెళ్లుచున్నాను" అని వీరపాండ్యుఁడు గంభీరముగా బలుకుచు మేడమెట్లు దిగఁజొచ్చెను.

జాక్సన్ ఇది యంతయు నాలోచించి మొట్టమొదటనే మేడలోఁ గొందఱు సైనికులను సిద్ధముగా నుంచి యుండెను. ఈ కుట్ర మేరకు వారు క్షణములో వీరపాండ్యునిపైఁ బడి యాతనిని బంధింప నుంకించిరి. కత్తిపోరులోఁ గాకలుదేఱిన కఱుత్తయ్యనా వారు పట్టుకొనుట? వీరపాండ్య కఱుత్తయ్య కత్తిదూసి యిరువురి నచటనే తుండెములు గావించెను. అది చూచి తక్కిన సైనికులు కాలికి బుద్ధి చెప్పిరి. క్లార్కు అను అడ్జుటెంట్ ఉద్యోగి కఱుత్తయ్యను ఆపుటకుఁ బ్రయత్నించెను. కాని కఱుత్తయ్య క్లార్కునుగూడ తన కత్తి కెరచేసెను. క్లార్కు మరణించుటతోడనే యతని సైనికులు తుపాకులు ప్రేల్చఁదొడఁగిరి. పాళెగాని భటులు బెదరక వారి నెదిర్చిరి. ఈ దొమ్మిపోరులో ఇరుపక్షముల వారును పలువురు మరణించిరి. ఈ పోరాటమున మూఁగదొర ధైర్యసాహసములు వర్ణనాతీతములు. పాళెగాని భటులు కొందఱు మాత్రమే ఖైదీలుగాఁ జిక్కిరి. కఱుత్తయ్య క్షతనిహతులైన తన భటులను మోయించుకొనుచుఁ గలెక్టరు కట్టెదుటనే తప్పించుకొని పాంచాలన్ కుఱిచ్చి కోట జేరెను.

## క్రొత్త కలెక్టరు

రామనాథపురమున నడచిన వృత్తాంతమంతయును జాక్సన్ కుంఫిణీవారి రెవిన్యూ బోర్డుకు సవిస్తరముగఁ దెలియఁజేసెను. వారావిషయమును విచారించుటకు

ముగ్గురు న్యాయమూర్తులను నియమించిరి. ఆ నాఁడు కుంఫిణీవారు మైసూరులో టిప్పుసుల్తానుతోఁ బోరాడుచుండిరి. అట్టి సమయముననే పాంచాలన్ కుఱిచ్చి నాయకునితోఁ బోరుకుఁ బూనుకొనుట యుచితము కాదని తలఁచిరి. ఈ తలంపు తెలిసికొన్న న్యాయమూర్తులు రామనాథపురమున జరిగిన యల్లరికి కారణము కలెక్టర్ జాక్సనే యునియు, జాక్సన్ కొంత రాజనీతిచతురతతో వ్యవహరించియుండిన ఫలముండెననియు, అడ్జుటెంట్ క్లార్క్ హత్యవిషయమునను కఱుత్తయ్యకు శిక్ష విధింప నవసరము లేదనియు తీర్పు చెప్పిరి. కుంఫిణీవారు జాక్సనును కలెక్టరు పదవినుంచి తొలఁగించి స్టీఫెన్ రంబోల్డ్ లూషింగ్టన్ అనువానిని కలెక్టరుగా నియమించిరి.

క్రొత్త కలెక్టరు లూషింగ్టన్ పాంచాలన్ కుఱిచ్చి నాయకుని లోఁబఱచుకొనుటకు పెక్కువిధముల పూనుకొనెను. ఎన్నిమాఱులు వర్తమానము పంపినను నాయకుఁడు దర్శనమునకు రాలేదు. కుంఫిణీయధికారము నంగీకరించి కప్పముగట్టినచోఁ బ్రాఁతతప్పులన్నిటిని మన్నింతు ననియు బ్రకటించెను. కఱుత్తయ్యపేర నొక లేఖకూడ వ్రాసెను. దానిలో నెన్నియో ధర్మపన్నములు పేర్కొనెను. ఒక్కమాఱు వచ్చి చూచిన చాలు ననెను. కాని, కట్టబొమ్మ నాయకుఁడు “నేఁడు వత్తును, రేపు వత్తును. నేఁడు తిథి నక్షత్రములు ససిగా లేవు. నేఁడు త్యాజ్యము. రేపు దుర్ముహూర్తము” అని పెక్కుసాకులు చెప్పుచుఁ గాలయాపన చేయుచుండెను. ఇట్లొకవైపు కాలహరణము చేయుచు, కుంఫిణీపక్షమున నున్న పాళెగార్ల రాజ్యములలోఁ దన భటులఁ బంపి యల్లరులుకూడ రేపుచుండెను.

లూషింగ్టనుకు విసువు పుట్టెను. ఇఁక దండోపాయము దప్ప గత్యంతరము కనిపించలేదు. పాంచాలన్ కుఱిచ్చి పాళెగాని నణఁచుటకు సైన్యము పంపకతప్పదని యతఁడు కుంఫిణీ వారికి వ్రాసెను. అప్పటికి టిప్పుసుల్తాన్ మరణించుటచే మైసూరు యుద్ధము ముగిసెను. కనుక కుంఫిణీవారికి పాంచాలన్ కుఱిచ్చి వ్యవహారమును పూర్తిగాఁ బరిశీలించుట కవకాశము కలిగెను. కలెక్టరు లూషింగ్టన్ కోరిక మేరకు వారు మేజర్ బానర్మాన్ అను సేనానిని కొంతసైన్యముతోఁ దిరునెల్వేలి కంపిరి.

మేజర్ బానర్మాన్ సర్వాధికారములతో వచ్చుచున్నాఁడని తిరునెల్వేలిజిల్లాయం దంతటను 1799వ సంవత్సరము ఆగస్టు నెల 14న తేదీని చాటించిరి. పాంచాలన్ కుఱిచ్చి ముట్టడి కంతయు సిద్ధమయ్యెను. కాని కఱుత్తయ్యను గోటనుండి వెలువడునట్లు చేసినఁగాని తనకు విజయము చేకూరదని బానర్మాన్ భావించెను. ఇంతయే కాక

కఱుత్తయ్యనాయకుని భద్రముగా బందీగాc బట్టుకొని రమ్మని కుంఫిణీవారు ముదలయిడియుండిరి. కనుక ముట్టడికి ముందు సంధిసమాలోచనలు సాగించుట కను నెపముతోc గఱుత్తయ్యను బిలిపించి ఖైదుచేయవచ్చునని యతcడాలోచించి, "పాళెయంకోటకు వచ్చి తనతో సంభాషింపవలె" నని కఱుత్తయ్యయొద్ద కొక వార్తాహరునిc బంపెను.

కఱుత్తయ్య బానర్‌మాన్ కుతంత్రము గ్రహింపక పోలేదు. తానతనిc జూడబోయిన బందీయగుట తప్పదని తెలిసికొనెను. బానర్‌మాన్ సైన్యపు నానుపానులు తెలిసి కొనవచ్చు నను నూహతోc దన యాప్తునొకనిని పాళెయం కోటకుc బంపెను. కఱుత్తయ్యకు మాఱుగ మఱొకరు వచ్చుటc జూచి బానర్‌మాన్ మహోగ్రుc డయ్యెను. అతనితో నెట్టి సంభాషణమును జరుపకయే యతనిని ఖైదు చేయించెను.

ముట్టడి ఇcక తప్పదని బానర్‌మాన్ నిర్ణయించుకొనెను. సెప్టెంబరు 5వ తేదీన బానర్‌మాన్ సైన్యము పాంచాలన్ కుఱిచ్చికోట ముట్టడికి బయలుదేఱెను. బానర్‌మాన్ వెంట కేప్టెన్ ఓరిల్లి, బ్రూస్, లెఫ్టినెంట్ డెల్లాస్, కాలిన్స్, డగ్లస్ మున్నగువారు సహాయ సేనాపతులుగా వెళ్లిరి.

**కోటముట్టడి**

వీరపాండ్యుని గూఢచారులు బానర్‌మాన్ ఎత్తివచ్చు వార్తను తమ యేలికకుc దెలియc జేసిరి. "తెలతెలవాఱులోపల భటులందఱును గోటలో నాయత్తులు కావలెను" అని వీరపాండ్యుcడు చాటించెను. తెల్లవాఱు వేళకుc బాంచాలన్ కుఱిచ్చికోటను బానర్‌మాన్ పదాతిదళము, నాశ్వికదళము చుట్టివేసెను. యుద్ధ మిcక గడియలో నారంభమగు నననcగా బానర్‌మాన్ వీరపాండ్యుcడు వెంటనే తనను శరణాగతి వేcడవలె ననియు, అట్లు చేయకున్న కోటను నుగ్గునూచాడి యతనిని ఖైదుచేయక తప్పదనియు తుదిసందేశమంపెను. కాని వీరపాండ్యుcడు యుద్ధమునకుc దలపడియే యున్నాcడు గాన ఆ సందేశమును లక్ష్యము చేయలేదు. అప్పుడు బానర్‌మాన్ కోటపై దాడి కానతియిచ్చెను.

ఫిరంగులు కోటపై గుండ్లవర్షము కురిపింపసాగెను. లెఫ్టినెంట్ డెల్లాస్ కొంతబలముతో నుత్తరద్వారమును ముట్టడించెను. దక్షిణద్వారముపై లెఫ్టినెంట్ కాలిన్స్ దాడి జరిపెను. అగడ్త లేని కోట! ముళ్లకంచెల కోట! మీcదుమిక్కిలి మట్టికోట!

అతిసులభముగా వశమగునని బానర్‌మాన్ ఆశించెను. కాని యుద్ధము సాగుకొలఁది అతని యాశ యడుగంటఁజొచ్చెను. ఇంతలో దక్షిణద్వారమును దాఁకిన కాలిన్స్ కోటకు మొదటి బలియాయెను. దీనితో బానర్‌మాన్‌కు పాంచాలన్ కుఱిచ్చి వీరుల పరాక్రమము తెలియవచ్చెను. ఇనుమడించిన పట్టుదలతో ముట్టడి సాగించుటకు ఉత్తరువుచేసెను. కోటగోడలో నొకచోట క్రంతకూడ పడెను. కాని వీరపాండ్యుని గుండెలు తీసిన బంట్ల నెదిర్చి కోటలోఁ బ్రవేశించు సాహసము బానర్‌మాన్ సైనికులకు లేదయ్యెను. దాడిచేయు సైనికులు దాడిచేయుచుండఁగనే కట్టబొమ్మని సహాయమునకై యయిదు వేలమంది భటులు కోటలోఁ బ్రవేశించిరి. ఫిరంగిగుండ్ల దెబ్బకు పడుచున్న రంధ్రము లెప్పటికప్పుడు పూడ్చివేయుట క్షణములో జరుగుచుండెను. కాని యింతలో పాళెయం కోటనుండి యదనపు యూరోపియన్ సైన్యము వచ్చెను. పండ్రెండు బారుల ఫిరంగులును రెండు రప్పింపఁబడెను. అయినను మూఁడు నాలుగునాళ్ల వఱకు కోట చెక్కుచెదరలేదు. కోటలోని వీరపాండ్యుని భటులు ప్రదర్శించిన శౌర్యసాహసములు సాటిలేనివి. పలువురు ఆంగ్లసైనికాధికారులు మడిసిరి.

కాని, బానర్‌మాన్ క్రొత్త ఫిరంగుల ముందు తన కోట నిలువదని వీరపాండ్యుఁడు గ్రహించెను. కోటలో నుండి పోరాడి మడియుటకన్నను, తప్పించుకొని పాఱిపోయి కుంఫిణీవారిపై తమిళనాడులో పితూరీ రేపి ముప్పతిప్పలు పెట్టుట, తోడిపాళెగారుల స్వాతంత్ర్యమును రక్షించుట తన కర్తవ్యమని యతఁడు తలఁచెను. నిజమే. ఆ నాఁటి పోరు వీరపాండ్యునికి, బానర్‌మాన్‌కు వ్యక్తిగతముగా నేర్పడినది కాదు. కుంఫిణీవారికిని, కట్టబొమ్మ నాయకులకును మాత్రమే మొదలైనది కాదు. భారతదేశమును బరతంత్ర మొనర్ప సమకట్టిన యాంగ్లేయులకును, భారతప్రజల స్వాతంత్ర్యమును రక్షించుటకుఁ గంకణముకట్టుకొన్న దేశీయ రాజన్యులకును మొదలిడినది. కావుననే వీరపాండ్యుని యాలోచన యెంతయు సమంజసమైనదే.

ఈ యాలోచనతో వీరపాండ్యుఁడు తన తమ్ములతోడను, అంతరంగికులగు ననుచరులతోను పాంచాలన్ కుఱిచ్చికోట వీడి పాఱిపోయెను. ఇది జరిగినది రాత్రి.

తెల్లవాఱఁగనే కట్టబొమ్మనాయకుఁడు సపరివారముగ బలాయితుఁడాయె నన్నవార్త బానర్‌మాన్‌కు తెలిసెను. అతని కోపమునకు మేరయే లేదు. గతజలసేతుబంధన మెందులకని యాలోచించి వీరపాండ్యునిఁ బట్టుకొనుటకు కొన్ని

వందలమంది యాశ్వికులను, సైనికులను నలుదిక్కులకును బంపెను. అతఁడు పాఱిపోయిన దారిలో నున్న పాళెగార్లను హెచ్చరించెను. వీరపాండ్యుని పట్టియిచ్చిన వారికి బహుమతి యిత్తుననికూడ ప్రకటించెను.

బానర్‌మాన్ హెచ్చరికకుఁ దలయొగ్గిన పాళెగార్లలో మొదటివాఁడు ఎట్టియాపురము పాళెగాఁడు. ఇతనికిని, పాంచాలన్ కుఱిచ్చి పాళెగానికిని రవరవలుండుట మన మెఱిఁగినదే. తన ప్రాంతపగను దీర్చుకొనుట కతఁడు విదేశీయుఁడైన బానర్‌మాన్‌కుఁ దోడ్పడెను. ఎట్టియాపురపు భటులకు ఆ ప్రాంతపు దారులన్నియుఁ గొట్టినపిండి. కావున వారి యొత్తాసుతో కుంఫిణీవారికి వీరపాండ్యుని వెదకుటలోఁ గష్టము కలుగలేదు.

వీరపాండ్యుఁడు కోలార్పట్టి పాళెగాఁడయిన రాజగోపాల నాయకుని కోటలోఁ దలదాఁచుకొన్న ట్లాచూకీ తెలిసెను. చెన్నపురికిఁ బాఱిపోవఁ దలపెట్టిన వీరపాండ్యుఁడు కొంతతడవు కోలార్పట్టినాయకుని యింట విశ్రమించఁదలఁచెను. కాని పోరాటమే జీవనమైన యాతనికి విశ్రాంతి యేది? తన సాటి పాళెగాఁడు, సాటి కులమువాఁడు నగు ఎట్టియాపురము పాళెగాఁడు కుంఫిణీవారి బలముతోఁ దనను పట్టుకొన వచ్చుచున్నాఁడని విని యాతఁడు మహోగ్రుఁ డాయెను. ఎదిరిబలములు హెచ్చుగానున్నను నతఁడు పుయిలోడక ఎదుర్కొనెను. కాని ప్రయోజనము లేకపోయెను. ఆ శత్రువుల సంఖ్య యధికముగా నున్నందున నతని భటులు కకావికలై పాఱిరి. కాని వీరపాండ్యుఁడు గుఱ్ఱము నెక్కి తప్పించుకొని పాఱిపోయెను. అతని వెంట నతని సోదరులును శత్రువులకుఁ జిక్కక తప్పించుకొనిరి.

ఈ మాఱును వీరపాండ్యుఁడు చేఁజిక్కనందులకు బానర్‌మాన్ మిగుల వగచెను. అయినను అతనిని బట్టుకొనుటకు మిగులఁ దోడ్పడిన యెట్టియాపురము పాళెగానికి పెక్కు బహుమతుల లొసఁగి వీడ్కొల్పి, ఎదురుతిరిగిన పాళెగాండ్రను లొంగఁదీయుటకు పూనుకొనెను.

కోలార్పట్టినుండి యతఁడు సేనాసమేతుఁడై నాగలాపురము పాళెమునకుఁ దరలెను. నాగలాపురము పాళెగాఁడు అతనికి దాసోహమ్మనెను. ఆ పాళెగాని తమ్ముఁడు సుందరపాండ్యుని కుంఫిణీ యేలుబడి నెదిరించినాఁడను నేరముతో నురితీయించెను. ఇట్లే క్రమముగఁ బాళెగార్లందఱును కుంఫిణీకి 'జో హుకు' మ్మనిరి.

**మోసము! మోసము!**

కట్టబొమ్మ కఱుత్తయ్య తప్పిపోయెనేయని తెల్లవారందఱును మిగులఁ జింతించిరి. వాని నెట్లైనను పట్టి చెన్నపట్నమునకు బందీగాఁ బంపవలెనని రాత్రింబవలు బానర్‌మాన్ ఆలోచించుచుండెను. ఇంతలో నతని కొక శుభవార్త తెలిసెను. కఱుత్తయ్య పుదుక్కోట రాజ్యపుటడవులలో సపరివారముగా దాఁగియున్నాఁడనియు, సైన్యము కూర్చుకొని పాంచాలన్ కుఱిచ్చి కోటను మఱల నాక్రమించుకొనుటకు నుంకించుచున్నాఁ డనియుఁ జారులు తెలిపిరి. అతని యునికిఁ దెలిసి వర్తమానమంపునట్లు బానర్‌మాన్ పుదుక్కోటయధిపున కొక లేఖ వ్రాసెను. పుదుక్కోటరాజు విజయరఘునాథ తొండమాన్ కట్టబొమ్మని మిత్రుఁడే. కాని యతనినిఁ బట్టియిచ్చిన కుంఫిణీవారి యనుగ్రహము శాశ్వతముగాఁ దన కుండునని పుదుక్కోటరాజు ఎట్టియాపురపు పాళెగాని త్రోవ త్రొక్కెను.

కోలార్పట్టినుండి తప్పించుకొనివచ్చిన కఱుత్తయ్య తన యనుచరులతోఁగూడ రాత్రిళ్లు బయనించుచుఁ, బగటిపూఁటల నొకచో దాఁగికొనుచుఁ బుదుక్కోట రాజ్యమునకుఁ జెందిన తిరుక్కళంబూరు గ్రామమున విడిసియుండెను. అచ్చటి నుండి తిరుచిరాపల్లికిఁ బోవలెనని యతని యాలోచన. కాని పుదుక్కోటరాజు కుంఫిణీవారి కుట్రలోఁ జేరినాఁడనుట యతనికిఁ దెలియదు. తొండమాన్ తన భటులతో కఱుత్తయ్య యునికిఁ దెలిసికొని యొక యున్నతాధికారినిఁ బంపి కఱుత్తయ్యను తన రాజధాని కాహ్వానించెను. కఱుత్తయ్య పుదుక్కోట రాచనగరుకు వచ్చెను. తొండమానతనిని మిగుల సత్కరించి ప్రత్యేకముగ నొక విడిది యేర్పాటు చేసెను. పిదప, నతఁడు తన యొద్దనున్న సమాచారమును మేజర్ బానర్‌మాన్‌కు గుట్టుగాఁ దెలిపెను.

బానర్‌మాన్ అప్పుడు కయత్తాఱు అను గ్రామమున మకాములోనుండెను. అతని సంతోషమునకు పారమే లేదు. పెద్ద సైన్యమును పుదుక్కోటకుఁ దరలించెను. ఒకనాఁటి రాత్రి వీరపాండ్యుఁడు, నతని యనుచరులు హాయిగా నిద్రించుచుండఁగా నాంగ్లసైనికులకు లతని విడిది ముట్టడించి వారిని బందీలు చేసి కాలుసేతులకు బేడీలు వేసిరి. బానర్‌మాన్ పాంచాలన్ కుఱిచ్చికోటపై దండెత్తిన పిదప సరిగా నొక నెలకు కట్టబొమ్మనాయకుఁ డతనికిఁ బట్టుపడెను; మిత్రదోహముచే నాంగ్లేయుల చేఁజిక్కెను.

## బానర్‌మాన్ ప్రకటన

బానర్‌మాన్ మునుపు చాటించిన ప్రకారము కట్టబొమ్మనాయకుని బట్టియిచ్చినందులకు తొండమాన్ రాజుకు పెక్కుబహుమతులు లొసంగెను. కట్టబొమ్మనాయకునికి వెంటనే యురిశిక్ష విధించినచో దేశమున నలజడి యగునని జంకి, తనయొద్ద నున్న సైన్యమును పెక్కుదళములుగా విభజించి తమిళనాడు నలుమూలలకుఁ బంపి జాగరూకత వహించెను.

తర్వాత నతఁడు తాను మకాము చేసిన కయత్తాఱుకుఁ బాళెగార్లందఱను బిలిపించి యొక సభ నేర్పాటు చేసెను. ఆ సభలో నతఁడు కుంఫిణీవారి పక్షమున నిట్లు కట్టడి చేసెను :

"పాళెగార్లందఱును దమయొద్దనున్న యుద్ధసామగ్రిని కుంఫిణీవారి కప్పగింపవలెను. పాళెములలో నున్న కోటలను కూల్చివేసి నేలమట్టము చేయవలెను. పాళెముల యాస్తిపాస్తులు, పరిపాలన వ్యయము, సిబ్బంది, సైన్యము మొదలైనవానిని సవిస్తరముగ కుంఫిణీయధికారులకు వెన్వెంటనే యందఁజేయవలెను. ఇట్లు చేయనివారు మరణదండనకు గుఱియగుదురు."

వీరపాండ్యుఁడు బందీయయిన పిదప పాళెగార్లందఱ నడుము విఱిగినట్లాయెను. ఆంగ్లేయాధికారులను ఎదిరించి మాట్లాడువారే లేరన్న బానర్‌మాన్ 'సుగ్రీవాజ్ఞ'ను పాలింపనివా రుందురా? పాళెగార్లు దానిని అక్షరాలా పాటింపక గత్యంతరము లేకపోయెను.

## మరణదండన

అది 1799 అక్టోబరు నెల 16 తేదీ. నాఁడు మేజర్ బానర్‌మాన్ కట్టబొమ్మ కఱుత్తయ్యనాయకుని నురితీయుటకు విపులసన్నాహముల నొనర్చెను. అతని నేరముల విచారణకొరక ప్రత్యేకసభ జరుపఁబడెను. ఆ సభకు కుంఫిణీవారికి తాబేదార్లయిన పాళెగార్లందఱును ఆహూతులైరి. బానర్‌మాన్ తానే న్యాయాధిపతిగా వ్యవహరించెను. బానర్‌మాన్ దోషారోపణము చేయుటయు, కట్టబొమ్మనాయకుఁడు దానికి సమాధానము చెప్పుటయుఁ బాఠకులు తొట్టతొలి పుటలలోనే చదివియున్నారుగదా!

బానర్‌మాన్ విధించిన మరణదండనకు కట్టబొమ్మ నాయకుఁడు వికలత చెందలేదు. బానర్‌మాన్ భటు లొక చింతమ్రానుకు ఉరిత్రాడు వ్రేలాడఁగట్టిరి. విచారణ

జరిగిన స్థానమునుండి వధ్యస్థలివఱకును పాళెగార్లు బారులుతీరి నిలిచి యుండిరి. వీరపాండ్యుని తర్వాత ఎవరైన నాంగ్లేయాధికారము నెదిర్చిన, వారి గతియు నింతయే యని చెప్పుటకే పాళెగార్లచట నిలువఁబెట్టఁబడియుండిరి. వీరపాండ్యుఁడు వధ్యస్థలికి వెళ్లుచు ఎట్టియాపురము పాళెగానిని జూచి యొక్కమాఱు చిఱునవ్వు నవ్వెను. "నేను అమరవీరుఁడను కాఁబోవుచున్నాను. భారతదేశ వాసులందఱును నన్ను ప్రశంసింతురు. నీవు పేడివై విదేశీయుల కొత్తాసు చేసితివి. నీ బ్రతుకును ఒక బ్రతుకేనా?" అనినట్లుండెను ఆ చిఱునగవు. కట్టబొమ్మనాయకుఁడు వధ్యస్థలిఁ జేరి యటనున్న బల్ల నెక్కి నిలచెను. తలపై నురియుచ్చు వ్రేలాడుచుండెను. ఈ భయంకర దృశ్యమును చూచి యటనున్న ప్రజలందఱును గనులు మూసికొని హాహాకారము చేసిరి. పాళెగార్లు మాత్రము పెదవి గదపలేదు.

ఒక్కమాఱు కట్టబొమ్మని చూపులు ఎవరికోసమో వెదకెను. మఱి యెవరికోసమో కాదు, తన సోదరులు కుమారస్వామి, మూఁగదొరల కోసమే. పుదుక్కోటలో కట్టబొమ్మని, పరివారమును సైనికులు పట్టుకొన్న పిదప నతనిని సోదరులనుండి వేఱుచేసిరి. అతని సోదరులగు కుమారస్వామిని, మూఁగదొరను పాళెంకోటలో నిర్బంధమున నుంచిరి. తుదిగడియలలోఁ దన యనుజన్ములఁ జూడలేక పోయితినిగదా యని కఱుత్తయ్య యొకక్షణము చింతించెను. ఇంతలో మెడ కురియుచ్చు బిగియుచుండెను. తాను మరణించు చున్నందుల కాతఁ డావంతయును జింతింపలేదు. తన పూర్వుల దుర్గమును రక్షించుటలోఁ బ్రాణము వీడనైతినిగదా యనున దొక్కటియే యతని తుదిచింత. అతఁడు తుదిసారిగా "శత్రువుల యెదుట బందీగా నిలుచుటకుఁగాని, శత్రువులు చెప్పిన తీర్పు ప్రకారము చింతచెట్టునకు వ్రేలాడుచు కొట్టుకొని ప్రాణములు వదలుటకుఁగాని నేను చింతింపను. పాంచాలన్ కుఱిచ్చికోట నుండి వెలువడక కుంఫిణీసైన్యముతోఁ బోరాడుచు మడిసియుండిన వీరస్వర్గ మలంకరించి యుందును. అట్టి దశ పోనాడినందులకు చింతిల్లుచున్నాను" అనుచుఁ బ్రాణముల వీడెను.

విచారణ జరిగిన స్థానమునుండి వధ్యస్థలివఱకును కట్టబొమ్మ కఱుత్తయ్యా నడచిన తీరును మేజర్ బానర్మాన్ ఇట్లు వర్ణించెను. :

"విచారణసమయమున నొక్కసారికూడ అతఁడు విషణ్ణహృదయుఁడు కాలేదు. అంతసేపును నతఁడు నిర్వికారచిత్తముతోడనే యుండెను. ఆకులపా టెఱుఁగని

యతిధైర్యచిత్తముతో, దైన్యము తెలియని నిర్వికారభావముతో నతఁడురిశిక్షను స్వీకరించెను. అతఁ డహంకారము నావంతయును బోనాడలేదు. అతనిని పట్టుకొనుటలో మనకు మిక్కిలి తోడుపడిన యెట్టియాపురపు పాళెగానిని విచారణ సమయమున నతఁడు దఱచు వాడిచూపులతోఁ గనిగా చూచువాఁడు. శివగిరిపాళెగానినిగూడ నట్లే చూచువాఁడు. వధ్యస్థలమునకుఁ బోవునప్పుడుగూడ నతఁడు తాను పోవుదారి పొడుగున ఆ ప్రక్కను ఈ ప్రక్కను బారులుతీరి కూర్చుండి యున్న పాళెగాండ్రపై ననాదర వీక్షణములఁ బఱపుచు ఠీవిగా నడచిపోయినాఁడు. తన కురికంబముగ నుపయోగ పడనున్న చెట్టు మొదలు చేరినతోడనే యతఁడొకే వాక్యము పలికినాడు : "నా పూర్వుల కాఁపురపుఁగాణాచియగు పాంచాలన్ కుఱిచ్చి కోట పరిరక్షణముననే పంచత్వమందియుండినచో నింతకంటె బాగుండెడిది." ఈ మాటలు తప్ప అతఁడు మఱియేమియు ననలేదు."

కఱుత్తయ్య ప్రబలవిరోధియగు బానర్‌మాన్ వ్రాసిన మాట లివి. కఱుత్తయ్య యెంతటి వీరుఁడో యీవాక్యములే తార్కాణ.

కఱుత్తయ్యనాయకుని నురితీసినను బానర్‌మాన్ కసి తీరలేదు. పాంచాలన్ కుఱిచ్చి కోటను నేలమట్టము కావించి యాచోట గాడిదలతో దున్నించి యాముదాలు చల్లించెను. పాంచాలన్ కుఱిచ్చి పాళెమునకుఁ జేరిన నూఱు గ్రామములలో నెనుబది తనకు చేదోడుగానున్న యెట్టియాపురము పాళెగానికి బహూకరించెను. తిరుగుఁబాటులో కట్టబొమ్మనికిఁ దోడ్పడిన నాగలాపురము, కోలార్పట్టి, కుళత్తూరు, కాడల్గుడి, ఏళాయిరంపణ్ణై యను పాళెములను జప్తుచేసి కుంఫిణీపాలనలోఁ జేర్చెను. నలుబది రెండు కోటలను నేల మట్టము చేసెను. "పాళెగార్లు ఇఁక ఆయుధములను చేర్చుకొనరాదు. తయారుచేయరాదు. పాళెములలో నెవ రాయుధములు సిద్ధపఱచినను ఆ జవాబుదారీ పాళెగార్లదే. ఈ యుత్తరువు నతిక్రమించినవారు రాజద్రోహులుగా పరిగణింపఁబడుదురు; మరణదండనకుఁ బాత్రులగుదురు" అని ప్రతిపాళెమునందు ధర్మసత్రములలోను, చావడులయందును తామ్రశాసనములు వేయించెను.

కుంఫిణీవారి కిఁక ఎదురేదీ? తమిళనాడంతటను శాంతి నెలకొనెను. మేజర్ బానర్‌మాన్ పదవిని విరమించి ఇంగ్లాండుకుఁ బోయెను. అతని స్థానమున మేజర్ కాలిన్ మెకాలే యనునతఁడు సేనాని. తిరునెల్వేలి మండలమున కొద్దిసైన్యము మాత్రమే యుంచఁబడెను. ఈ సైన్యములో కొంత భాగము కయత్తారులోను, కొంత పాళెంకోటలోను ఉండెను.

బానర్‌మాన్ ఇంత చేసియును పాంచాలన్ కుతిచ్చి ప్రజల స్వాతంత్ర్యవాంఛను అరికట్టలేకపోయెను. ఆ అమరజ్వాల లోలోపల రగులుచునే యుండెను. ఏఁడాది దాఁటియు దాఁటకమునుపే మఱల నచ్చట నొక గొప్పకోట మొలచెను; పలువురు కుంఫిణీ యుద్యోగులను బలిగొని యెనిమిది నెలలపాటు ఆంగ్లేయులకుఁ బక్కలో బల్లెమై నిలచెను. ఈ యపూర్వకార్యము నెఱపినవాఁడు వీరపాండ్య కఱుత్తయ్య నాయకుని కడగొట్టు తమ్ముఁడు మూఁగదొర సుబ్బయ్యనాయకుఁడు.

సుబ్బయ్యనాయకుఁడు మూఁగవాఁడైనను మహాప్రజ్ఞావంతుఁడు. వంశ సహజమైన పరాక్రమమునుగూర్చి చెప్పనే పనిలేదు. అతఁడు మూర్తీభవించిన పరాక్రమము. వ్యూహరచనలోను నతఁడు నిపుణుఁడు. కనుసన్నలతోను, చేసన్నలతోను నతఁడు ఎంతటి గహనవిషయములైనను కదళీపాకముగాఁ దెలుపువాఁడు. ఇంగ్లీషువారనిన నతనికి అన్నకు కంటెను అసహ్యము మెండు. వారిని గడ్డిపోచకన్న నఱకొఱగాఁ జూచువాఁడు. గడ్డిపోచను ఎగురఁగొట్టునట్లు అలవోకగా ఆంగ్లేయులను తఱిమి వేయవచ్చునని చేసన్నలతో, నోటి యుఫ్ఫుఫ్ఫులతోఁ దెలియఁజేయువాఁడు. అతని జనావర్జనశక్తికూడ కొలఁదులులేనిది. అతని యాజ్ఞ ప్రజలకు సుగ్రీవాజ్ఞ. అతనికొఱ కెట్టి త్యాగమునకైనను వారు సిద్ధముగా నుండిరి.

అట్టి మూఁగదొరయు, అతని యన్న కుమారస్వామియు పాళెంకోట కారాగారమున బద్ధులై యుండుట ప్రజలకుఁ గటకటగా నుండెను. వారిని విడుదలచేయుటకుఁ బ్రయత్నములు సాగుచుండెను. కట్టబొమ్మనాయకుల యాప్తులు ఈ ప్రయత్నములకు నాయకత్వము వహించి యుండిరి. ప్రజలు ఒట్టగత్తం అను గ్రామమున రహస్యముగ నొక సభ జరిపిరి. పాళెంకోట కారాగారమును ముట్టడించి కట్టబొమ్మసోదరులను, వారి యనుచరులను విడుదల చేయుటకుఁ దీర్మానించిరి. వేగులవారివలన పాళెంకోట కారాగార సమాచారములు తెలిసికొనుటకును ఏర్పాట్లు జరిగెను.

అది 1801వ సంవత్సరము ఫిబ్రవరి నెల 2వ తేదీ. కొన్నివందలమంది మాఱువేషములతో పాళెంకోటఁ జేరిరి. కొందఱు గడ్డిమోఁపులు, మఱికొందరు కట్టెమోఁపులు నెత్తిపై నిడుకొని వీథులలోఁ దిరుగుచు బేరమాడునట్లు నటించుచుండిరి.

కొందఱు బాటసారులవలె సత్రములలోను, చావడులలోను విశ్రమించుచున్న ట్లభినయించుచుండిరి. వేఱొక కొందఱు బిచ్చగాళ్లవలెఁ దిరుగుచుండిరి. వీరందఱి యొద్దను ఆయుధములు గుప్తముగా నుండెను. రాత్రి జాము గడచెను. ఈ వేషధారు లందఱును అకస్మాత్తుగా కారాగారమును ముట్టడించి, కావలివారిని తమ కరవాలముల కెరచేయుచు ద్వారములు తెఱచిరి. మూఁగదొరను, అతని సహచరులను బేడీలు నఱికి విడిపించిరి.

ఆ రాత్రి పాళెంకోటలో నున్న యాంగ్లేయులందఱును మేజర్ మెకాలే యింట విందుగుడుచుచుండిరి. బందీలను విడిపించుకొనిన విప్లవకారులు కుంఫిణీ యధికారులపై దాడి చేయఁదలఁచిరా? లేదు, వారిని మట్టుపెట్టఁదలచినచో కష్టమేమియు నుండలేదు. వారికి ఒత్తాసుగా వచ్చు కుంఫిణీ సైన్యముకూడ రూపుమాసిపోయియుండెడిది. తర్వాత తిరుచిరాపల్లినుండి పెద్దసైన్యము వచ్చినను విప్లవకారులు ఓడించియుండువారే. కాని, వారట్లు చేయలేదు. ఆ కాఱు చీఁకటిలోఁ బాంచాలన్ కుఱిచ్చి వైపు నడిచిరి. పాళెంకోటకును, పాంచాలన్ కుఱిచ్చికిని దూరము ముప్పది మైళ్లు. తెల్లవాఱకముందే పాంచాలన్ కుఱిచ్చి చేరిరి.

## మాయకోట

కట్టబొమ్మసోదరులు చెఱసాలనుండి తప్పించుకొని పాంచాలన్ కుఱిచ్చి చేరిరను వార్త నీటిలో నూనెబొట్టువలె వ్యాపించెను. విదేశీయపాలనలోఁ గడగండ్లు పడుచున్న ప్రజలలో క్రొత్తయాశ చిగిర్చెను. తండోపతండములుగా వచ్చి, కట్టబొమ్మసోదరుల పక్షమునఁ జేరిరి. వేలకొలఁది సైనికులు చేరిరి. బానర్‌మాన్ ఆజ్ఞలకు అందకుండ దాఁచియుంచిన యాయుధములను అప్పగించిరి. పలువురు ధనసహాయము చేయుటకు వాగ్దానమిచ్చిరి. విప్లవకారులు రాత్రులయందు కుంఫిణీ సిపాయిదళములపైఁబడి వారి యాయుధములను దోచుకొనుచుండిరి. కుంఫిణీ పరిపాలనను ఎదుర్చుట, కుంఫిణీవా రాక్రమించిన పాళెములను మఱల స్వాధీనపరచుకొనుట తమ ప్రధానలక్ష్యములని విప్లవకారులు ప్రచారము చేయుచుండిరి. అన్ని హంగులును అమరినవి. కాని యాయుధసామగ్రిని భద్రపఱచుకొనుటకుఁగాని, రహస్య మంత్రాంగమునకుఁగాని తగిన దుర్గము లేకుండెను. ఈ లోపమును దీర్చుటకు అందఱును సన్నద్ధులైరి. కుంఫిణీవారిని గోడుగుడిపించిన పాంచాలన్ కుఱిచ్చిలోనే

క్రొత్తకోటను కట్టుట యుచితమని, అచటినుండియే కుంఫిణీవారితోఁ బోరాటము కొనసాగింపవలెనని నిశ్చయించిరి.

ప్రాణములనైన నర్పించు వీరభటులు, ప్రేమించు ప్రజలు నున్న నిఁక సాధ్యముకాని పనియేది? చెఱసాల నుండి తప్పించికొనివచ్చిన బందీలు కోటను కట్టువారు! కట్టునది లోఁగడ నొకకోట నేలమట్టము చేయఁబడిన చోట! అదియును కుంఫిణీ సేనానియావాసమునకు ముప్పది మైళ్లలో! ఎంతటి సాహసము! ఎంతటి పరాక్రమము!

కోటకట్టిన తీరును అపూర్వము! పగలును, రాత్రియును దాదాపు రెండువేలమంది నడుమువంచిరి. నల్లమన్నును తాటి తీయకల్లుతోఁ గలిపిన యడుసుతో కోట గోడలు లేచినవి. ఇట్లు వారము గడచెను. కోట పూర్తియయి కుంఫిణీవారి గుండె గుభేలుమన నిలచెను. ముందున్న కోటకన్న నీ క్రొత్తకోటయే బలమైనదని తర్వాత యుద్ధములో ఫిరంగిగుండ్ల దెబ్బలవలనఁ దెలిసెను.

కట్టబొమ్మసోదరులు చెఱసాలనుండి పరారీయగుట పాళెంకోటలోని కుంఫిణీయధికారులకు చీమ కుట్టినట్లుగనులేదు. బందీలు మఱల పట్టుబడకుందురా యని భావించి వారిని పట్టితెచ్చుటకు కొందఱు సైనికులను బంపిరి. మేజర్ మెకాలే కూడ కట్టబొమ్మసోదరుల విశిష్టతను గుర్తింపఁజాలక పోయెను. మూఁగదొర తెలివితేటలను గ్రహింపజాలక పోయెను. కట్టబొమ్మసోదరుల యెడ అక్కడి ప్రజలకుఁగల భక్తిగౌరవముల నరయఁజాలకపోయెను. అట్టితటి కట్టబొమ్మసోదరులను బట్టుకొనివచ్చుట సాధ్యమా? సైనికులు తెల్లమొగములతోఁ దిరిగివచ్చిరి.

సుబ్బయ్యనాయకునితోఁ దలపడుట యలవోక కాదని యప్పటికి మేజర్ మెకాలేకు తెలియవచ్చెను. ఉన్న తొమ్మిదివందలమంది సైనికులతోఁ బాంచాలన్ కుఱిచ్చి మీఁదకు నడచెను. మెకాలే సైన్యము ముప్పదిమైళ్లలో నున్న పాంచాలన్ కుఱిచ్చి చేరుటకు రెండురోజులు పట్టెను. ఇంత విలంబమునకుఁ గారణము లేకపోలేదు. కట్టబొమ్మ సోదరులయెడ భక్తిగల యాప్రాంత ప్రజలు మెకాలే సైన్యమును ముందుకు సాగనీక చిక్కులు పెట్టుచుండిరి. వారికిఁదోడుగ మూఁగదొరసైనికులుగూడ తఱచు వారిపైఁ బడి వేధించుచుండిరి. ఈ కారణముగా మెకాలే సైన్యము తాఁబేటినడకన ముందుకు సాగవలసివచ్చెను.

మెకాలే పాంచాలన్ కుఱిచ్చి చేరఁగానే యక్కడి దృశ్యమును జూచి నివ్వెఱపడెను. అంతయు మాయగా దోఁచెను. మొన్న మొన్నటివఱకు నామురూలబీడుగాఁ బడియున్న యాగ్రామమున సర్వసన్నద్ధమైన యొకకోట గాన వచ్చెను. "మేజర్ బానర్మాన్ నిరు డీకోటను తక్కిన కోటలనువలెనే నేలమట్టము గావించెఁగదా! ఇటీవలి వఱకును ఇట నెట్టి జనసంచారమును లేదే! ఏమి యీ ఇంద్రజాలము!" అని మెకాలే వెఱగుపడసాగెను.

కోటను గూల్చఁగల పెద్దఫిరంగులు మెకాలే వెంటగొనిరాలేదు. కోటగోడలు దూకి లోపలఁ బ్రవేశింతమన్న చీఁకటిపడినఁగాని యది యనువుపడదు. కోటలో నైదువేల మంది వివిధశస్త్రాస్త్రములతో సన్నద్ధులైయున్నారనియు, చీఁకటిపడఁగానే కుంఫిణీసైన్యముపైఁ బడ వేచియున్నారనియు వదంతులు వ్యాపించెను. దీనితో మూఁగదొర యుద్ధతంత్రచాతుర్యమును మెకాలే గుర్తించెను. కోటవెలుపలఁ దొమ్మిదివందలమంది సైనికులతో నున్న తాను కోటలో సురక్షితముగనున్న యయిదువేలమంది వీరులతోఁ దలపడుట యవివేకమని మెకాలే తలపోసి, పాళెంకోటకు వెనుదిరిగి వెళ్లుటయే తగవని నిశ్చయించెను.

ఆ నాఁడు మధ్యాహ్నము రెండుగంటలకు సరిగా మెకాలే సైన్యము పాళెంకోటకు వెనుదిరుగ మొదలిడెను. కుంఫిణీసైన్యము వెన్ను చూపుచున్న వార్త కోటలోని వారికిఁ జేరెను. వారి సమరోత్సాహము పొంగిపొఱలెను. ఒక్క సైనికుఁడును పాళెంకోట జేరకుండ మట్టుపెట్టవలెనను నిశ్చయముతో తఱిమితఱిమి కొట్టిరి. ప్రాణములు దక్కిన నిదియే పదివేలు అనుకొనుచు మెకాలే సైనికులు కాలికిబుద్ధి చెప్పిరి. మఱునాఁడు రాత్రి తొమ్మిదిగంటలకుఁ గాని వారు పాళెంకోటఁ జేరలేకపోయిరి. వారు తేఱుకొనుటకు మఱి పదునేడు దినములు పట్టెను.

## దేశభక్తుల విజృంభణ

మెకాలే బలములు వెనుకకుఁ దరలినంత మాత్రమున మూఁగదొరయు, నాతని యనుచరులును సంతోషపడలేదు. మఱల మెకాలే యెత్తిరాకమానఁడనియు, నంతలోపల కుంఫిణీయధికారముననున్న కోటలను పట్టుకొనుట మేలనియు కృతనిశ్చయులైరి.

ఈ నిశ్చలయముతో సుబ్బయ్యనాయకుఁడు పట్టఁదలచిన మొదటికోట తూత్తుకుడి. తూత్తుకుడిపై విప్లవకారుల సేనలు నడచినవి. ఆ కోట యనాయాసముగ వారి వశమాయెను. కోటలోని సైనికులు దాసోహమనిరి. ఇచ్చటనే సుబ్బయ్య నాయకుని కార్యదక్షత, యుచితజ్ఞత శత్రువులకును ప్రశంసాపాత్రము లయ్యెను. సుబ్బయ్య నాయకుఁడు సైనికుల యాయుధములను స్వాధీనముచేసికొని వారిని వదలిపెట్టెను. కోటలోని యాంగ్లేయోద్యోగి యయిన బాగట్‌ను ఖైదు చేసెను. అతని భార్యవచ్చి సుబ్బయ్యనాయకునిఁ బతిభిక్షవేఁడెను. క్షమామూర్తియగు నాయకుఁడు ఆమెప్రార్థన నాలకించి బాగట్‌ను విడుదలచేసి సురక్షితముగఁ బంపివేసెను.

నాయకుని సేనలు ముందుకు సాగెను. కాడల్ గుడికోట వశమాయెను. తర్వాత శ్రీవైకుంఠముకోట. ఇట్లు తిరునెల్వేలిజిల్లా తూర్పుభాగముననున్న కోటలన్నియు నాతనికి లొంగిపోయెను. ఈ విజయయాత్రలో వేలకొలఁది తుపాకులు, మందుగుండు సామగ్రి, ఫిరంగులు నతని చేఁజిక్కెను. ఈ ఫిరంగులు పాంచాలన్ కుఱిచ్చి క్రొత్త కోట బురుజులపై బందోబస్తు చేయఁబడెను.

ఇట సుబ్బయ్యనాయకుఁడు విజయముపై విజయము సాధించుచుండఁగా నట పాళెంకోటలో మెకాలే పటాలములను కూర్చుకొనుచుండెను. తిరుచిరాపల్లినుండి యదనపు బలములుకూడ పాళెంకోటకు వచ్చిచేరెను. దానితో మెకాలే సైన్యములో మొత్తము మూఁడు వేలమంది యుండిరి. ఈ సైనికులతో మెకాలే మార్చి నెల 27వ తేదీన పాంచాలన్ కుఱిచ్చిపై మరల ఎత్తివచ్చెను.

మెకాలే బలములు దారిలో నెన్నియో యిడుమలఁబడుచు నాలవనాఁడు పాంచాలన్ కుఱిచ్చి చేరెను. కోటకాఱువందల గజముల దూరమున నొక మెట్ట సిద్ధమాయెను. దానిపై కుంఫిణీసైనికులు ఫిరంగుల నెక్కించిరి. అవి కోటపై నిప్పులు క్రక్కసాగెను. కాని కోటగోడ నుండి యొక మట్టిపెళ్లయయిన రాలలేదు. తీయకల్లుపోసిన యసలుతోఁ గట్టిన ఫలమిది. బురుజులపైనుండి నాయకుని భటులు ఫిరంగులు ప్రేల్చువారిపై శరవర్షము కురియించు చుండిరి. ఇట్లు కొన్ని గంటలకాలము ఫిరంగులు ప్రేల్పఁగాఁ బ్రేల్పఁగాఁ గోటలో నొకచోట గండి యేర్పడెను. దానిలో దూరి కోటలోఁ బ్రవేశింప మెకాలే తన సైనికుల శాసించెను. నాయకుని భటు లాగండి వెనుకనే దాఁగియుండి కుంఫిణీభటులను గండివఱకు నెక్కనిచ్చి పొడుగాటి యీటెలతోను, తుపాకి సన్నీలతోను బొడిచి పడఁద్రోయుచుండిరి. కుంఫిణీసైనికు లెంత యత్నించినను

కోటలో కాలూన సాధ్యముకాలేదు; క్షతనిహతుల నట్లే వదలి వెనుతగ్గవలసి వచ్చెను. కోట బురుజులనుండి శరవర్ష మట్లే కురియుచుండెను. ఇఁక నచ్చట నిలువఁదగదని మెకాలే మైలుదూరమావలకు తన శిబిరమును మార్చెను.

కోటగండియొద్ద కుంఫిణీసైనికుల శవము లెన్నియో పడియుండెను. వాని కంత్యక్రియలు జరుపుటకొఱకు కొంతకాలము పోరాపవలసినదిగా కోరుచు మెకాలే తెల్లజండాతో తన దూతలను కోటలోనికిఁ బంపెను. ధర్మచింతగల సుబ్బయ్యనాయకుఁడు ఎట్టిషరతులు పెట్టక వారి కోరిక కంగీకరించెను. కోటక్రింద కొయ్యబాఱిపోయిన తమ సైనికుల శవములను కుంఫిణీవారు తీసుకొనివెళ్లి యంత్యక్రియ లొనర్చిరి. నాయకుని భటులు వారి కెట్టి చిక్కులను కలిగింపకపోఁగా తోడ్పాటుకూడ నొనర్చిరి.

మేజర్ మెకాలే విజయకాంక్ష వెలవెలఁబాఱెను, క్రొత్తపటాలము రానిదే కోటను పట్టుట కలలోని మాట యని యతఁడు గ్రహించెను. అదనపుదండును పంపవలసినదిగాఁ గుంఫిణీయధికారులకు మనవియంపుకొనెను. క్రొత్తదండుకొఱ కెదురుచూచుచు, తమ్ము వెక్కిరించుచు నిలిచియున్న పాంచాలన్ కుఱిచ్చికోటను చూచుచు నతఁడు రెండు నెల లచటనే గడపెను. ఈ రెండునెలలలోను సుబ్బయ్య సైనికులు హఠాత్తుగా మెకాలే సైన్యముపై పెక్కుమార్లు పడి చీకాకు పఱచిరి.

మెకాలే మనవి చేరఁగనే కుంఫిణీయధికారులు పెద్ద సైన్యమును పుత్తెంచిరి. దీనికి నాయకుఁడు కర్నల్ యాగ్ న్యూ. ఈ సైన్యములో తిరుచిరాపల్లి తుపాకిదండు, మలబారు ఆశ్వికదళము, మఱికొన్ని ప్రాంతముల పటాలములు నుండెను. వెంట పెద్దపెద్ద ఫిరంగులును వచ్చెను. మెకాలే ఇంత పెద్దసేనను నడుపఁజాలఁడని కుంఫిణీవారు యాగ్ న్యూను పంపిరి.

## అయ్యో! దురదృష్టము!

పాంచాలన్ కుఱిచ్చికోట ముట్టడి ప్రారంభమాయెను. ఫిరంగులు నిప్పులు వర్షించినవి; ఆ నాఁడంతయు – అఱువది గడియలసేపు – వర్షించినవి. కోట బీటలువాఱినది. మఱునాఁటి యుదయమున కుంఫిణీసైనికులు కోటలోఁ జొఱఁబడిరి. సుబ్బయ్యనాయకుఁడు, నతని యనుచరులును సాటిలేని ధైర్యముతోఁ బోరిరి. ఆ నాఁడు మునిమాపు వేళ వఱకు సంకుల సమరము సాగుచునేయుండెను. దక్షిణ భారతదేశమున

మైసూరుపోరు తర్వాత నింతటి భయంకరయుద్ధము మఱియొకటి జరుగలేదు. సుబ్బయ్యనాయకుని రణతంత్రనిపుణత, పాంచాలన్ కుఱిచ్చి ప్రజల పరాక్రమము దీనికి కారణము.

ఈ ఘోరయుద్ధమునఁ గుంఫిణీసైనికులు పలువురు మడిసిరి. సుబ్బయ్యనాయకుని పక్షమున నయిదువందలమంది సైనికులు వీరస్వర్గమలంకరించిరి. ఇఁక కోట నిలువదని తేలిపోయెను. కట్టబొమ్మ నాయకుని కింక రెండే మార్గములుండెను : మొదటిది శత్రువులను శరణువేఁడుట; రెండవది కోటనుండి బయటపడి పోరాడి, తప్పించుకొనుట. మొదటి మార్గము నీచము; కట్టబొమ్మనాయకులు కలలోను భావింపనిది, రెండవది కష్టసాధ్యము. అయినను కోటనుండి బయటపడుటయే యుత్తమమార్గమని మూఁగదొర నిర్ణయించెను.

ఆబాలవృద్ధ మందఱును కోటను వీడి చనవలెనని దండోరా వేసిరి. మూఁగదొర యాజ్ఞ సుగ్రీవాజ్ఞ కదా! విప్లవవీరులందఱును పిఱికిపందలవలెఁ బెదరి పాఱిపోలేదు. బారులుకట్టి నిలిచిరి. క్షతగాత్రులును, స్త్రీశిశువులును మధ్యన నుండునట్లు వ్యూహము పన్ని సాగిపోయిరి. వారిట్లు మూఁడుమైళ్ల దూరము నడచిరో లేదో కుంఫిణీవారి గుఱ్ఱపు దండు వారిని వెన్నంటి తఱుమసాగెను. విప్లవకారులు వారి నెదుర్చుచునే ముందుకు సాగిపోవుచుండిరి. కాని ఈ గుఱ్ఱపుదండు ధాటి కాఁగలేక వారిలో నాఱువందలమంది మరణించిరి. మరణించినవారిలో స్త్రీలు పలువురుండిరి. రెండువేలమంది “చావుతప్పి కన్నులొట్టపోయినది” అన్నట్టు బ్రతికి బైటపడిరి. కట్టబొమ్మ సోదరులును, వారి ప్రధానానుచరులును తప్పించుకొన్నవారిలో నుండిరి. గుఱ్ఱపుదండు వెనుదిరిగిపోయెను. మూఁగదొర తప్పించుకొన్నాఁడేగాని, సురక్షితుఁడుగా నుండలేదు. గుఱ్ఱపుదండును మార్కొనుటలో నతఁడు క్షతగాత్రుఁ డయ్యెను. వ్రణమునుండి మిక్కుటముగ రక్తము స్రవించుటవలన నతఁడు మూర్ఛితుఁడై పడియుండెను. ప్రాణములు పిడికిటఁ బట్టుకొని తప్పించుకొని పాఱిపోవుచున్న తక్కినవా రిది గుర్తించలేక పోయిరి.

## అమ్మా! దొరను కాపాడు!!

పాంచాలన్ కుఱిచ్చి కోటలోపలను, కోట వెలుపల మూఁడు నాలుగు మైళ్ల వఱకును ఎటుచూచినను షీనుఁగులే కానవచ్చుచుండెను. పోరాటపు టలజడి

తగ్గినపిదప నా ప్రాంతస్త్రీలు కోట వెలుపల పడిన శవములలోను, క్షతగాత్రులలోను దమ బంధుమిత్రులున్నారేమో యని వెదుక నారంభించిరి. ఆ స్త్రీలలో నొక వృద్ధురాలు తన కుమారునికొఱకై వేయికన్నులతో నచటి పీనుఁగులను గాలించుచుండెను. ఆ పీనుఁగుల నడుమ మూర్ఛపడియున్న తన కుమారు నామె కనుఁగొనెను. ఎట్లైన నతని బ్రతికించుకొను నాశతో తక్కిన స్త్రీల సహాయమున నతనిని మూర్ఛదేర్చి యింటికి తీసికొని పోవుటకు యత్నించుచుండెను. కొనయూపిరితోఁ ఉన్న యా వీరకుమారుఁడు, తన ప్రాణభిక్ష కోసము వేయిదేవుళ్లను మ్రొక్కుకొనుచున్న యా తల్లిని చూచి చిఱునవ్వుతో నిట్లనెను. :

"అమ్మా! నన్ను బ్రతికించుటవలన నెవరికిఁ బ్రయోజనము? అదిగో! నా సామి మూఁగదొర మూర్ఛపడి యున్నాఁడు. ఆ వీరనాయకుని బ్రతికించితివా, కుంఫిణీవారి పెత్తనమును పటాపంచలు చేయును. ఆయన మరణించిన పిదప ఎవరు బ్రతికిన నేమి? అమ్మా! త్వరపడుము. నాకు మాఱుగా నతనిని దీసికొనిపోయి ప్రాణములు కాపాడుము. పగవారు అతనిని జూచిన పట్టుకొనిపోవుదురు. అమ్మా! నా తుది ఆశ తీర్పుము."

కుమారుని దేశభక్తికిని, రాజభక్తికిని ముసలమ్మ మనసు కరఁగెను. సామాన్యుఁడగు తన కుమారుని కాపాడుటకన్న సుబ్బయ్యనాయకుని గాపాడుటయే దేశశ్రేయస్కరమని గుర్తించెను. అయినను కన్నకడుపు! మనసు ఱాయిచేసికొని, మూర్ఛితుఁడైన కట్టబొమ్మ సుబ్బయ్య నాయకునిఁ దక్కిన పల్లెపడుచుల సాయముతోఁ దనయింటికిఁ దరలించుకొనిపోయి, యతని గాయములకుఁ గట్లు కట్టి యుపచరించుచుండెను. ఈ తల్లి మూఁగదొరను శత్రువుల బారిఁబడక రక్షించిన మఱొక సాహసగాథ యున్నది.

తప్పించుకొని పాఱిపోయిన కట్టబొమ్మనాయకులను, అతని ప్రధానానుచరులను పట్టి యప్పగింపవలెనని, పట్టుకొనుట సాధ్యము కానియెడల కాల్చి శవములనైన నప్పగింప వలెనని కర్నల్ యాగ్ న్యూ తన సైన్యములోఁ జాటించెను. కుంఫిణీసైనికులు కట్టబొమ్మ సోదరులకొఱకై యిల్లిల్లు గాలింపఁదొడఁగిరి. తనయింటిని గాలించుటకు కుంఫిణీసైనికులు వచ్చుచున్నారని ముసలమ్మకుఁ దెలిసెను. వెంటనే యామె యొక తంత్రము పన్నెను. వేయి యబద్ధములాడియైనను నొక్క శుభకార్యము చేయుమన్నారు గదా పెద్దలు. ఒక మహానాయకునిఁ గాపాడుటకు బొంకినఁ బాపమగునా? ఆమె

మూఁగదొరపై నఖశిఖపర్యంత మొక గుడ్డ కప్పివేసెను. పిదప నామెయుఁ, పల్లెపడుచులును గుడ్డకప్పిన సుబ్బయ్యచుట్టును మూఁగి యేడ్పులు, పెడబొబ్బలు మొదలు పెట్టిరి. ఇండ్లను గాలించుచున్న కుంఫిణీ సైనికులా యేడ్పులు విని, యచటికి వచ్చి సంగతి యేమని యడిగిరి. "ఈ ముసలమ్మ జ్యేష్ఠపుత్రుఁడు అమ్మవారు సోకి మరణించినాఁడు" అని పల్లెపడుచులు సమాధానమిచ్చిరి. అది విని సైనికులు అచట నొక క్షణమైనను ఆగక పరుగుతీసిరి. అమ్మవారనిన నాకాలమునఁ బ్రజలంతగా భయపడుచుండిరి. అందులకే కదా "ఆఁడుది అబద్ధమాడిన గోడపెట్టినట్టే" అను నానుడి పుట్టినది. కట్టబొమ్మనాయకు లనినఁ బ్రజల కెంత గౌరవమో తెలుపుట కీయుదంత మొక తార్కాణ.

మూఁగదొర పది, పదునేను దినములలోఁ దేఱుకొని, తనను గాపాడిన ముసలమ్మకును, దక్కిన పల్లెపడుచులకును కృతజ్ఞత తెలిపి, యచటినుండి బయలుదేఱెను.

## తుదిమాట

పాంచాలన్ కుఱిచ్చిలో విప్లవము తలయెత్తకుండ కుంఫిణీవారు ప్రజలను భయభ్రాంతులఁ జేయుచుండిరి. తన సహచరుల జాడయే మూఁగదొరకుఁ దెలియదాయెను. పట్టుమని పదిమంది సైనికులుఁగూడ తనయొద్ద లేరు. అయినను మూఁగదొర ధైర్యము విడనాడలేదు.

ఆ సమయమున శివగంగపాళెయగార్లయిన చిన్నమరుదు, పెద్దమరుదు అను నిరువురు సోదరులును కుంఫిణీ వారిపైఁ బగబట్టియుండిరి. ఈ సంగతి తెలిసిన మూఁగదొర మరుదుసోదరుల సహాయముతోఁ గుంఫిణీ పెత్తనమును సమూలముగ నాశమొనర్పవలెనని సంకల్పించెను. మరుదు సోదరులయొద్ద నిరువదివేలమంది వీరభటులుండిరి. వారిరువురును నాజానుబాహువులు; భీమబలులు, ఇంతలోనే మూఁగదొరను మాఱువేషముననున్న యతని యన్న కుమారస్వామియు, ముఖ్యానుచరులును గలసికొనిరి. వారందఱును ఎవరికిని పట్టుబడక శివగంగ పాళెయమునకు చెందిన సిరువయల్ అను గ్రామము చేరిరి. వీరశేఖరులైన కట్టబొమ్మ సోదరుల రాక విని మరుదుసోదరులు మహావైభవముతో స్వాగతమొసంగిరి. సమరవిశారదుఁడైన మూఁగదొరకు భీమబలులైన మరుదుసోదరుల సహాయము! ఇఁక నేమి? కుంఫిణి వారిని తిప్పలు పెట్టుటకు మంత్రాలోచనలు జరిగెను.

కుంఫిణీవారును ఊరకుండలేదు. వారి దృష్టి పాంచాలన్ కుఱిచ్చినుండి శివగంగపై మఱలెను. కాకులు దూరని కాఱడవిలో నున్న కలయర్‌కోయిల్ కోటలోఁ దలదాఁచుకొన్న కట్టబొమ్మ, మరుదు సోదరులను పట్టుకొనుటకు కుంఫిణీవారి సైన్యము ఎత్తివచ్చెను. కోటలోని వీరు లెంత పౌరుషముతోఁ బోరినను ప్రయోజనము లేకపోయెను. తుదకు కట్టబొమ్మ సోదరులు, మరుదు సోదరులు, వారి ప్రధానానుచరులు కుంఫిణీ సైనికులకుఁ బట్టుబడిరి.

కుంఫిణీవారు మరుదుసోదరులను వారి కోటలోనే యురితీసిరి.

జగవీరపాండ్య కట్టబొమ్మ సుబ్బయ్యనాయకుని, అతని యన్న జగవీరపాండ్య కట్టబొమ్మ కుమారస్వామినాయకుని పాంచాలన్ కుఱిచ్చికి నడపించి యచట కోటకు పడమటనున్న ఫిరంగిదిబ్బపై ఉరితీసిరి.

ఈ ఘాతుకకృత్యము 1801 వ సంవత్సరము అక్టోబరు 1వ తేదీన జరిగెను.

## అమరవీరులు

మేజర్ బానర్‌మాన్ పాంచాలన్ కుఱిచ్చికోటను నేలమట్టము కావించి గాడిదలతో దున్నించి ఆముదాలు చల్లింపఁగా, ఈ సారి కుంఫిణీవారు అచట జిల్లేళ్లు, రేఁగులు విత్తిరి. అంతతోఁ గసితీఱక ఉప్పు చల్లించిరి. పాంచాలన్ కుఱిచ్చిని రూపుమాపుటకు వారెంత యత్నించినను అది నేఁటికిని ప్రజాహృదయముపై, నాలుకపై నధిష్ఠించియే యున్నది. ఆ వీరుల గాథ అజరామరమైనది.

కయత్తారులో కట్టబొమ్మ కఱుత్తయ్యనాయకుని ఉరితీసిన చోట నేఁడొక బొమ్మఱాళ్ల గుట్ట కనిపించును. ఆ దారిని పోవు ప్రజలు కఱుత్తయ్యనాయకుని పవిత్ర సంస్మరణచిహ్నముగా నొక బొమ్మఱాయి నాగుట్టపై వేయు నాచారము నేఁటికిని గలదు. ఈ బొమ్మఱాల గుట్టకొక ప్రక్కనొక పెద్ద బండఱాయి యున్నది. దానికి భక్తులు పూలదండలు వేయుదురు. ఆ గుట్టకు మఱియొక ప్రక్కన నొక చెట్టున్నది. దానికి చెప్పులుగట్టుట యాచారమైనది. రాత్రి కట్టిన చెప్పులు తెల్లవాఱఁగనే యఱిగిపోయియుండునని ప్రజలు చెప్పుకొనుచుందురు. ఇవి యన్నియు గ్రుడ్డి నమ్మకములే కావచ్చును. కాని, కఱుత్తయ్య ప్రజల హృదయాలపై నెంత బలముగా నెలకొనినాఁడో చెప్పుట కివి దృష్టాంతములు కావా?

పాంచాలన్ కుటీచ్చి కోటమైదానపు మన్ను తెచ్చి, దానిని చన్నీటఁ గలిపి పసిపాపలకు పట్టుదురు. దీనితోఁ బసిపిల్లల గుండెయు, నొడలును బలపడునని ప్రజల విశ్వాసము.

మొగలులు శివాజీని 'కొండయెలుక' యని గేలిచేసినట్లే, ఆంగ్లేయులు సుబ్బయ్యనాయకుని 'పిల్లి' యని ఎగతాళి చేసిరి. ఆ 'పిల్లి' తమ పాలిటి పులియని వారెఱుఁగనిది కాదు.

నాడుగాని నాడున, భాషకాని భాషవారి నడుమ స్వాతంత్ర్యసమరము కొనసాగించి తెనుఁగుజాతిని తలయెత్తుకొనఁ జేసిన కట్టబొమ్మనాయక సోదరులారా, వందనములు!



# 5. దళవాయి రామప్పయ్య

## విజయదశమి

నాఁడు విజయదశమి. దిండుగల్లుకోట నలుమూలల విజయశంఖారావములు ప్రతిధ్వనించుచుండెను. సైనికు లత్యుత్సాహవంతులై యుండిరి. పది దినములుగఁ గోటను ముట్టడించి యుండిన దళవాయి హరనూరు నంజరాజు రామప్పయ్య ధాటి కాగలేక పలాయనమంత్రము పఠించినాఁడు. అదియే నాఁటి సంతోషమునకు ముఖ్యకారణము. దిండుగల్లు కోట చాల విశాలమైనది. అందలి యభ్యంతరమందిరము నుండి యిరువురు పురుషు లేతెంచిరి. చూడ వారిరువురు సమవయస్కులుగా గోచరించుచుండిరి. వారి వేషభాషలు వీరోచితములై యుండెను. అందొకరి వస్త్రములపై నెత్తురు చుక్కలు గాననగుచుండెను. ఉరస్త్రాణశిరస్త్రాణములను ధరించి యపుడే యుద్ధభూమినుండి యేతెంచిన ట్లుండిరి. ఇరువురును కోట వెలుపలి యుద్యాన వనమును ప్రవేశించిరి. అందుగల యొక వేదికపై కూర్చుండిరి. వారి సంభాషణ మీ విధముగా సాగెను.

"నంజరాజు గర్వము పూర్తిగ నణఁగవలయునన్నచో వాని కీశాస్తి చాలదు. అందులకే మన సేనాధిపతిని కొంతసైన్యముతో వానిని వెన్నంటవలసినదిగా నాజ్ఞ యిచ్చితిని. నేనును రేపు మఱికొంత సైన్యముతో మనవారిని కలిసికొందుము. నీ అభిప్రాయ మేమి?"

"రామప్పయ్యా! మీ మాటకు తిరుగాడువాఁడనా? మీరే నిన్న నాకు సహాయముగా రాకున్న నేఁటి విజయదశమి యెట్లు గడచియుండెడిదో! ప్రభువులు తిరుమలశౌరి నాయనయ్యగారికి నేనెన్నఁడును కృతజ్ఞుఁడను. తమ యిష్టప్రకారము చేయవచ్చును."

అనునంతలో నిరువురు వార్తావహులు మధురనుండి రాజముద్ర గల కమ్మ నొకదానిని దెచ్చియిచ్చిరి. రామప్పయ్య యా యుత్తరమును దీసి చదువుకొనెను. చదువునప్పుడాతని ముఖము వివర్ణమగుచుండుటఁ జూచి దిండుగల్లుకోట పాళెగారగు

రంగయ్యనాయఁ డులికిపడెను. రామప్పయ్య పలుమాఱు లేఖను చదివెను. కొంతవడికి ముఖమెత్తి. "చూచితివా మిత్రమా! రాజసేవయన్న నిట్లే యుండును గాఁబోలు! తిరుమల శౌరినాయనింవారు మంచివారేకాని నాకు విరోధులగు తదితరమంత్రుల ప్రోద్బలము వారిని మార్చివేసినది. నా స్వామిభక్తిని, దేశప్రేమను వారు స్వార్థముక్రింద జమకట్టినారు. నేనేదో యాత్మలాభము కొఱకై పాటుపడుచున్నానని ప్రభువులకు దుర్బోధన గావించియున్నారు. దాని ఫలితమే యీ లేఖ. చూడుము," అని రంగయ్యనాయని చేతి కాయుత్తర మందించెను. అందిట్లున్నది :

"దళవాయి ప్రధాని రామప్పయ్యగారికి :

దిండుగల్లు కోటను శత్రువుల బారినుండి రక్షించినారని విని మేము చాల హర్షించితిమి. మాయాజ్ఞ యంతవఱకేయను విషయమును మఱచి తాము నంజరాజును వెన్నాడి మైసూరును ముట్టడించు ప్రయత్నములో నున్నారని వింటిమి. మా ముదల లేకయే మీ రిట్టి కార్యమునకుఁ గడంగుట శోచనీయముగా నున్నది. ఈ లేఖ చూచిన తత్క్షణమే మీరు మధురకు రావలసినది.

– తిరుమలశౌరి నాయనయ్య వ్రాలు."

రంగయ్యనాయఁ డాయుత్తరమును జదివి యిట్లనెను : "మిత్రమా! మన వారిలోని లోపమే యిది. స్వయంకృషి వలనను, అనవరతపరిశ్రమ వలనను సామాన్యుఁ డెవఁడైన నున్నతస్థానము నాక్రమించినఁ బదిమంది కన్నులు కుట్టుచుండును. వారి నసూయాపిశాచ మావహించును. దాని ప్రభావమున వారు తమ వివేచనశక్తిని గోల్పోవుదురు. ఇతరుల హృదయములందు విషబీజములను నాటుదురు. కాని తమ చేఁతల పర్యవసానమును గూర్చి యోచింపరు. నీవంటి స్వామిభక్తునే శంకించున ట్లొనర్చిరి గదా!"

"ఏమి చేయుదము? ప్రపంచవిధానమే యట్టిది. మనకార్యముల కన్నింటికి ప్రజాదరణము గలుగునియే యాశింతుము. కాని కొన్నిపట్ల అమృతముకూడ విషమించుట కలదు" అనునంతలో మఱియొక వార్తావహుఁడు "స్వామీ, మీరు నంజరాజును తఱుమ నంపిన సైన్యము మైసూరును సమీపించినది. మఱికొంత సైన్యముతో తాము విచ్చేసినఁగాని నంజరాజుతో ఢీకొని లాభములేదని సైన్యాధిపతి మనవి చేయుమనినాఁడు" అని విన్నవించెను.

రామప్పయ్య యోచనానిమగ్నుఁడయ్యెను. "ఇప్పుడూరకున్న నంజరాజు మరల విజృంభించును. కావున నాతని గర్వము పూర్తిగ నణఁచవలసియున్నది. మధుర రాజ్యమునకుఁ జెందిన కర్ణాటక ప్రాంతప్రదేశములు సుభిక్షముగా నుండవలయు నన్న తానిపుడే నంజరాజు నెదుర్కొనవలసియున్నది. కాని రాజాజ్ఞ తద్వ్యతిరేకముగా నున్నది. ఏమి చేయుట?" ఈ విచికిత్సతోఁ గొన్ని నిమిషములు రామప్పయ్య మౌనముద్ర దాల్చియుండెను. ఏమి నిశ్చయమునకు వచ్చెనో యేమో! కత్తి జపించి "రంగయ్య నాయఁడూ! నీవు నాకు మాఱుగా మధురకు వెళ్లి ప్రభువులకు విషయముల వివరించి చెప్పుము. ఇఁక నాలసించిన లాభముండదు. నేను తత్క్షణమే సైన్యమును తీసికొని మైసూరున కేఁగుచున్నాను" అని యుద్ధసన్నద్ధుఁడై యావీరుఁడచటి నుండి కదలెను. రంగయ్యనాయఁడు కొన్ని విలువగల యుపహారములను పల్యంకికయం దిడుకొని, యుచితపరివారసహితుఁడై మధురకు పయనమయ్యెను.

## కనువిప్పు

దిండుగల్లు దుర్గమును హస్తగతము చేసికొనఁదలఁచి మైసూరిరాజగు చామరాజ ఉడయరు తన దళవాయి నంజరాజు నాపనికై నియోగించెను. తెనుఁగు వీరులే మైసూరు రాజ్యమునఁగూడ ప్రధానులుగను, సైన్యాధిపతులుగను నుండిరి. నంజరాజు తండ్రి కళువె వీరరాజు మైసూరిరాజుల సైన్యాధిపతి; మహావీరుఁడు. అతఁడు భారతమును వచనకావ్యముగా రచించెను. నంజరాజును తండ్రికివలెనే వీరుఁడు, పండితుఁడును, ఇతని హాలాస్యమాహాత్మ్యము ఆంధ్ర వచన వాఙ్మయహారమునకు మణిపూసవంటిది. కన్నడ భాషయందును రచనలు చేసి దళవాయి నంజరాజు సాహిత్యోపాసకుఁడను చిరయశస్సును గాంచెను. అట్టి ప్రతిభాసమన్వితుఁడే మన రామప్పయ్యకు ప్రతివీరుడు.

రామప్పయ్య తగిన సైన్యసన్నాహముతో వెనుకటి దినము తానంపిన సేనలను కలిసికొనెను. మైసూరుసీమలో రామప్పయ్య సంజరాజు సేనలను దాఁకెను. ఉభయపక్షముల వారికి సందడి కయ్యము సంభవించెను. మధురవీరులు ప్రాణములను గూర్చి యోచింపక పోరాడసాగిరి. రామప్పయ్య వ్యూహరచనయం దతిసమర్థుఁడు. అందువలనఁ గొద్దిపాటి సైన్యముతోడనే గొప్ప విజయము సాధింపఁగలిగెను. మైసూరుదళవాయియు యావచ్ఛక్తిని వినియోగించి రామప్పయ్య నెదుర్కొనెను. కాని యతనిసైన్యము చాలవఱకుఁ బెదరిపోయెను. హతశేషులు కొందఱు కకావికలైరి.

సంజరాజు చేయునది లేక యోటమి నంగీకరించెను. ఇంక నెన్నండును మధురవారి నేలపై యడుగిడనని శపథము చేసెను. ఇట్లు విజయలక్ష్మీసమేతుండై వీరుండు రామప్పయ్య ససైన్యముగా మధురకు విచ్చేసెను. కాని తిరుమలశౌరి నాయకుని చూచుట కేలనో యాతనికి జంకుగా నుండెను, అందువలనం దన రాకను, మధురసైనికుల వీరత్వమును, జయప్రాప్తినిం దెలుపు లేఖ నొకదానిని వ్రాసి రాజునకుం బంపెను.

అంతకుంబూర్వమే రామప్పయ్య యాదేశానుసారము మధురకు వచ్చియుండిన దిండుగల్లుపాళెగారు రంగయ్య నాయండు తిరుమలశౌరినాయని సందర్శించెను. యుద్ధవిషయములను గూర్చి ప్రస్తావించుచు రామప్పయ్య నిష్కపటహృదయమును, ప్రభుభక్తిపరాయణత్వమును నద్వితీయములనియు, పాండ్యమండలశ్రేయస్సు నాకాంక్షించియే యాతండు మైసూరువఱకు నంజరాజును తఱిమినాండనియు నుడివెను. మధురరాజ్యమున శాంతిభద్రతలు సుస్థిరముగా నెలకొల్పుటయే దళవాయి ప్రధాని ముఖ్యధ్యేయమని రంగయ్యనాయండు తిరుమలశౌరినాయనింవారికి వివరించి చెప్పెను. ఆహా! సన్మిత్రులు సాధింపరాని కార్యమెద్ది?

తిరుమల శౌరినాయకుండును స్వభావముచే వివేచనశూన్యుండు గాండు. కావున నతనికి రామప్పయ్య తమకై, తమ రాజ్యమునకై పాటుపడిన దంతయు నాటకమునందలి యంకములవలె హృదయఫలకమున గోచరించెను. పశ్చాత్తాపముచే నతని కన్నులశ్రుపూరితము లయ్యెను. “రామప్పయ్య ఎంతటి సుజనుండు! రాచకార్యములం దెంత ఘనుండు! తొందరపడి యాతని సంశయించితిమి. తొలితరమున అరియనాథ మొదలి యెట్లు స్వార్థచింతన లేక పాండ్యరాజ్యశ్రేయస్సుకు తన సర్వస్వము నంకితమొనర్చెనో యట్లే, యీ తరమున నీతండును కృషిచేయు చున్నాండు. ఇతని గుణగణములు, సౌశీల్యము మాకు క్రొత్తవి కావు” అన్నమాట లప్రయత్నముగా నాతని నోటినుండి వెల్వడెను. తిరుమలశౌరినాయని ప్రవర్తనము రంగయ్యనాయని ముగ్ధునిం గావించెను. అతని మనోవీథిని భవభూతి కవి యొక్క “వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి లోకోత్తరాణాం చేతాంసి” అను మాటలు మెఱసినవి.

రామప్పయ్య నెప్పుడు చూతునా యని తిరుమల శౌరి యెదురు చూచుచుండెను. రంగయ్యనాయండు తనకుం గావించిన మేలును రామప్పయ్య వేయివిధములం బొగడెను.

దళవాయి ప్రధాని వచ్చియున్నాఁడని విని తిరుమల శౌరి యతనిని స్వయముగా నభినందింపఁ గొలువుకూటమునకు విచ్చేసెను. స్నేహలాభమున నుబ్బి తబ్బిబ్బులవుచున్న రామప్పయ్య రంగయ్యలను చూచి తిరుమలశౌరి "మన నాయక రాజులందఱు విద్వేషవిషమును వీడి, యిట్టి సౌభ్రాత్రము నభివృద్ధిపఱచుకొనిన మనల నెదుర్కొన నెవరికిని దరముగా" దనుకొనెను. పిమ్మట రామప్పయ్యను సమీపించి కరచాలన మొనర్చి "మీ ప్రభువుల గౌరవము నిలిపితిరి. మధురరాజుల మానము కాపాడితిరి. మీ యనుపమదేశభక్తి, ప్రభుభక్తిపరాయణత సాటిలేనివి" అని తన కృతజ్ఞతను దెల్పెను. రామప్పయ్య తన కీవిధమగు స్వాగతమును నాయకేంద్రుఁ డిచ్చునని కలనైనఁ దలఁచియుండలేదు. "భగవంతుని లీల లనంతములు. అతని కృపయేయున్నచోఁ గొండలవలె పైఁబడ్డయాపదలు మంచువలెఁ గరఁగిపోఁగలవు" అని యతఁడు ఇష్టదైవమును సంస్మరించెను, రామప్పయ్య మీనాక్షీసుందరేశ్వరులను పూజింపక యేకార్యమునకుఁ గడంగఁడు. అట్టి భగవద్భక్తియు, నపారవిశ్వాసమును నాతని జీవితమున యశఃకాంతుల నావరింపఁ జేసినవి.

## రామప్పయ్య పూర్వులు

రామప్పయ్య పూర్వులు ఆంధ్రదేశమునకుఁ జెందినవారు, కృష్ణరాయల పాలనకాలమున విజయనగర సామ్రాజ్యము దక్షిణాపథమునం దంతట వ్యాపించి యుండినది. అంతకుఁబూర్వమే విజయనగర బుక్కరాయల పుత్రుఁడగు కుమారకంపన దక్షిణమున దిగ్విజయయాత్ర సలిపెను. అప్పుడు మధుర సుల్తానుల హస్తగతమై యుండెడిది. కంపన దేవేరి గంగాదేవియు జైత్రయాత్రలో నాతని ననుగమించినది. మధురావిజయమను సంస్కృతకావ్యమున గంగాదేవి యా దండయాత్రావివరముల నొసంగియున్నది. కుమారకంపన దక్షిణదేశమును జయించి యచ్చటి రాజులను విజయనగర రాజులకు సామంతులఁ గావించి కప్పము చెల్లించు నేర్పాటు గావించెను. కృష్ణరాయల కాలమునాఁటి కీ రాజులు స్వాతంత్ర్యమును బ్రకటింప నుద్యుక్తులైరి. కావున కృష్ణరాయలు మరల దక్షిణరాజ్యములను జయింపవలసివచ్చెను. ఈ మాఱు కృష్ణరాయలొక నూతనపద్ధతి నవలంబించెను. తాను జయించిన మధుర, తంజావూరు మొదలగు ప్రదేశములలోఁ బూర్వ రాజవంశీయుల నుంచక, తన రాజ్యప్రతినిధులను నియమించెను. తొలుదొల్త నాగమనాయకుని మధురకు నాయకునిగాఁ బంపెను. కొన్నిదినముల కాతఁడు తిరుగఁబడఁగా నతని కుమారుఁడగు విశ్వనాథ సేనాపతిని నాగమనాయకుని స్థానమున నియమించెను. ఇట్లు రాయలవారికాలమున

తెలుఁగునాయకులు దక్షిణదేశమున నెలవు లేర్పఱచుకొని నెలకొనిరి. వీరితోఁ గూడ కొందఱు కవులు, పండితులు, రాజకార్య నిర్వహణమునకు సహకరించు నియోగులు దక్షిణదేశమున కేతెంచిరి. నాయకరాజులు తమ ప్రభువగు కృష్ణరాయలను భాషాపోషణ విషయమున మార్గదర్శిగా గైకొనిరి. కావుననే తెలుఁగుభాష రాజభాషయై, నాయక రాజుల యాదరము పెక్కు శాఖల నభివృద్ధినందినది.

ఆ నాఁడు తెలుఁగు దేశమునుండి వెళ్లి దక్షిణమున స్థిరావాసము లేర్పఱచుకొన్న కుటుంబములలో రామప్పయ్య కుటుంబమును నొకటి. మధురానగరమున కేడుమైళ్ల దూరమున నున్న చతుర్వేదిమంగల మను గ్రామమున రామప్పయ్య పూర్వులు కొంత భూవసతిని సంపాదించిరి. కొందఱు మధురనాయక రాజుల కొలువునందు విశ్వాసపాత్రులగు నుద్యోగులుగా నుండి తమ పోషకుల మన్ననలందిరి. రామప్పయ్య తండ్రి మధురనాయకుల కొలువున నొక చిన్న యుద్యోగిగా నుండెను. అతని తర్వాత రామప్పయ్య యగ్రజుఁడు వైద్యనాథయ్య కొలువులో ప్రవేశించెను. కాని 'పువ్వు పుట్టడముతోనే పరిమళించినట్లు' రామప్పయ్య బాల్యము నుండియే తోడిబాలురకెల్లఁ బై చేయియై యుండెడివాఁడు. బ్రాహ్మణోచితములగు వేదవేదాంగాది విద్యలకన్న యుద్ధకళ, రాజ్యతంత్ర మాతని నెక్కుడుగా నాకర్షించినవి. ద్రోణాచార్యులు, తిక్కయజ్వ యుదాహరణప్రాయులై యాతని మనోనేత్రములకు గోచరించిరి. అతఁ డనతికాలములోనే యుద్ధవిద్యయం దారితేరి మహావీరుఁ డయ్యెను. రామప్పయ్య ధీపటిమను బాల్యమునుండి యెఱిఁగియున్న ముద్దుకృష్ణనాయనింగారు తమకొలువులో నాతని నుంచుకొన నిచ్ఛగించిరి. అతఁడు మొట్టమొదట సాధారణోద్యోగియై, తన బుద్ధికుశలత నెడనెడఁ బ్రదర్శించుచు నున్నతస్థానమున కర్హుఁడన్న మన్ననను బడసి ముద్దుకృష్ణనాయని కాలముననే మంత్రిపదవి నందుకొనెను. ముద్దుకృష్ణనాయనికి వెనుక నతని కుమారుఁడు ముద్దువీరభూపాలుని పాలనమున నతఁడు ప్రధాని యాయెను. తర్వాత నాతని సోదరుఁడు తిరుమలశౌరి నాయనయ్య సింహాసన మెక్కెను. ఇతనికి రామప్పయ్యపైఁ గల గౌరవాభిమానములు నిరుపమానములు, ఇతనిని తన ప్రధానామాత్యునిగ మాత్రమే కాక సైన్యాధ్యక్షునిగఁ గూడఁ జేసి తిరుమల శౌరినాయకుఁడు తనకు రామప్పయ్యపైఁ గల యపారాభిమానమును, విశేష గౌరవమును వ్యక్తపఱచెను. అప్రతిమానమగు ప్రతిభతో, ననిర్వచనీయమగు కృషితో రామప్పయ్య ప్రధానిత్వమును, దళవాయిపదవిని నిర్వహించుచు తిరుమలశౌరి నాయనింవారి భృత్యుఁడై యుండెను. సజ్జనులు స్వాభావికముగా వినయవంతులై

యుందురు. ధనము, పదవి వారి కెంతమాత్రము గర్వమును గలిగించవు. లోకసేవయే జీవితపరమావధియయిన మహాపురుషులకు పదవులు కేవలము సాధనమాత్రములు. మన రామప్పయ్యయు రాజకార్యముల దృష్టియందు ప్రధాని; యుద్ధకార్యముల దళవాయి. కాని ప్రజలకు సన్నిహితుఁడు; ప్రభువునకు భృత్యుఁడు; సుందరేశ్వరునకు భక్తుఁడు.

## వివాదము

రామప్పయ్య యుద్ధనిపుణుఁడయ్యు, విరసుఁడు కాఁడు. మధురయందలి శిల్పకళామందిరము లాతని పర్యవేక్షణ క్రింద నిర్మితములైనవి. అప్పుడప్పుడే రూపముదాల్చుచున్న సౌందర్యమహలునం దాతఁడు శిల్పాచార్యుల కేవో కొన్ని సూచన లిచ్చుచుండెను. సాయంసమయ మాసన్నమగుచుండెను. మధురాపట్టణవాసులు ముస్తాబై వైఘనదీ తీరమునకు వాహ్యాళి వెడలుచుండిరి. మఱికొందఱు మీనాక్షీ సుందరేశ్వరుల యాలయమువైపు నడచుచుండిరి. గుడిగంటల గణగణలు వినవచ్చు చుండెను. శిల్పాచార్యు లిండ్లకు మఱలు యత్నములో నుండిరి. రామప్పయ్యయు గుడిగంటలు విని లేవ నుద్యుక్తుఁడయ్యెను. ప్రతిదినము ప్రొద్దునను, సాయం కాలమునను మీనాక్షీసుందరేశుల సేవించుట యాతని నిత్యకృత్యములలో నొకటి.

రామప్పయ్య శుచియై దేవాలయమున కేతెంచెను. ఆ నాఁడు వేయి కాళ్ల మంటపము పురజనులచేఁ గిటకిటలాడుచుండెను. మంగళవాద్యముల నాదము మిన్నుముట్టుచుండెను. అంతఃపురజనము స్వామిని సేవించుటకై వేంచేసి యున్నారని రామప్పయ్య గ్రహించెను. అతఁడు సుందరేశుని గర్భాలయమునకు ప్రదక్షిణమాచరించి నోరార నాదేవునిఁ బ్రస్తుతించుచుండెను. ఇంతలో దేవేరి వెంటరాఁగా తిరుమల శౌరినాయనింగా రరుగుదెంచిరి. రామప్పయ్య సవినయముగా నారాజదంపతులకుఁ జేమోడ్పు లర్పించెను. తిరుమలశౌరినాయని దేవేరి తంజావూరు రఘునాథరాయల పుత్రి అచ్యుతరఘునాథమ్మ. పండితపోషకుఁడు, స్వయముగా విద్వాంసుఁడు, కవియునైన తంజావూరి రఘునాథనాయకుని యనుంగుఁబుత్రియైన అచ్యుత రఘునాథమ్మ తండ్రియొద్దనే సంస్కృతాంధ్రముల నేర్చెను. సంగీతసాహిత్యములు విజయనగ రాస్థానమును వదలి తంజావూరును తమ నివాస మొనర్చుకొనినవి. అచ్యుత రఘునాథమ్మకు లలితకళలన్న నభిరుచి మెండు. పుట్టింటివారన్న సహజముగా స్త్రీల కందఱికిని నుండు నభిమాన మామెకును గలదు. ఒకనాఁ డామె ప్రసంగవశమున

భర్తతో తంజావూరి కళాకౌశలము ముందట మధుర శిల్ప కళాఖండములు పనికిమాలినవనెను. రాజుగారి వదనము జేవురించెను. "సరియే. దేవేరు లొకపరి మీనాక్షీసుందరేశ్వరాలయమును చూడవలసియున్నది" అని కటువుగా ననిరి. అందుల కామె చలింపక "నా కాయాలయము సుపరిచితమైనదే కదా!" అనెను."కావచ్చును. కాని మీరు దేవాలయమందలి శిల్పములను సరిగా చూచియుండరు. అపూర్వకళాభాండార మని ఖండఖండాంతరవాసులు గూడఁ బొగడిన మధుర దేవాలయమును తక్కువపఱచి మాటలాడుట తగదు" అని నాయనింవా రక్కడనుండి చివాలున లేచిరి. ఈ విషయమై పరిశీలనమునకే నేఁ డారాజదంపతులు దేవాలయమున కేతెంచియుండిరి. పూజారి ప్రభుదంపతులను, ప్రధానిని గౌరవించి, స్వామివారికి కర్పూరహారతి నిచ్చి, ప్రసాదముల నిచ్చెను.

దేవాలయబహిఃప్రాంగణమున పరివారము సిద్ధముగా నుండెను. ముందు పరివారము నడచుచుండ వెనుక తిరుమలశౌరి నాయనయ్య, పట్టమహిషి, రామప్పయ్య మున్నగువారు నడచుచుండిరి. అంతఃపురప్రాంగణమున నిర్మితమగుచున్న కళా మందిరమున కందఱు నేతెంచిరి. అచ్చట మఱల తంజావూరు రాజమందిరములతో నేవియు సరితూగవని పట్టమహిషి నుడివెను. తిరుమలశౌరి నాయనయ్య "తంజావూరి రాజవంశము వారికిఁ గన్నులు గానవచ్చుటలేదు. వారికి, మాకు సంబంధములు కలిసియున్నను విరోధము లంతము కాలేదు" అని మిన్నకుండిరి.

రామప్పయ్య "స్వామీ, పరస్పరవైషమ్యములే పతనహేతువులు కాఁగల వందురు. విజయనగర సమ్రాట్టునకు సామంతులైన మీరందఱు నైక్యభావముతోనున్న మిమ్ముఁ బ్రతిఘటింప ఫాలాక్షునకు కూడ నసాధ్యమగునని నా విశ్వాసము" అని యనుచుండ నాయకేంద్రుఁ డాతని మాటల కడ్డువచ్చి, "అంతటి వివేచన మా నాయకరాజులకున్న విచారింపవలసినదేమి? ఎవరికి వారే గొప్పవారమను నభిప్రాయము ప్రబలి యైకమత్యమునకు మాఱు విద్వేషమలమి కొనుచున్నది" అని నిరుత్సాహముతో ననిరి.

ఇంతలో చీఁకటి బాగుగ క్రమ్ముకొనెను. "దేవీ, ఇచ్చటనే ప్రొద్దుపోయినది. ఱేపు మరల నీవిషయమై చర్చింతము గాక" యని తిరుమలశౌరి మందహాసముతోఁ బలికెను. రాణిగారి కోపము పటాపంచలైపోయెను. చిఱునవ్వు దొలుకాడ "ఱేపు క్షేత్రయ్యగారి సంగీతకాలక్షేపమున్నది కదా!" అని సాభిప్రాయముగా ననెను. రామప్పయ్య రాజదంపతుల ప్రేమాతిశయమునకు లోలోన హర్షపులకిత గాత్రుఁడయ్యెను.

ఆ మఱునాఁడు క్షేత్రయ్య గానసుధాలహరిలో మధురాపురివాసు లందఱు తన్మయత్వము నందిరి. తిరుమలశౌరి యథోచితముగా నా సంగీతవిశారదుని గౌరవించి, కాన్కలిచ్చి సత్కరించెను.

## సేతుపతి

రామనాథపురము నేలు పాళెగార్లకు సేతుపతులను వ్యవహార మనాది ప్రసిద్ధమైనది. వీరి యధికారము క్రింద సేతుతీర్థమును, రామేశ్వరక్షేత్రము నుండిన కారణమునఁ గాఁబోలు వీరి కీపేరు గలిగినది. ఈ పాళెగార్లు మధురనాయకులకు సామంతులు; వారితో మైత్రిని బ్రకటించుచు కప్పమును చెల్లించువారు. కాని ముద్దుకృష్ణప్పనాయని కాలమున ప్రస్తుత పాళెగారగు జడైకదేవ సేతుపతి పూర్వులు రామేశ్వరయాత్ర కరుగు మధురయాత్రికులను బాధింపఁ దొడఁగిరి. ఈ విషయమును తెలిసికొన్న వెంటనే మధుర ముద్దుకృష్ణప్పనాయకుఁడు సేతుపతుల నణఁచి వారలను తన యాధిపత్యము స్వీకరించునట్లుగాఁ జేసెను. పాండ్యమండలా ధీశ్వరులకు కప్పము చెల్లించునట్లు వారలనుండి సమ్మతిపత్రమును గూడ మధురనాయకుఁడు గైకొనెను. ముద్దుకృష్ణప్పనాయకుని మరణానంతరము సేతుపతులు మధురవారికి సరిగా కప్పము చెల్లించుట లేదు. ప్రస్తుతము పాళెగారగు జడైకదేవుఁడు యుద్ధనైపుణ్యమునవేమి, రాజకార్య నిర్వహణమునందేమి చతురుఁడని ప్రఖ్యాతిగాంచిన వాఁడు. మధురనాయకుల యధికారము నంగీకరించుట యాతనికి వెగటుగాఁ దోఁచెను. కావున కప్పము చెల్లించుట పూర్తిగా మానివేసెను. రామప్పయ్య యీ విషయమై దూతల నంపెను. కాని సరియైన జవాబు లభించకుండెను.

జడైక దేవసేతుపతి కొక్కతెయే కుమార్తె. ఆమెయుఁ జిరకాలతపఃఫలితముగా జన్మించినది. రామనాథస్వామి యనుగ్రహమున తన కీపుత్రి జన్మించినదని యతఁడు మురిసిపోవుచుండెను. రామేశ్వరమందలి యంబిక పేరు పర్వతవర్ధని, సేతుపతి తన తనయను 'వర్ధని' యని పిలిచెడి వాఁడు. ఆమెకు బాల్యావస్థ దాఁటకముందే సేతుపతి దేవేరి మరణించెను. మాతృవియోగ మాబాలను బాధింపకుండు నటుల తండ్రియే తల్లియై యామె నల్లారుముద్దుగాఁ బెంచెను. పండితులను నియమించి యామెకు తమిళసంస్కృతములను నేర్పించెను. రాజ్యాధికారము తన వెనుక నీ పుత్రికకే ప్రాప్తింపవలయునని జడైక దేవుని యాశయమై యుండెను. అందుచే నాతఁడు వన్నిదొర యను వీరున కామెనిచ్చి వివాహమొనర్చెను.

జడైక దేవునకు తంబియను కనిష్ఠసోదరుఁ డుండెను. అన్నకు వెనుక తాను సేతుపతి కావలయునని యాతని యభిలాష. సోదరునకు పుత్రసంతానము లేకపోవుట యీ యభిలాషకు దోహద మొసంగెను. వర్ధని నొక పాళెపుదొర కిచ్చి యత్తవారింటి కంపిన, రాజ్యము తనదే కదా యని యతఁడాశపడెను. జడైక సేతుపతి కార్యమువలన నాతని నోట కరక్కాయ పడినట్లయ్యెను. అల్లుని నిల్లఱికముంచుకొని యధికారము నప్పగించుట తన్నవమానపఱచుటకే యని తంబి బాధపడసాగెను. ఒంటరిగా నన్న నెదిరించు నంగబలముగాని, యర్థబలముగాని యాతనికి లేవు. కావున నాతఁడు మధురనాయకుల నాశ్రయించి సోదరునిపై పగతీర్చుకొన నిశ్చయించెను.

జడైక సేతుపతికి కుమార్తెయే సర్వస్వము. ఆమె తనకంటె మించిన వీరుని పత్నియైనందు కాతఁడు మురిసిపోవుచుండును. రూపలావణ్యములందు, గుణవిశేషములందు తీసిపోని తన కూఁతును, నల్లునిఁ జూచి యాతఁడు గర్వించుచుండును. "వన్నిదొర రాజ్యమును రక్షింప సర్వవిధముల శక్తుఁడు. నా కన్నుల యెదుటనే నా కుమార్తె కడుపు ఫలించి దౌహిత్రలాభ మొనగూడిన నాకిఁక కావలసినదేమున్నది?" అని జడైకసేతుపతి కుమార్తెను, నల్లుని గూర్చి యనుకొను చుండును.

మానవులందఱు శుభమునే కాంక్షించుచుందురు. కాని కొందఱికే తామనుకొన్న లాభములు ప్రాప్తించును. తానొకటి తలఁప దైవమొకటి తలఁచుచుండుట లోకమున సహజముగ గోచరించుచుండును. జడైకసేతుపతి తాను జీవించియుండఁగానే, రామనాథపురము నొక స్వతంత్రరాజ్యముగాఁ జూడఁదలఁచెను. "మధురనాయకులు తెలుఁగువారు! వారు నాకన్న నేవిధముగ మిన్నలు? ఎవరో వారి పూర్వులు నా పూర్వులను జయించినంత మాత్రమున నేనేల వారికి సామంతుఁడు కావలయును? మేటిమగలైనచో నపర రుద్రావతారుఁడని పేరుగాంచిన నన్నెదుర్కొని జయించి కప్పమును స్థిరపఱచుకొననిండు. అల్లుఁడగు వన్నిదొరయు సుప్రసిద్ధవీరుఁడు. కాఁబట్టి యుద్ధమున కెంతమాత్రమును నేను జంకుట లేదు" అని జడైక దేవుఁడు తన సహచరులతో ననెడువాఁడు. మధురనాయకుల వేగులవాం డ్రీ వృత్తాంతమును చెవిని వేసికొని, తిరుమలశౌరినాయనింగారి కొలువున రామప్పయ్యగారి సమక్షమున నివేదించిరి.

## మంత్రాలోచనము

చతుర్వేదిమంగలమున రామప్పయ్య యొక శివాలయమును నిర్మింప నిశ్చయించెను. అన్నయగు వైద్యనాథయ్య నేతత్కార్యనిర్వహణమునకు నియోగించెను. రామప్పయ్య యల్లుఁడు శివరామయ్యయు గొప్ప యుద్ధవీరుఁడు. దిండుగల్లు కోటను విడిపించు సందర్భమున నీతఁడు మధురయందే యుండి పోవలసివచ్చెను. రామప్పయ్య తన యల్లుని నాయకేంద్రుని కొలువులోఁ జేర్చ నభిలషించెను. కాని దేనికైనను సమయము రావలెను గదా!

చతుర్వేదిమంగలమున రామప్పయ్య యిల్లు చాల విశాలముగా నుండును. రాజకార్యములఁ బ్రవీణుఁడైనను రామప్పయ్యగాని, యతని యింటిలోని వారలుకాని వైదికకర్మల నుపేక్షింపరు. శివాలయనిర్మాణమున శిల్పులకు సలహాలనిచ్చుచు వైద్యనాథయ్య నిమగ్నుఁడై యుండెను. రామప్పయ్య కుటుంబమువారు సంస్కృత భాషనభ్యసించుట విధిగా తలఁచుచుండిరి. ప్రతిదినమును రాత్రి భోజనానంతరము పరుండుటకు ముందు రామప్పయ్య, యల్లుని కావ్యపఠనము చేయుమనును. ఆ నాఁ డతఁడు యోచనానిమగ్నుఁడై కూర్చుండియుండెను. శివరామయ్య ఆంధ్ర భారతమునందలి యుద్యోగపర్వమునఁ గృష్ణరాయబార ఘట్టమును చదివెను. రామప్పయ్య మన మన్యాసక్తమై యుండుటను గమనించిన శివరామయ్య యాతనికి దాఁపున మౌనముగాఁ గూర్చుండెను.

కొంతసేపటికి రామప్పయ్య మౌనము ఛేదించుచు నిట్లనెను : "ఈ వృద్ధావస్థలోఁ గూడ యుద్ధములోఁ బాల్గొనుట యనివార్యమగుచున్నది. తుదకు యుద్ధరంగమే మరణశయ్యయగునేమో యను సంశయము గలుగుచున్నది. నూతనముగ నిర్మితమగుచున్న దేవతాయతనమును నీ అధీనము జేయ సంకల్పించితిని. స్వామివారి నిత్యపూజ యందుగాని, నైవేద్యాదులందుగాని, యుత్సవములందుగాని యెట్టిలోటు రానీయకుము. ఇంక మఱేమియు నీకుఁ జెప్ప నవసరము లే దనుకొందును."

మఱునాఁటి యుదయమున దళవాయి శకటారూఢుఁడై తిరుమలేంద్రుని సభకు వెడలెను. నాయకుఁడు మంత్రులతోను, సైన్యాధిపతులతోను సమాలోచనము చేయుచుండెను. రామప్పయ్యను జూడఁగనే వారికి సెలవిచ్చి పంపి తిరుమలేంద్రుఁ డాతనితో రహస్యమందిరమున కరిగెను. సేతుపతుల నిర్లక్ష్యమునుగూర్చి ప్రస్తావించుచు నాయకేంద్రుఁడు "ప్రస్తుతము మనము రామనాథపురముపై దండువెడలుట లాభకారిగా

నుండఁజాలదేమో!" యనెను. రామప్పయ్య నిశ్చలభావ ముట్టిపడ "కాని మనకు యుద్ధము తప్ప జడైకదేవుని పట్ల వేఱు సాధన మేదియు లేదు. ఎన్నిమార్లు దూతల నంపినను నాతఁడు సరియగు ప్రత్యుత్తర మిచ్చుట లేదు. పైఁగాఁ దెనుఁగువారు మఱవవీరుల నెంతమాత్రము బ్రతిఘటింపలేరని గర్వోక్తులాడుచున్నట్లు తెలియుచున్నది" అనెను.

తిరుమలశౌరి ముఖ మెఱ్ఱవాఱెను. "జడైక దేవసేతుపతికిఁ దగిన శాస్తి చేసి తీఱవలయును. పూర్వము సింహళ దేశమును జయించినది తెనుఁగువీరులే యన్న విషయమాతఁడు మఱచినాఁడేమో. ఈ మఱవలెవరు? సేతురక్షణకై నియోగింపఁ బడినవారు. ఈ నాఁడు 'మేనయత్తకు చిక్కని మీసము వచ్చె' నన్నట్లు వీరు గొప్పవీరులైనారు" అనెను.

"అదే ప్రభూ నేను గూడ విన్నవించునది! సేతుపతి గర్వమణఁచుట మన ప్రధానకర్తవ్యము. అంతేకాక సముద్రతీరప్రదేశములందు పాశ్చాత్యవ్యాపారులు కర్మాగారముల నిర్మించుకొనియున్నారు. తమ వ్యాపారముతోఁ దనివిసనక వారు రాజకీయములందు జోక్యము గలిగించుకొని విశేషాధికారము చలాయించుచున్నారు. సేతుపతికి వారు మిత్రులని వినికిడి. ఈ యుద్ధముతో వారినిగూడ మన యధికారమును స్వీకరించునట్లు గావించవచ్చును. దైవమనుకూలించిన 'ఏకక్రియా ద్వ్యర్థకరీ' యన్నట్లు రెండు కార్యములు నెఱవేఱును" అని రామప్పయ్య తిరుమలశౌరి మాటలను సమర్థించెను.

తిరుమలేంద్రుఁడు సేతుపతిపై దండువెడలుట కాజ్ఞయిచ్చెను. రామప్పయ్య సైన్యాధిపత్యమున కొప్పుకొనెను.

ఇంతలో దౌవారికుఁ డొకఁ డేతెంచి, జయాభివాదన మొనర్చి "రామనాథ పురమును బాలించు జడైకదేవ సేతుపతి కనిష్ఠసోదరుఁడు తంబిదొర వచ్చియున్నాఁ" డని నివేదించెను. తిరుమలశౌరి యాశ్చర్యమును బ్రకటించుచు "తంబి రాకకు కారణ మేమైయుండునో?" అని దళవాయినిఁ జూచెను.

తంబిని లోనఁ బ్రవేశపెట్టవలసినదని రాజాజ్ఞయాయెను. భటులు తంబిని సభాంగణమునకుఁ దోడ్తెచ్చిరి, దళవాయి కెడమవైపున కొంతదూరమున నున్న యున్న తాసనమున నతఁ డాసీనుఁడయ్యెను. కుశలప్రశ్నల పిమ్మట దళవాయి రామనాథపుర విషయములగూర్చి ప్రశ్నింప నాతఁడిట్లు నుడివెను :

"మా యన్నగారు సేతుపతు లైనప్పటినుండి తమకు సరిగా కప్పము చెల్లింపని విషయము తమ రెఱిఁగినదే. వారికి తన్ను మించిన యోధుఁడు లేఁడన్న గర్వము చాల గలదు. ఇంకొక ముఖ్యవిషయ మీసందర్భమునఁ దమకు నివేదింపఁదలచి నేను తమ దర్శనమునకు వచ్చితిని. మా యన్నగారికి పుత్రసంతానము లేదు. కూఁతుపై నాతని కభిమాన ముండవచ్చును. కాని స్త్రీకరగతరాజ్య మెంతకాలము నిలువఁగలదు? నాపై వారి కేలనో విముఖత యేర్పడినది. వన్నిదొర యను వీరునకు తన కుమార్తెనిచ్చి వివాహమొనర్చి యున్నాఁడు. మా యన్నగారి ఆటల నరికట్టువారు లేరు. తమ రనుగ్రహించినఁగాని నా కన్యాయము తప్పదు."

"ఈ విషయమై మేము కొంత విచారింపవలసియున్నది. ఏ పక్షమున న్యాయమున్న నా వైపు వారికి మా సహాయము తప్పక లభింపఁగలదు" అని తిరుమలేంద్రుఁడనెను.

తంబి వెడలిన తర్వాత రాజు దళవాయినిజూచి "వీఁడు మోసగాఁడు కాఁడు కదా?" అనెను.

దళవాయి మందహాసముతో "ఏమో! మఱవల మర్మము లాస్మరహరునకే తెలియవలెను. కాని శరణార్థియై వచ్చినవానిని త్రోసిపుచ్చుట మధురనాయకుల చరిత్రకు క్రొత్తవిషయము" అనెను.

## యుద్ధసన్నాహము

రామప్పయ్య తన యన్నయగు వైదనాథయ్యను సందర్శించెను. జడైకసేతుపతితో యుద్ధము జేయఁబోవు ననుజుని నాతఁడు మనసార దీవించెను. "తెలుఁగువారు జగదేకవీరులని దేశదేశాలవారు తెలిసికొనునటులఁ జేయుట, దళవాయిపదవిని నిర్వహించుట నీ విధియైయున్నది. జయశ్రీ నిన్ను తప్పక వరించునటుల మీనాక్షీసుందరేశ్వరు లాశీర్వదింతురుగాక!" యనెను.

రామప్పయ్య మీనాక్షియాలయమున కరిగెను, రంగయ్యనాయఁడును, అల్లుఁడు శివరామయ్యయు నాతని ననుసరించిరి. దేవాలయాధికారు లాతనికి స్వాగతమొసంగిరి. దేవి కంఠసీమ నలంకరించిన పుష్పహారములలోఁ గొన్నింటిని దీసి రామప్పయ్య రంగయ్యనాయకులకు వేసిరి. తీర్థప్రసాదాదుల స్వీకరించి వారు రాజనగరున కరుదెంచిరి.

నిండుసభలో తిరుమలేంద్రుని యభీష్టానుసారము రంగయ్యనాయఁడు సభాసదులకు సేతుపతులతో జరగనున్న యుద్ధమునుగూర్చి వివరించి చెప్పెను. మఱునాఁటి యుదయమున సముచిత సైన్యసన్నాహముతో దళవాయి ప్రధాని రామప్పయ్య రామనాథపురమునకుఁ దరలుచున్నాఁడను వార్త విని జయజయ ధ్వానములతో సభాభవనము మాఱుమ్రోఁగెను.

పల్లకిలో రామప్పయ్య, అతని కిరువైపుల చతురంగబలములతోడ రంగయ్యనాయఁడు, శివరామయ్య, కొండప్పయ్య మొదలు వీరులు, కొందఱు పాళెగార్లుండిరి. మధ్యేమార్గమున నచ్చటనచ్చట మజిలీలు చేసికొనుచు మూఁడవనాఁడు మధురసైన్యములు మానామధురను చేరెను. ఎప్పటికప్పుడు శిబిరములు నిర్మింపఁబడెను. ఆహవశంఖములు పూరించఁబడెను. రణభేరులు మ్రోఁగింపఁబడెను. పాండ్యమండలాధిపుని సైన్యములు రామనాథపురముపై దండెత్తనున్నవని మధురవీరులు ప్రకటించిరి. ప్రచ్ఛన్నవేషధారులైయున్న సేతుపతిచారులు శరవేగమునఁ జని జడైక సేతుపతి కీవృత్తాంతము నివేదించిరి.

జడైకదేవుఁడు వికృతాట్టహాసము చేసెను. " 'కాఁగల పని గంధర్వులు చేసినారు' అన్నట్లు మధురవారు నాకు మంచియే యొనర్చినారు. ఈ ముసుఁగులో గ్రుద్దులాట యొకనాఁడు ముగియవలసినదే కదా? రామప్పయ్య బాపనయ్యకు శస్త్రము చేతికివచ్చినంతనే యొడలు తెలియుట లేదు. 'సాదు రేగినఁ దల పొలాన నిలువ' దను మాట ఎఱుఁగఁడేమో!" అనుచు సేతుపతి మంత్రులను, సైనికోద్యోగులను కలసి మంతనమాడెను. అల్లుఁడు వన్నిదొరను చూడఁగనే సేతుపతి యుత్సాహము ద్విగుణీకృత మయ్యెను. గంభీరస్వరమున, తానెంతమాత్రము తిరుమలశౌరికి కప్పము జెల్లింపననియు, యుద్ధము జరుగుట తమకు లాభదాయకమేయనియు సేతుపతి తన నిశ్చితాభిప్రాయమును దెలిపెను. ఆ సందర్భమున యుద్ధ మెంతమాత్రము శ్రేయోదాయకము కాఁజాలదను నొక వృద్ధబ్రాహ్మణుని శాంతవాక్యము లాసభాసదులకు రుచింపవయ్యెను. జడైక సేతుపతి తండ్రి కుట్టాన్ సేతుపతి కాలమునుండి యా బ్రాహ్మణుఁడు రామేశ్వరాలయమున నర్చకుఁడుగానుండెను. తన మాటలను లెక్కచేయమిని గ్రహించి యాతఁడు "మదాంధులకు హితవచనములు రుచించునా?" అని గొణిఁగికొనుచు నచటినుండి వెళ్లిపోయెను. నిండుసభనుండి వృద్ధబ్రాహ్మణుఁడు వెడలిపోవుట సేతుపతి కపశకునముగాఁ దోఁచెను. కాని యావేశపూరితుఁడై

యున్నందున తన్ను ప్రతిఘటించు వ్యక్తి తన యెదుట లేకుండుటయే శ్రేయస్కరమని సమాధానపడెను.

సేతుపతి హృదయాందోళనను గ్రహించిన వన్నిదొర మేఘగంభీరనిస్వనమున మఱవవీరుల యప్రతిమాన పరాక్రమమును, తెలుఁగువీరుల యారంభశూరత్వమును, రామప్పయ్య వృద్ధావస్థను గోరంతలు కొండంతలుగా వర్ణించి, స్వాతంత్ర్యేచ్ఛ ప్రతిప్రాణి సహజధర్మమని, అట్టియెడ మధురవారు తమ యధికారమునకు లోఁబడి కప్పమును చెల్లింపమనుట యన్యాయమని, దండెత్తివచ్చిన శత్రువుల బారినుండి దేశమును కాపాడుకొనుట ప్రతివీరుని విధ్యుక్తధర్మమని, ఈ యుద్ధమున న్యాయము తన వైపే యున్నందున రామనాథస్వామి యనుగ్రహించుట తథ్యమని యుపన్యసించెను. సభ్యుల హర్షధ్వానములు మిన్నుముట్టెను. సేతుపతికి చెప్పనలవికాని సంతోషము కలిగెను. వన్నిదొర వీరుఁడేకాక విద్వాంసుఁడుకూడ ననుట ప్రత్యక్షముగా నిరూపింపఁబడుట సేతుపతిని హర్షాంబుధిలో ముంచివేసెను. వన్నిదొరను వేనోళ్లఁ బొగడి సేతుపతి యాతని యుద్ధసన్నాహము స్వయముగాఁ జూడవలసినదని యాదేశించెను. తత్క్షణమే బుడతకీచుల సైన్యాధిపతికి, కొచ్చిన్ జమోరినునకు సహాయము చేయవలసినదిగా లేఖలు వ్రాయవలసినదని యాజ్ఞనొసఁగెను. సైనికోద్యోగులతో "మీ పరాక్రమమును పరీక్షించు సమయ మరుదెంచినది. 'గోరంత యాలస్యంబునఁ గొండంత ప్రయోజనము దప్పు'నని వినమా? ఇఁక జాగుసేయకుఁడు" అని హెచ్చరించి యంతిపురమున కరిగెను.

## తొలివిజయము

వన్నిదొర సమరసన్నాహములో నిమగ్నుఁడయ్యెను. మఱవసేనలను కొన్ని భాగములుగా విభజించి ప్రత్యేకదండనాథుల యాధిపత్యమున నుంచెను. బుడతకీచులు, కొచ్చినువారు సేతుపతికి సహాయము చేయ సమ్మతించిరి. సింహళమునుండి కొంత సైన్యము వచ్చిచేరెను. వన్నిదొరకు యుద్ధప్రయత్నములవలన నూపిరియాడుట లేదు. వర్ధనీదేవితో మాటలాడుటకుఁగూడ నతనికి వ్యవధి లేకుండెను. వన్నిదొర కొంతసైన్యమును పొగలూరు దుర్గమున సిద్ధముగా నుంచెను.

రామప్పయ్యకు వేగులవాండ్రు సేతుపతుల ప్రయత్నములను గూర్చి తెలియఁజేసిరి. వెంటనే పాళెపుదొరలతోను, శివరామయ్య రంగయ్యనాయకాదులతోను సంప్రదించి సైన్యమును మానామధురనుండి పొగలూరుకోటకుఁ దరలించెను.

మధురవీరు లాదుర్గమును ముట్టడించిరి. ఇతఃపూర్వము నిశ్శబ్దమైయున్న యా పరిసర ప్రదేశము ఫిరంగుల మ్రోఁతలతో, నేనుఁగుల ఘీంకృతులతో, సైనికుల హాహాకారములతో, గుఱ్ఱపు డెక్కల చప్పుళ్లతో నిండిపోయెను. దుర్గమును మధురవీరులు మహోత్సాహముతోఁ దాఁకిరి. రామప్పయ్య వ్యూహరచనాకౌశలము వల్లను, మధురవీరుల శౌర్యము వల్లను పొగలూరుకోటపై మధురవారి జయపతాక యెగిరినది. చేజిక్కిన కోటచుట్టు శిబిరములను రచించుకొని మధురవీరులు శత్రువుల సమర సన్నాహములను గమనించుచుండిరి.

పొగలూరి యాక్రమణ విషయము జడైకసేతుపతికి తెలియవచ్చెను. అతని మొగమున విషాదచ్ఛాయలఁ గాంచి అల్లుఁ డలజడిపడెను. తోడనే సైన్యాధిపతులతో మంతనమాడెను. ఆ సమాలోచన ఫలితముగా సేతుపతి సైన్యములు పాంబన్ కాలువను దాఁటి రామేశ్వరమునకు తరలింపఁబడెను. బుడతకీచులు, సింహళవీరులు, కొచ్చిన్ వారలును నచ్చటనే చేరియుండిరి. రామనాథపురమునుండి జడైక సేతుపతి సపరివారముగా వేంచేసెను. ఒకచో గుమిగూడియున్న సైన్యమును జూడఁగనే సేతుపతి కుత్సాహ మినుమడించెను. తనకు సహాయమైవచ్చిన పాశ్చాత్యవీరులను ప్రశంసించెను. “వీరులారా, యుద్ధసమయములం దుత్సాహము, శౌర్యములతోపాటు యుక్తిగూడ నావశ్యకమనుట మీకు తెలిసినదే. కావునకు దండెత్తివచ్చిన శత్రువు నెదుర్కొనక మనమిచ్చట వేచియుండుట జరిగినది. రామప్పయ్య సైన్యము పాంబన్ కాలువను దాఁటవలయునుగదా! ఇంతకు మీరు సమయము వచ్చిన వెనుదీయరని నా దృఢవిశ్వాసము” అని చెప్పెను.

జడైక సేతుపతి మాటలు మఱవ వీరులను సంతోషపఱచెను. కొందఱు “అయ్యో! రామప్పయ్య మఱలి పోవునేమో! మా చేతుల తీట తీఱుట యె?”ట్లని విచారించిరి. మఱికొందరు “శత్రువీరులను చీల్చి చెండాడినఁగాని మాకు తృప్తిగలుగదు. రామప్పయ్యను పరలోకమున కంపెదము” అని యార్భాటములు చేయసాగిరి.

పిదప సేతుపతి యల్లునిగూడి రామేశ్వరమందలి రామనాథుని సేవించెను. వారికి కోవెలయధికారులు స్వాగతమొసఁగిరి. స్వామివారికి నర్చనాదులు జరుపఁబడెను. ఆలయమున నొకభాగమునుండి వేదఘోష వినవచ్చుచుండెను. సేతుపతి ప్రసాదమును గైకొని వేయి కాళ్ల మండపమున విశ్రమించెను.

వన్నిదొర యంతఃపురాభిముఖుఁడై చనెను. వర్ధనీదేవి యాతని కొఱకెదురు చూచుచుండెను. గడచిన కొన్ని దినములనుండి కానరాని సంతృప్తిని భర్తమొగమునం

దామె గమనించెను. మందస్మితము దొలుకాడ నామె యాతని ననుసరించుచు నభ్యంతర మందిరములోని కరిగెను.

## పాంబనుపై ఆనకట్ట

సేతుపతి సర్వసైన్యముతో రామేశ్వరమున విడిసి యున్నాఁడన్న వార్త రామప్పయ్యకుఁ దెలియవచ్చెను. "యుద్ధము చేయక, సేతుపతిగర్వ మణఁచక మధుర కేమని మరలుదము? లేదా ఎన్నాళ్లిచ్చట వేచియుండఁ గలము? కావున శత్రువున్న చోటి కరుగుటయే కర్తవ్యము" అని రామప్పయ్య సైనికులతో నుడివెను. రంగయ్య నాయఁడు, శివరామయ్యయు నతనితో నేకీభవించిరి. "కాని పాంబను కాలువను దాఁటుట యెట్లు? దాఁటక శత్రువును కలియుట యెట్లు? కావున పాంబన్ కాలువపై సేతువు నిర్మింపవలసినదే. ఆ పని సులభసాధ్యమైనది కాదు. కాని గత్యంతర మేమున్నది?" అని రామప్పయ్య నుడివెను. "తెలుఁగువా రారంభశూరులని యిదివరకే యొక యపవాదున్నది. ఇప్పుడు మనము మధురకు మఱలిన నది తథ్యము కాఁగలదు. మానవశక్తికి మించిన కార్యమేదియు లేదు. పురుషప్రయత్న మెచ్చట సంపూర్ణముగా నుండునో యట భగవంతుని సాహాయ్యము తప్పక లభించును. కావున మన శస్త్రాస్త్రముల నటుంచి, పారలను, గడ్డపారలను చేపట్టి పాంబను కాలువను తరించు ప్రయత్నమునకుఁ గడంగుదము" అని పలికెను.

రామప్పయ్య యాజ్ఞ శిరసావహింపఁబడెను. పాంబను కాలువపై నానకట్టకు దళవాయి స్వయముగా శంకుస్థాపన చేసెను. మధురవీరు లుత్సాహముతో ఆళ్లను ప్రోగుజేసి సేతుబంధనకుఁ గడంగిరి. ఒడలు వంచి రాత్రియనక పగలనక, యెండనక, వాననక మధురసైనికులు వారము దినములలో నొకవిధముగా సేతునిర్మాణమును బూర్తిగావించిరి. రామప్పయ్య సంతోషమునకు మేర లేకుండెను. ఉత్సాహవంతులు, ప్రభుభక్తిపరాయణులగు జనులుండ సాధించరాని కార్యమేమియు నుండదని యాతఁ డప్రయత్నముగాఁ బలికెను. శివరామయ్య మామగారి పూనికను ప్రశంసించెను. "పట్టుదలయే ప్రతికార్యమునకు ముఖ్య" మని రంగయ్యనాయకుఁడనెను.

"ఆ నాఁడు శ్రీరామచంద్రుడు సేతుబంధన మొనర్చి వారిధి దాఁటి రావణుని మద మణఁచెను. ఈ నాఁడు దళవాయి రామప్పయ్య పాంబను కాలువపై సేతువును నిర్మించినాఁడు. ఇఁక సేతుపతి మద మణఁచగలఁడు" అని పాళెగార్లు ప్రశంసించిరి.

ఈ విషయము నెఱింగిన జడైక దేవసేతుపతికి విషాద సంభ్రమాశ్చర్యములు కలిగెను. "తెలుఁగువారి కింత కార్యదీక్ష యుండునని నేననుకొనలేదు. రామప్పయ్య యెట్లైనను మనల నెదుర్కొన నుద్దేశించినట్లున్నది. అనతికాలములో పాంబనుపై నానకట్ట నిర్మించుటయే యతని కార్యదీక్షకు తార్కాణమగుచున్నది" అను మామగారి మాటల కడ్డువచ్చి, వన్నిదొర "ఇంతమాత్రమునకే జడిసిన నెట్లు? గొప్పవారిని ఢీకొనినప్పుడే గదా మన ప్రతిభ వ్యక్తమగుట కవకాశము లభించుట!" అనెను.

## సంకులసమరము

యుద్ధము ప్రారంభమయ్యెను. మధురవీరులు, మఱవవీరులు నొకరినొక రెదుర్కొనిరి. ఘోరయుద్ధము జరిగెను. మఱవవీరుల పరాక్రమమునకు రంగయ్యా నాయఁకుడు, శివరామయ్య ముక్కుమీఁద వ్రేలిడుకొనిరి. నాలుగురోజు లెడతెగని యుద్ధము జరిగెను. సైనికు లెందఱో వీరస్వర్గ మలంకరించిరి. రామప్పయ్య ప్రతిదినమును యుద్ధసమాచారములను తిరుమలేంద్రునకు రహస్యచారుల మూలమున నివేదించు చుండెను. ఐదవనాఁటి యుద్ధము బహుతీవ్రముగా నుండెను. రంగయ్య నాయని యాధ్వర్యమున మధురవీరు లనన్య పరాక్రమమును ప్రదర్శించుచుండిరి. ఇంతలో జడైకదేవుఁడే స్వయముగా యుద్ధభూమి కరుదెంచెను. ఈ విషయ మెఱింగి రామప్పయ్యయుఁ దన సైనికుల కుద్బోధవాక్యము లుపదేశించుచు రణరంగమున నడుగిడెను. ఉభయసైన్యములు పరస్పర విజయాకాంక్షితములై ప్రాణములను లెక్కసేయక పోరుచుండెను. తెఱపిలేక సాయంకాలమగువఱకు యుద్ధమట్లు సాగుచునే యుండెను. చీఁకటిపడువేళకు యుద్ధము విరమింపఁబడెను. రామప్పయ్యకు బలమైన గాయములు తగిలియుండెను. రంగయ్యనాయఁడుకూడ అలసియుండెను.

ఆ నాఁడు వన్నిదొరను రామప్పయ్యయు, రంగయ్య నాయఁడును కలసి ప్రతిఘటించిరి. పసిగొన్న వ్యాఘ్రమువలె వన్నిదొర వారిపైఁ బడెను. భయంకరమగు నాసందడి కయ్యమున నొడలెఱుఁగక యావీరవతంసులు పోరుచుండిరి. జడైకదేవుని శివరామయ్య యెదుర్కొనెను. వన్నిదొరతో నున్న మఱువ సైన్యాధిపతి దురదృష్ట వశమున తొలుతనే పడిపోయెను. ఒంటరిగా నున్నను వన్నిదొర శత్రువులకు బహురూపముల గోచరించుచు వారిని నుగ్గునుగ్గు చేయుచుండెను. అదేమి ప్రారబ్ధమో! వన్నిదొరకు తోడెవ్వరును రారైరి. ప్రసిద్ధిగన్న వీరుఁడగుటచే నాతఁ డానాఁటి సవ్యసాచివలె రంగయ్యనాయనికి, రామప్పయ్యకు బదులు చెప్పుచుండెను. రక్తము

కాలుచున్నను లెక్కచేయక యా వీరుఁడట్లే సూర్యాస్తమయమువఱకు పోరెను. కాని తర్వాత మూర్ఛిల్లెను. జడైకసేతుపతి కప్పటికిఁగాని తన యల్లుని తలఁపు రాలేదు. వచ్చి చూచునప్పటికి కాతనికి భయము కలిగెను. వెంటనే వెజ్జుల రావించెను. వన్నిదొరను అంతిపురమునకుఁ గొంపోయిరి. పరిస్థితి చాల విషమముగా నున్నదని వైద్యులు విన్నవించిరి. వర్ధనీదేవి కనులనుండి యశ్రుప్రవాహము ధారాపాతముగాఁ గురియుచుండుటను జడైక సేతుపతి చూడలేకపోయెను. వెఱ్ఱివానివలె నిటునటు పరువెత్తెను. కుమార్తెకు ధైర్యము చెప్పెనుగాని యతని మనము కల్లోలితమై యుండెను. తన కుమార్తె సౌభాగ్యమునకై యిలువేల్పగు రామనాథస్వామిని ప్రార్థించెను. ఆ రాత్రి సేతుపతి యంతిపురమున నెవ్వరు ఱెప్పవాల్చలేదు.

పరిస్థితులనుబట్టి మానవులు మాఱినను ప్రకృతి మాత్ర మెన్నఁడు తన సహజధర్మమును వీడదు గదా! తొలికోడి కూసెను. తెరలు తెరలుగ కాంతిరేఖలు వచ్చుచుండెను. పక్షుల కిలకిలారవములు విననయ్యెను. తూర్పుకొండపై బాలభానుఁ డుదయించెను. వన్నిదొర కింకను ప్రజ్ఞ రాలేదు. వైద్యుల ముఖములందు నిరుత్సాహము ప్రకటితమగు చుండెను. వర్ధని వదన మప్పుడే యారిపోనున్న దీపకళిక వలె ఎఱ్ఱగానుండెను. నూనె లేకున్న దీపము కొడిగట్టి గట్టెక్కునట్లామె పరిస్థితియు నుండెను. వన్నిదొర తన కింక దక్కఁడా! అతనితోడి కాఁపురము మూన్నాళ్ల ముచ్చటే కానున్నదా! ఇఁక తన జీవితమునకు వెలుఁగిచ్చువారెవ్వరు? ఇట్టి యాలోచన లామెను ముంచివేసెను. కారుమబ్బుల మధ్య తళుకొత్తు తటిల్లతవలె నామె యాయేడ్పుతెరల నడుమ గోచరించుచుండెను. చూపరుల కామెపై జాలి గలుగుచుండెను. జడైక సేతుపతి వెఱ్ఱివానివలె హాహాకారములు చేయుచుండెను. “ఎన్ని యుద్ధములు చేయలేదు? ఎందఱు మరణించలేదు! కాని వన్నిదొర! తనకు జీవగఱ్ఱయైన వర్ధని సౌభాగ్యజ్యోతి ఆరిపోనున్నదన్న తాను బ్రతికి యేమి ప్రయోజనము?” అని విలపించుచుండెను. ఇంతలో నాడిని పరీక్షించుచుండిన వెజ్జు పెదవివిఱిచెను. ఒక్క పెట్టున నార్తనాదములు విననయ్యెను. వన్నిదొర వీరుల స్థిరావాసమున కరిగెను. సూర్యుఁడు సంపూర్తిగాఁ గాననయ్యెను. వర్ధని జీవితభానుఁ డస్తమించెను. “ఏమి కాలవైపరీత్యము! ఇరువదియేండ్లకే నీకు నూఱేండ్లు నిండినవా?” యని సేతుపతి దుఃఖాతిశయమున పెనుకేక లిడుచుండెను. వర్ధని గళము రుద్ధమయ్యెను. నోటినుండి మాట వెడలకుండెను. కన్నీరుమాత్ర మామెకు తెలియకయే వఱదగట్టుచుండెను ఆ దృశ్యము శత్రువుల హృదయములను గూడ కదల్చివైచునదైయుండెను.

లోకవృత్తమే విచిత్రమైనది. బొందిలో ప్రాణము లున్నంతవఱకు మానవులు తమకన్న లేరని విఱ్ఱవీగు చుందురు. ఎంతటివాఁడైనను ఆ గుటికెఁడు ప్రాణములు పోయినతర్వాత నస్పృశ్యమగు హేయవస్తువుగా మాఱును, ఇఁక జనావాసమున నాతనికి స్థానమేది?

వన్నిదొర యంత్యక్రియలకై రాజపురోహితులు సర్వమును సిద్ధముచేసిరి. వర్ధని కొంతసేపటి కచ్చటి కేతెంచెను. సేతుపతి యామెను గౌఁగలించుకొని పలవించెను. వర్ధని యేదో మాట్లాడ సంకల్పించెను. కాని దుఃఖభారముచే నామె పలుక లేకపోయెను. భయంకరమగు నిశ్శబ్ద మా ప్రదేశము నావరించెను. వర్ధని సేతుపతిని చూచి "నాయనా! నా భర్తతో సహగమన మొనర్చుటయే నా తుదికోర్కె" అని ప్రార్థించెను. "తల్లీ! వద్దు! నా యెదుట నా తపఃఫలము భస్మమగుట నేను జూడలేను" అని సేతుపతి ఱొమ్ము బాదుకొనెను. వర్ధని దృఢనిశ్చయమున కాతఁడు పెదవి గదపలేకపోయెను. రామనాథస్వామిని తుదిమాఱుగా సేవించి భర్తశవము ననుసరించి వర్ధని శ్మశానమున కేగినది. ఆ దృశ్యమును జూచి కంట తడిబెట్టనివారుండరు. వన్నిదొర దంపతుల నొకటి చేసిన హవ్యవాహనుఁ డాపూతచరిత్రులఁ దనలో లీనము చేసికొనెను.

జడైక సేతుపతి యింటికి మఱలెను. ఈ యపారదుఃఖమాతనికి జీవితముపైగల యాశను పోఁగొట్టెను. సైనికాగారమునకు వెళ్లి యుద్ధమునకు సన్నద్ధులు కావలసినదని మఱవవీరుల కాజ్ఞయిచ్చెను. తానును శస్త్రసన్నద్ధుఁడై రణరంగమునకు తరలెను. సేతుపతి ప్రవర్తన సైనికుల కాశ్చర్యము గలిగించెను. "వన్నిదొరను బలిగొన్న రామప్పయ్యను, అతని సైన్యమును బలిగొన్నఁగాని నాకు తృప్తిలేదు" అని సేతుపతి శత్రువులపై నుఱికెను. నాఁడు రామప్పయ్య యుద్ధమునకు రాలేదు. సేతుపతికండ్లాతని కొఱకై వెదకెను. "ఎక్కడ మీ దళవాయి? నా అల్లుని పొట్టఁబెట్టుకొన్న ఆ రాక్షసుఁ డేఁడీ?" అని సేతుపతి యఱచుచుండెను. జడైకదేవుని కోపమునకు పలువురు మధురసైనికు లాహుతియైరి. సాయంసమయ మయ్యెను. సేతుపతి "రామప్పయ్య కన్పింపఁడేమి? కన్పింపఁడేమి?" అనుచు యుద్ధభూమినుండి మఱలెను.

మరుసటి దిన మతిప్రాతఃకాలముననే సమరము ప్రారంభమయ్యెను. వైరి సైన్యమునందు రామప్పయ్యను జూడఁగనే సేతుపతి కొడలు తెలియదయ్యెను. ఒక్క

పెట్టున తన హస్తమందలి ఖడ్గము నాతనిపై విసరెను. ఇంతకు ముందే నీరసించియుండిన రామప్పయ్య నా యాఘాతము కూలఁద్రోసెను. ఆతనిని శిబిరమునకుఁ గొంపోయిరి. వైద్యులు చికిత్స చేయఁగడంగిరి.

ఇంతలో నిక్కడ జడైకదేవుని మధురవీరులు బంధించిరి. ఇఁక నేమున్నది? సేతుపతి బందీయైన వృత్తాంతము చెవిసోఁకిన వెంటనే బుడతకీచులు పలాయితులైరి. మధురవీరులు విజయభేరి మ్రోఁగించిరి. కాని శిబిరమున రామప్పయ్య యంతిమావస్థలో నుండెను. ఈ విషయమును దెలిసి శివరామయ్య. రంగయ్యనాయకాదులు ఖిన్నులైరి. మధురవీరులు రామప్పయ్యచుట్టు గుమిగూడిరి. రామప్పయ్య అల్లుఁడు శివరామయ్య యొక్కయు, రంగయ్య నాయనియొక్కయు చేతులుకలుపుచు, “నన్ను గురించి విచారింపకుఁడు. జడైకదేవుని జయించి జయశ్రీని తిరుమలేంద్రుని కర్పింపుఁడు. తలపెట్టిన కార్యము కొనసాగించవలయును గదా!” అనునంతలో జడైకదేవుఁడు బంధితుఁడయ్యెనను వృత్తాంతము వినవయ్యెను.

రామప్పయ్య “నా మనము తృప్తినందినది” అనుచుఁ బ్రాణములు వదలెను.

“మా యేడుగడ యస్తమించెను” అని మధురయోధులు విలపించిరి. తిరుమలేంద్రు నెట్లు దర్శింతునని రంగయ్యనాయఁడు విచారించెను. దుఃఖము మధురవీరులను ముంచివేసెను. ఎచ్చటచూచిన రోదనముతప్ప మఱేమియు వినదయ్యెను. రామేశ్వరమునందే రామప్పయ్యకుఁ బారలౌకిక క్రియలను శివరామయ్య యథావిధిగ నిర్వర్తించెను. మధురవీరులు జడైక దేవుని సంహరింతుమని యుద్రేకమును బ్రకటింపసాగిరి. బందీగా తిరుమలేంద్రున కర్పించుటయే మేలని రంగయ్యనాయఁడు సలహాయిచ్చెను. మఱునాఁడు మధురానగరమునకు ప్రయాణమని చాటింపఁబడెను. ఇంతలో బంధితుఁడు కానవచ్చుట లేదని సైనికులు తెలియఁజేసిరి. కాగడాలను వెలిఁగించి నలుమూలల వెదుకసాగిరి. కాని జడైకసేతుపతి యెచ్చటను గానరాలేదు. తిరుమలనేంద్రుని నెట్లు దర్శింతుమా యని కలవరపడుచున్న శివరామయ్య కీశత్రుపలాయనము మఱింత బాధకలిగించెను. కింకర్తవ్యతామూఢుఁడై యిటునటు ఆ రాత్రి యంతయుఁ బచారు చేసెను. మఱునాఁడు సర్వపాపహరమగు నా సేతుతీర్థమున స్నానము చేసివత్తమని బయలుదేఱెను. అచ్చట జనులు గుంపులుగూడి యుండిరి. వారిని విచారింపఁగా సేతుపతి సముద్రమున నుఱికి ప్రాణత్యాగ

మొనర్చుకొనెనని కొందఱు, ముత్యపుచిప్పల నేఱు నీఁతగాం డ్రా శవమును తీరమును జేర్చిరని కొందఱును తెలిపిరి.

## స్మృతిచిహ్నము

సేతుపతిని జయించిన వృత్తాంతమును, రామప్పయ్య మరణమును తిరుమలశౌరి నాయనయ్యకుఁ దెలిసెను. ఒకవైపు సేతుపతివంటి వీరునిపై విజయము సాధించితి మన్న సంతోషము, మఱియొకవైపు తనకు తండ్రివలె సర్వకార్యముల నిర్వహించు ప్రధాని, దళవాయిఁ గోల్పోతి మన్న దుఃఖమును నతనిఁ గలఁచివేసెను.

జైత్రయాత్ర సలిపి విజయోన్ముఖులైన వీరవతంసులకు మధురనాయ కేంద్రుఁ డెదురేగెను. కన్నీరు మున్నీరుగా వారలకు స్వాగత మొసఁగెను. అతని వెంట రామప్పయ్య జ్యేష్ఠసోదరుఁడు వైద్యనాథయ్యయు నుండెను. "విధిబలీయ" మని యెవరెంత జెప్పినను తిరుమలశౌరి దుఃఖమాగకుండెను. రంగయ్యనాయఁడును, శివరామయ్యయు నధోముఖులై యుండిరి. తిరుమలశౌరి వారలఁ గౌఁగలించుకొని విలపించెను. ఇంతలో నాతని కనులముందు రామప్పయ్యమూర్తి గోచరించిన ట్లొక యనుభూతి కలిగెను. "ఐకమత్యమే మీ నాయకరాజులయం దున్నచో మిమ్మెదుర్కొనువా రెవ్వ"రను దళవాయి ప్రధాని మాటలు స్ఫురణకు వచ్చెను. తిరుమలశౌరి కనులను దుడుచుకొనెను. చూపరుల కాతని నయనములలో నేదో దివ్యతేజస్సు గోచరించెను. అతఁడు శివరామయ్యను, రంగయ్యనాయని, యుద్ధమున సహాయమొనర్చిన వీరవరేణ్యుల నందఱను ప్రశంసించి యుచితరీతిని సత్కరించెను. "ఇఁక ముందుగూడ మాకు సహాయకారులై దేశమున శాంతిభద్రతలను సంరక్షింపుఁడు" అని తిరుమలశౌరి వారలను గోరెను. వారలును దమ యంగీకారమును వినయపూర్వక నమస్కృతుల మూలమునఁ దెలిపిరి.

విజయభేరులు మధురాపట్టణమున మాఱుమ్రోఁగుచుండెను. తిరుమలశౌరి నాయకేంద్రుని యాజ్ఞానుసారముగా రామప్పయ్య శిలావిగ్రహము సభాభవనమునఁ బ్రతిష్ఠింపఁబడెను. చతుర్వేదిమంగల గ్రామమున రామప్పయ్య నిర్మించిన శివాలయమునఁగూడ శిల్పి యతని విగ్రహము నొక స్తంభమున చెక్కియుండెను.

రంగయ్యనాయనికి ప్రాణమిత్రుని యెడబాటు సమ్మెటపెట్టయ్యెను. అతఁడు వెఱ్ఱివానివలె రామప్పయ్య విగ్రహమును జూచుచు నట్లే నిశ్చేష్టుఁడగును. 'ఐకమత్యము'

అని యేదో గొణఁగుకొనుచు తిరుగుచుండును. తిరుమలశౌరి రామప్పయ్య విగ్రహమునకు మ్రొక్కుచుండెడివాఁడు.

స్వయంకృషి ఫలితముగా నున్నతస్థానము నాక్రమించి, చాకచక్యముతోఁ గార్యనిర్వహణ మొనర్చి, తన బహుముఖప్రతిభ ప్రకటించిన తెలుఁగు వీరుఁడు రామప్పయ్య. ఐకమత్యముతో నుండుఁడనునది యతని యమర సందేశము.

పరస్పర విద్వేషమును మాని సామరస్యము సాధించితిమేని విశ్వమానవ సౌభ్రాత్ర మేర్పడఁగలదు. అదియే విశ్వశాంతికి కీలకమంత్రము కాఁగలదు.

★ ★ ★

## రామప్పయ్యనాఁటి మధుర

మధుర అనాదికాలమునుండియు చరిత్ర ప్రసిద్ధిజెందిన పట్టణరాజము. రెండువేల సంవత్సరములకుఁ బూర్వము నుండియు నీ పట్టణ మొక రేవుగా, వ్యాపారకేంద్రముగాఁ బ్రసిద్ధికెక్కియుండినది. పూర్వపు మధుర నేఁటి మధుర కాదు. తొలుత సముద్రపుటొడ్డున నుండిన పట్టణము మునిఁగి పోయినది. మరల నొక నగరము సముద్రమునకు కొంత దూరమున నిర్మితమైనది. అదియును వారాశిని మునిఁగిన తర్వాత మఱికొంత లోభాగమున నేఁటి మధురానగర మేర్పడినది. భారతదేశములో ఆర్యావర్తమున నొక మధుర కలదు. కాని దానికి మన దక్షిణ మధురకున్న చారిత్రకప్రసిద్ధి లేదు. ఉత్తరమధుర కృష్ణావతారముతో సంబంధించినది. మోక్షదాయకములగు సప్తపురములలో రెండవదిగా నా మధుర పేర్కొనఁబడినది. కాని చారిత్రకముగా రెండువేల సంవత్సరములకు పైఁగా ప్రఖ్యాతికెక్కిన దక్షిణ మధురయే మన రామప్పయ్యకు సంబంధించినది.

మధుర వైఘనదీతీరమున కలదు. పాండ్యరాజుల కీపట్టణము స్థిరమైన రాజధాని. 'శిలప్పదికార' మను తమిళ కావ్యములో నీ పట్టణజీవిత మత్యద్భుతముగ ప్రతిబింబితమైనది. అన్యాయముగా తన భర్తకు మరణదండన విధించిన పాండ్యరాజు నెదుట సత్యమును నిరూపించి కణ్ణకి యను సాధ్వి మధుర మండిపోవునట్లు శపించినది. తర్వాత మరల మధురానగరము పునర్నిర్మితమైనది. పాండ్యరాజు లతి ప్రాచీనకాలము నుండి విదేశములతో వర్తకము చేయుచుండిరి. పురాతత్త్వపరిశోధకుల కీప్రదేశమున నెన్నియో విదేశీయుల ప్రాఁతనాణెములు లభ్యములైనవి. ఇట్టి మధుర పాండ్య మండలమునకు రాజధానియై, పాండ్యవంశీయుల పాలనమున దివ్యశోభతోఁ దేజరిల్లినది. కాని మహ్మదీయ సుల్తానుల దండయాత్రలు పదుమూఁడు పదునాలుగు

శతాబ్దములలో దక్షిణదేశమునకు ప్రాంకినవి. అల్లాఉద్దీను ఖిల్జీకాలమున మాలిక్ కాఫర్ అనునతని సేనాని దేవగిరి యాదవులపై, మధుర పాండ్యులపై, ఒరంగల్లు కాకతీయులపై దండయాత్ర చేసెను. అటుతర్వాత మధురానగరము కొద్దిరోజులు సుల్తానుల పాలనలో నుండెను. విజయనగర సామ్రాజ్య సంస్థాపకులలో నొకరగు బుక్కరాయల కుమారుండు కంపరాయలు దక్షిణదేశ దిగ్విజయము సేయనెంచెను. మధురను సమీపించుసరి కాయూరి గొల్లెత యొకర్తు తమ దయనీయస్థితిని సూచించెను. కంపరాయలు మహమ్మదీయ పరిపాలన మంతమొనర్చి, పాండ్యవంశమునకుఁ జెందిన రాజకుమారుని కారాజ్య మొసంగి విజయనగర రాజులకు కప్పము చెల్లించు నేర్పాటు గావించెను. అప్పటినుండి పాండ్యరాజులు విజయనగర చక్రవర్తులకు సామంతులై యుండిరి. కాని కృష్ణరాయల కాలమున దక్షిణదేశ రాజులు సరిగాఁ గప్పము చెల్లింప నందున నాతఁడు మఱియొకమాఱు దక్షిణదేశ దండయాత్ర చేయవలసి వచ్చెను. కృష్ణరాయలు పూర్వ రాజవంశము వారికిఁగాక తనచే నియమితులైన రాజప్రతినిధుల కాయారాజ్యములను హస్తగత మొనర్చెను. వీరే కాలక్రమమున స్వతంత్రులై నాయకరాజు లనుపేర వ్యవహరింపఁబడిరి. నాయకరాజులలో తిరుమలశౌరి నాయకుఁడు క్రీస్తుశకము పదునేడవశతాబ్దము ప్రారంభమున రాజ్యమేలెను.

ఈ తెలుఁగు నాయకరాజుల కాలమున మధురలో తెలుఁగుపాట, తెలుఁగుమాట నూతనశోభతో వెలుఁగిందినవి. తెలుఁగుభాష రాజభాషయై రాజాశ్రయమున దివ్యతేజస్సు నందినది. శిల్పము, చిత్రలేఖనము మొదలగు లలితకళలు వారికాలమున క్రొత్తఁదనమును పొందినవి. సంగీతము, కవిత్వము సరిక్రొత్త మెఱుఁగులతోఁ దళతళలాడినవి. నాయుక రాజులందఱు మతసహిష్ణుతను బ్రకటించిన యుదారహృదయులు. ప్రజల క్షేమమే తమ కామ్యముగా నెంచి యనవరతము పరిశ్రమించిన యశశ్శరీరులు. జీవితమే యొక కళగా నొనర్చుకొని నాయకరాజులు, ఆ కాలపు ప్రజలు సార్థకజీవనములను గడపిరి. మధుర మన రామప్పయ్యనాఁటి కాలమున నొక నాగరకతాక్షేత్రము; సంస్కృతి కునికిపట్టు; లలితకళలకు పుట్టినిల్లు.

మధురలో విద్వాంసు లనేకులుండిరి. తర్కము, మీమాంసము, జ్యోతిషము – ఒక్కొక్క దానిలో నొక్కొక్కరు నిష్ణాతులైయుండిరి. వైద్యము చేయుటయే వృత్తిగా కొందఱు జీవించుచుండిరి. వివిధములగు మూలికల సేకరించి, రసాయనములు, లేహ్యములు, మాత్రలు, కుప్పికట్లు మొదలగు వానిని సిద్ధపఱచుచుండిరి. రోగులు తమ యార్థిక

పరిస్థితి ననుసరించి వస్తురూపముగనో, ధనరూపముగనో వైద్యునకు ముట్టఁజెప్పు చుండిరి. ప్రజలకు శకునములపై నమ్మకము మెండు. భూతవైద్యము కూడ నానాఁట ప్రబలియుండెను. గాలిసోఁకిన వ్యక్తులను గ్రామములకు వెలుపల కూర్చుండఁ బెట్టి భూతవైద్యులు వేపాకుల దిగదుడుపులు, నిమ్మకాయల మంత్రింపులు జరుపుచుండిరి. మొగమున పట్టెఁడు కుంకుమ పెట్టుకొని పెద్ద పెద్ద రుద్రాక్షలను ధరించి భూతవైద్యులు దయ్యములకే కాక మానవులకుకూడ భీతిని కలిగించుచుండిరి. ప్రతిదినము భోజనమునకు ముందు కాకులకు పిండముపెట్టుట యాచారమైయుండెను. జ్యోతిష మొకకళగా కాక వృత్తిగాకూడ కొందఱవలంబించి యుండిరి. గ్రహముల స్థానముల ననుసరించి జాతకచక్రములను బట్టి భవిష్యత్తును తెలియఁ జెప్పుచుండిరి. గ్రామపు చావడియందు కొందఱు గుంపులుగూడి తమ చేతులను చూపి ఫలితముల నడుగు చుండెడివారు. జ్యోతిష సాముద్రిక శాస్త్రముల మూలమున కొందఱి జీవనము గడచి పోవుచుండెను. దినవార నక్షత్ర యోగకరణములను పాటించుట ముఖ్యసాంఘిక లక్షణమై యుండెను. ఆదివారము సూర్యునికి పూజలు, వ్రతములు చేయుచుండెడివారు. సోమవారము శివప్రీతికరమైనది కావున ప్రతివారు శివార్చనలను చేయుచు నక్త ముండెడివారు (నక్త మనఁగా, పగలంతయు భోజనము చేయక చంద్రోదయకాలమున పారణచేయుట). మంగళవారము అంగారకుని వారము. ఎఱ్ఱని వస్తువులు, కందులు దానము చేయుచుందురు. బుధవారము బంగారము వంటిదని మంచి కార్యములను మొదలు పెట్టెడివారు. గురువారమున బృహస్పతి పూజలు జరిగెడివి. శుక్రవారమునాఁడు మీనాక్షీదేవికి ప్రత్యేకమగు అభిషేకము, పంచామృతస్నానము జరిగెడివి. భక్తుల కాదేవి పవిత్రాభిషేక, మజ్జన ప్రసాదముల నిచ్చెడివారు. అర్చనలతో, అష్టోత్తర సహస్రనామార్చనలతో మీనాక్షి యాలయము ప్రాతఃకాలమునుండి మధ్యాహ్నమువఱకు, తర్వాత నాలుగు గంటలు మొదలు సగము రాత్రివఱకు మాఱుమ్రోఁగుచుండును. శనివారమున పీడాపరిహారముగా నవగ్రహారాధనలు జరిగెడివి.

మీనాక్షీసుందరేశ్వరాలయ ప్రాకారపరిసరమున పువ్వుల గిడ్డంగి యొకటి యుండెడిది. రకరకముల పువ్వులు, వివిధ చిత్రవర్ణములతో, రాసులు రాసులుగా నా గిడ్డంగి యందుండెను. పూలనుకట్టి యమ్ముటయే వృత్తిగాఁ గలవారా గిడ్డంగియందు పది గంటలగుసరికి హాజరగుదురు. తమకుఁ గావలసిన పువ్వులను బుట్టలకు, గంపల

కెత్తికొని వెళ్లుదురు. స్త్రీలే యెక్కువ పువ్వులను కట్టుటయందు నిపుణలైయుండిరి. రకరకముల మాలలు కూర్చుటయందు, స్త్రీలు ధరించుట కనువగు పూలచెండ్లు కట్టుటయందు, దేవాలయము నలంకరించుటకు సరియగు పుష్పతోరణములు రచించుటయందు మధుర యువతు లతినిపుణలు. సాయంకాలమగు సరికి దేవాలయ ప్రాంతము పువ్వుల బుట్టలతో నిండియుండును. కమ్మని తావులా వైపునకు వెళ్లుసరికే మనల నాకర్షించును. ఉత్సవముల సమయములందు, పండుగ సమయములందు పువ్వు లమితముగా విక్రయింపబడును. మధురప్రజల లాలిత్యమున కీ పుష్పప్రియత్వము తార్కాణ మగుచున్నది.

దేవాలయమున కవ్వలివైపు ఒక మైలుదూరమున మేదరవాడ యుండెడిది. రకరకములు, రంగురంగుల తాటియాకుల బుట్టలు, పెట్టెలు, సజ్జలు, చాపలు అల్లుట అక్కడివారి వృత్తి. తమ తమ గుడిసెలలో ఆకులను చీల్చుట, రంగులలో నుడకబెట్టుట, వానిని అల్లుట మున్నగు కార్యములన్నియు చేయుదురు. అమ్మకమునకు దేవాలయమునకు రావలసినదే. దేవాలయము మధురలో నొక వ్యాపారకేంద్రము. ఆ చుట్టుపట్లనే దుకాణము లన్నియు నిండి యుండును. కొయ్యసామానుల యంగళ్లు, పట్టునూలు నేఁత బట్టల దుకాణములు, వెండి బంగారు వస్తువుల నమ్మ కొట్లు మధుర వారి పనితనమును వేనోళ్ల చాటి చెప్పుచుండును. సాయం సమయమగుసరికి మధురప్రజలు సాధారణముగా చల్లని గాలికై వైఘనది తీరమునకు వాహ్యాళి వెడలుదురు. లేదా దేవాలయమున కరుదెంచి స్వామిని సేవించి ముక్తిని, తత్ప్రాంతమున దుకాణములందమర్పఁబడియున్న వివిధ వస్తువులను జూచి రక్తిని బడయుదురు. సాయంసమయములందేకాక ప్రాతఃకాలమున కూడ దేవాలయప్రాంతము జనసమ్మర్ద సంకలితమై యుండును. సాధారణముగా భక్తిపరులు వైఘనదియందో, లేక స్వామివారి పుష్కరిణియందో గ్రుంకులిడి, ధౌతపరిధానములను గట్టి స్వామిని సేవింతురు. పూజారి ప్రాతఃకాల నైవేద్యముచేసి సంచారము చేయుచుండును. కొందఱు దేవాలయ మండపములం దాసీనులై శాస్త్రచర్చలు చేయుచుందురు. ప్రతిదినము రెండు పూఁటల నియతముగా బాలకులకు వేదాధ్యయన మచ్చట నేర్పఁబడును. ఇంకొకవైపున పాటకులు సంగీతము సాధన చేసికొనుచుందురు. దేవాలయమున ముమ్మాఱు నాదస్వరము, మంగళవాద్యముల గోష్ఠి స్వామి వారి సేవలో ముఖ్యములు. అప్పుడప్పుడు కావ్యచర్చలు, సంగీతగోష్ఠులు, నృత్యప్రదర్శనములు దేవాలయ విశాలమండపమున జరుగుట గలదు.

సంక్షేపముగాఁ జెప్పవలయునన్న నా దేవాలయము సర్వకళలకు నాకరము; సకలజన సంప్రీతికరము.

శిల్పకళ నాయకరాజుల కాలమున నూత్నకాంతులతో నలరినది. మధురయందలి తిరుమలనాయకుని మహలు, మీనాక్షీదేవాలయమందలి వేయి కాళ్ల మండపము రామప్పయ్య కాలమున నిర్మితములైనవి. ఆ కాలపు శిల్పుల పనితనము దేశదేశములవారిచే, తరతరములవారిచే ప్రశంసింపఁ బడినది. మీనాక్షీ దేవాలయము నందలి శిల్పములు, చిత్రములు చూపరుల నిశ్చేష్టులఁ గావించునవి. ఆ కాలపు శిల్పులు మూర్తిచిత్రణమున నిపుణులు, వారిచేతిలో నిర్జీవములగు పాషాణములు ఆర్ద్రభావములను రేకెత్తించుచు మనతోఁ జెలిమియాడు జీవమూర్తులో యన భాసిల్లినవి. చిత్రలేఖనమున నాఁటి చిత్రకారుల రేఖానిర్మాణము నవీన చిత్రకారులను కూడ 'నాహా' యనిపించునది. ఏదో దైవోపాసన లేనిదే యిట్టి యద్భుతనిర్మాణ మొనర్చుట సంభావ్యము కాదని మనవారి యభిప్రాయము. శిల్పులు, చిత్రకారులు తమ జీవితములను కళకే యంకిత మొనర్చిన ధన్యులు. వారి నాదరించి పోషించిన నాయకరాజు లాచంద్రార్కము స్తుతిపాత్రులు.

వాఙ్మయము వైపు దృష్టిని సారించితిమేని, నాయకరాజులు ప్రతివిషయము నందువలెనే యీ విషయమునను శ్రీకృష్ణదేవరాయలను దమ యాదర్శముగా గ్రహించినట్లు విశదమగును. విశ్వనాథనాయకుని స్థానాపతి కృష్ణదేవరాయల చరిత్రను, విజయనగర వృత్తాంతము, నతని రాజనీతిని వచనరూపమున వ్రాసెను. ఇందలి చరిత్రాంశములు పోర్చుగల్ దేశమునుండి వచ్చిన యాత్రికులు వ్రాసిన యంశములకు సరిపోవుచుండుటచే నీ గ్రంథము విలువ హెచ్చినది.

రామప్పయ్య కాలమున లింగనమఖి కామేశ్వరకవి, గణపవరపు వేంకటకవి మధురయాస్థానము నలంకరించి యుండిరి. లింగనమఖి కామేశ్వరకవి రుక్మిణీ పరిణయము, సత్యభామాసాంత్వనము నను రెండు ప్రౌఢప్రబంధములను రచించెను. వానిలో రుక్మిణీపరిణయము లభ్యముకాలేదు. కామేశ్వరకవి యీ రెండింటినేకాక యాంధ్రవచనవాఙ్మయమున వన్నెకెక్కిన ధేనుమహాత్మ్యమును రచించెను. గణవరపు వేంకటకవి మహాలాక్షణికుఁడగు కవి. అతఁడు రచించిన యాంధ్రప్రయోగ రత్నాకరమను లక్షణగ్రంథము, ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసమను నొక ప్రబంధమును ప్రఖ్యాతి జెందియున్నవి.

ఇట్లు కవిత్వము, చిత్రలేఖనము, శిల్పమేకాక, సంగీతముకూడ మధురనాయకుల మందిరమున మాన్యత నందినది. తిరుమలనాయకుఁడు సంగీతకళయం దతినిపుణుఁడు. లింగనమఖి కామేశ్వరకవి వీణావాద్యమునందు చతురుఁడై తన పోషకుఁడగు నాయకునిపై ననేకకృతులను పాడెను. ఆంధ్రసంగీత ప్రపంచమున త్రిమూర్తులని చెప్పఁదగిన అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య అనువారిలో క్షేత్రయ్య యీ మధుర సంస్థానమునకు మన రామప్పయ్య కాలముననే వచ్చి తిరుమల నాయకునిపై వేయి పదములను చెప్పెను. పల్లవి గోపాలయ్య యని ప్రసిద్ధిగన్న రాజగోపాల వాగ్గేయకారాగ్రణి, తిరుమలశౌరి కాలముననే మధురలో నివాస మేర్పఱచుకొని పెక్కురు శిష్యులకు సంగీతవిద్య నేర్పెను. ఈ రీతిగా సంగీతకళయు నాకాలమున నున్నతస్థితియందుండెను.

మధుర యందలి ప్రజల జీవితము శాంతిపూర్వకము, సుఖమయమునై యుండెడిది. మీనాక్షీసుందరేశ్వరుల దేవాలయమున నన్ని తరగతులవారును సమావేశమగు చుండిరి. రాజును ప్రజలకు సన్నిహితుఁడై యుండెను. అంతఃపుర జనమును స్వామిని సేవించుట కప్పుడప్పుడు దేవాలయమున కరుదెంచుచుండిరి. ప్రజలకు తమ పాలకునియెడ నభిమానమును, నాదరమును వెల్లివిరియుచుండెను. ఎడనెడ నెక్కడనైన నసూయామాత్సర్య జనితములగు విద్వేషములు గోచరించిన నవి రాజాజ్ఞచే నణఁచి వేయఁబడుచుండెను. ప్రజానురంజకుఁడగు పాలకుని రాజ్యములో ప్రజలలో తాము పాలితులమను నభిప్రాయమే యుండదు. రాజ్యమొక కుటుంబము వంటిది. రాజు గృహస్వామివంటివాఁడు. ఈ సదభిప్రాయము ప్రజలలో నిండియున్నంతవఱకే రాజునకు విచ్ఛేదముండదు. రాజు దృష్టిలోను పురజనులు తనకు సేవకులు గారు. తానే వారికి సేవకుఁడు. బాధ్యతాయుతముగ వారి సుఖదుఃఖములను విచారించి వారిని సంతృప్తుల నొనర్చుటయే తన విధి యని గుర్తించిన రాజు తిరుమలశౌరి. తమ నాయకరాజులలోఁగల పరస్పరవిద్వేషము పతనహేతువని అతనికి తెలియును. రామప్పయ్య రంగయ్య నాయకుల స్నేహసౌహార్దములను జూచి యాతఁడు సంతసించుచుండును. "ఐకమత్యమే మన తెలుఁగువారికున్న వారిని ఫాలాక్షుఁడు సైత మెదుర్కొనలేఁ" డని యతఁడనుచుండును.

నాయకరాజుల మతసహనము ప్రశంసనీయమైనది. ముఖ్యముగా మధురనాయకులు పరమతద్వేషులు కారు. రాబర్టు డి నోబిలీ యను నిటలీదేశ

క్రైస్తవగురువునకు మధురరాజులు తగిన వసతి నిచ్చిరి. వారు అతని మతప్రచారము నెంతమాత్రము నడ్డుకొనెడివారు కారు. నదులన్నియు సముద్రములో కలియునట్లు మతము లన్నింటికి ధ్యేయము భగవంతుఁడొక్కడే కావున, నేవిధాన మవలంబించినను లక్ష్యమొక్కటియేగాన, నొక మతమువారిని మఱియొకరు ద్వేషించుట తమ్ము తాము నాశనము చేసికొనుటయని నాయకరాజుల యభిప్రాయము. ఈ సదుద్దేశముతో నాయకరాజులు వైష్ణవమతానుయాయులయ్యు, శైవమును ద్వేషించువారు కారు. మీనాక్షీ సుందరేశ్వరులు వారి కులదైవమగుటయే వారి విశాలదృష్టికి మహత్తరతార్కాణము. రామప్పయ్యయు నితరవర్ణముల వారియెడ, మతముల వారియెడ, మతముల వారియెడ ననూనదయావాత్సల్యములఁ బ్రదర్శించెడివాఁడు. ఒకసారి రాబర్టు డి నోబిలీని కొందఱు సంకుచితహృదయులు నయవంచకుఁడని తిట్టుచుండిరి. రామప్పయ్యకు రాబర్టు డి నోబిలీయన్న నమిత గౌరవము. కావున నా క్రైస్తవగురువును నిందించు జనుల నంతికమునకుఁ బిలిపించి యిట్లు ప్రశ్నించెను : "నోబిలీ క్రైస్తవుఁడనియా మీ యభిప్రాయము?"

"సందేహ మేమి?"

"అతని వేషభాషలు హైందవసన్న్యాసులను బోలియుండలేదా, అతని దినచర్యయు మన భారతీయసంస్కృతి మార్గానుసారియేగదా, అతఁడెట్లు క్రైస్తవుఁడగును?"

"అదియే మేము చెప్పునది – నోబిలీ నయవంచకుఁడు".

"బ్రాహ్మణునిచే వండించుకొని శాకాహారము మాత్రమే యేకభుక్తము గావించుచున్నప్పటికి, హిందువుల వేషభాషలు, రుద్రాక్షమాలికలు ధరించినప్పటికి క్రైస్తవమతప్రచార మతని ప్రధానధ్యేయము. మధుర పట్టణవాసు లెందఱో అతని తియ్యని మాటలకు బేలుపోయి, క్రైస్తవులైరి. ఇది హిందూమతమునకు ద్రోహము కాదా?"

"ఎట్లగును? నోబిలీ, నాకు ఎఱుక గలవఱకు, నెవరిని తన ధర్మము స్వీకరింపుమని బలవంతపెట్టుట లేదు. ప్రజలకు తమ యిష్టప్రకారము పూజించుకొనుటకు, నారాధించుకొనుటకు స్వతంత్ర ముండి తీరవలయును గదా? కావున తమ యిచ్ఛానుసారము వారు ఏసుక్రీస్తును కొలిచిన తప్పేమి? సోదరులారా, భగవంతుఁ డొక్కఁడేయనుట మఱచితిరా? నామరూపములు మానవకల్పితములు.

నామాతీతుఁడు, రూపాతీతుఁడు, గుణాతీతుఁడు నగు జగన్నాయకుని నేరూపమున భజించిన నేమి? ఏ నామమున కీర్తించిన నేమి? నోబిలీ మనకు స్నేహితుఁడు. అతఁడు హైందవధర్మమును స్వీకరించినాఁడు. మీరు సందియమును వదలి మీ మీ కార్యములను గమనింపుఁడు. మతము వ్యక్తిగతము. దానిని గైకొని సంఘమునఁ గల్లోలమును రేకెత్తింపకుఁడు" అని రామప్పయ్య వారలను మందలించువాఁడు.

ప్రజల సుఖదుఃఖములను గమనించుచు, వారి వ్యక్తి స్వాతంత్ర్యమున కెంతమాత్రము నడ్డు తగులక నాయకరాజులు రాజ్యమేలిరి. ప్రధాని రామప్పయ్యయు తన వృత్తిధర్మము ననుసరించుచు, స్వామికి భృత్యుఁడై, ప్రజలకు మిత్రుఁడై మసలెను. మధుర రామప్పయ్య కాలమున నన్నివిధముల నున్నత స్థితియందుండెను.



## తిరుమల రామచంద్రగారి జీవిత సాహిత్య విశేషాలు

అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకా రాఘవంపల్లెలో 17 జూన్, 1913 (ప్రమాది జ్యేష్ఠ శుద్ధ చతుర్దశి) న తిరుమల శేషాచార్యులు, శ్రీమతి జానకమ్మలకు తిరుమల రామచంద్ర జన్మించారు.

**విద్యార్హతలు :** అలిగఢ్ ఆయుర్వేద విద్యాపీఠం నుండి ఆయుర్వేదభూషణ (1933), మద్రాసు విశ్వవిద్యాలయం నుండి తెలుగు-సంస్కృతంలలో విద్వాన్ (1936), పంజాబ్ విశ్వవిద్యాలయం నుండి హిందీ ప్రభాకర్ (1941) పూర్తి చేసిన వీరు లాహోర్‌లో బి.ఏ., చదువుకు వెళ్లారు కాని పూర్తి చేయలేకపోయారు. సంస్కృత, ప్రాకృత, తెలుగు, కన్నడ, హిందీ, తమిళ, ఆంగ్ల భాషల్లో గాఢమైన ప్రవేశం ఉంది.

**స్వాతంత్ర్య సమరయోధుడు :** ఉప్పు సత్యాగ్రహంలోను, వైయక్తిక సత్యాగ్రహంలోను పాల్గొని 12 నెలల కఠిన కారాగారశిక్షను అనుభవించారు (1930-32).

స్వాతంత్ర్య సేనానిగా సమ్మానం అందుకున్నారు.

**ఉద్యోగాలు :** డెయిలీ టెలిగ్రాఫ్, కాన్పూరు. తెలంగాణపత్రిక, హైదరాబాద్. మీజాన్ దినపత్రిక, హైదరాబాద్. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, భారతి, పరిశోధన, ఆంధ్రభూమి, హిందూస్థాన్ సమాచార్ మొ॥న పత్రికల్లో వివిధ హోదాలలో పనిచేశారు.

**నిర్వహించిన శీర్షికలు :** ఆంధ్రప్రభవారపత్రికలో నుడి-నానుడి, తెలుగుతల్లి, మరపురాని మనీషి, పదసంపద, మాటలకథ, ధర్మపీఠమ్, సంస్కృతి-సంప్రదాయం, హైదరాబాద్ లేఖ శీర్షికలను, ఆంధ్రసచిత్ర వారపత్రికలో హైదరాబాద్ నోట్‌బుక్, తెలుగు వెలుగులు శీర్షికలను, భారతిలో సాహితీసుగతుని స్వగతం, మనవిమాటలు; ప్రజాతంత్రలో ఇదీ మన హైదరాబాద్; ఆంధ్రప్రదేశ్‌లో రాజధాని విశేషాలు; పల్లకిలో ప్రాచీనాంధ్రగాథలు; పరిశోధనలో చరిత్రకెక్కని చరితార్థులు, తెలుగుతోబుట్టువులు; ఉదయం దినపత్రికలో మరోప్రపంచం; ఆంధ్రప్రభ దినపత్రికలో మాండలికాలు, పలుకుబడి అన్న శీర్షికలను నిర్వహించారు.

**ప్రచురణలు :** సంస్కృతంలో సత్యాగ్రహవిజయః, నాటకం (1930), సుమతిశతకమ్ (1932), హిందీలో ఆంధ్ర కే కుఛ్ త్యోహార్ రచనలు చేశారు. తెలుగులో రూట్‌మార్చ్ (సైన్యం కథలు) (1945), వీరగాథలు (1952), దక్షిణాంధ్రవీరులు (1953), లాల్‌బహాదూర్‌శాస్త్రి (1953), కాటమరాజు (1955), హిందువుల పండుగలు -పర్వాలు (1957), మన లిపి - పుట్టుపూర్వోత్తరాలు (1957), ధర్మదీక్ష (1958), శశాంకవతి (బృహత్కథ ఆధారంగా నవల) (1960), తెలుగు వెలుగులు (1962), నుడి నానుడి (1963), సాహితీసుగతుని స్వగతం (1970), నూరేళ్ల తెలుగు వ్యాసం (1975), మరపురాని మనీషి (లేఖినీచిత్రాలు) (1975), నాగలాపురం-దాని పరిసరాలు (చరిత్ర పరిశోధనం) (1975), గాథాసప్తశతిలో తెలుగు పదాలు (1980), మూడు వాఙ్మయశిఖరాలు (1988), తెలుగు పత్రికల సాహిత్యసేవ (1989), ప్రాకృత వాఙ్మయంలో రామకథ (1992), మనవిమాటలు (1992), బుద్ధుణ్ణి బళ్లో వేసిన కథ (1993), బృహదారణ్యకం (1993), అహం భో అభివాదయే (లేఖినీచిత్రాలు) (1995), హాలుని గాథలు- తెలుగు కథలు, నాలుగు చరిత్ర స్తంభాలు, హంపీ నుంచి హరప్పాదాక.

మనోరమా వాచకాలు, వివేకానంద వాచకాలు, ఆనంద వాచకాలు (1954-1956), వేయికి పైగా వ్యాసాలు, వందలలో పుస్తక సమీక్షలు చేశారు.

దాదాపు 17 కలంపేర్లతో పత్రికలలో రచనలు చేశారు.

**అనువాదాలు :** తమిళ, హిందీ, ఆంగ్ల భాషల నుండి 45 పుస్తకాల అనువాదం

**బిరుదులు, సన్మానాలు :** సాహితీసుగతుని స్వగతానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, హైదరాబాద్ (1970), "మహామహోపాధ్యాయ" బిరుదం, అఖిలభారత విద్వత్పరిషత్తు, వారాణసి (1978), 'గాథాసప్తశతిలో తెలుగు పదాలు' కు రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, హైదరాబాద్. (1980), గౌరవ డాక్టరేట్ బిరుదు, సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాద్ (1988), రాజా లక్ష్మీ అవార్డు, మద్రాసు (1989)

తన జీవితాన్ని సాహిత్యసృజనకే అంకితం చేసిన తిరుమల రామచంద్ర 12, అక్టోబరు 1997న హైదరాబాదులో పరమపదించారు.

# ఆంధ్రవీరులు

మహామహోపాధ్యాయ తిరుమల రామచంద్రగారు సంస్కృత, ప్రాకృత, ఆంధ్ర, ఆంగ్ల, హిందీ, కన్నడ, తమిళ భాషల్లో పండితులు. మన లిపి పుట్టు పూర్వోత్తరాలు, తెలుగువెలుగులు, నుడి నానుడి, మరపురానిమనీషి, గాథాసప్తసతిలో తెలుగు పదాలు, తెలుగు పత్రికల సాహిత్యసేవ, ప్రాకృత వాఙ్మయంలో రామకథ వంటి అనేక గ్రంథాలు రచించారు. హంపీ నుంచి హరప్పాదాక అన్న పేరుతో తన ఆత్మకథను రచించారు. అనేక గ్రంథాలు అనువదించారు. వ్యాసాలు రాసారు. బిరుదులు, సన్మానాలు పొందారు.



**తిరుమల రామచంద్ర**

**17.6.1913 - 12.10.1997**

ఆత్మగౌరవం, దేశభక్తి ప్రబోధించే ఆంధ్రవీరుల ఈ వీరగాథలు భారత స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఎంతో ప్రేరణనిచ్చాయి. కేవలం పోరాట సమయంలోనే కాక ఎల్లప్పుడూ ఇవి ఎల్లవారికే స్ఫూర్తినిచ్చేవే. ఈనాటి తమ అభ్యుదయానికి నాటివీరులు చేసిన త్యాగాలను ఈ తరం పిల్లలు తెలుసుకోవాలి. స్ఫూర్తి పొందాలి. తమ జీవితాలను ఆ ఆదర్శాల నేపథ్యంలో రూపుదిద్దుకోవాలి. తిరుమల రామచంద్రగారి స్ఫూర్తిదాయక రచన ఆంధ్రవీరులు.




రూ. 60/-



ISBN 978-93-82203-76-6
9 789382 203766